కం॥ దీనజన రక్షణంబును
దానగుణంబును శమంబు దయయును సత్యం
బూనిన ప్రియవాక్యంబుల్
మానితమైనట్టి సజ్జన వ్రతమెందున్॥ 28

కం॥ ఘనమగు దయతోడుత నా
తని యలమటఁ దనదిగాగఁ దలఁపుచుఁ గడుదీ
నుని రక్షింపఁగవలయున్
జనపతి దనుమెచ్చి యఖిలజనము నుతింపన్॥ 29

కం॥ అనిశము దుఃఖసముద్రం
బున మునిఁగెడు దీనజనుని బ్రోతురు దయ పే
జనములు వారలకంటెను
ఘనులగు సజ్జనులు లేరుగా భువనమునన్॥ 30

కం॥ మిగుల ననాథులు నార్తులు
నగుపేదల నూఱడించి యాదుకొనంగాఁ
దగు వారిమీఁద దయనిడి
జగతీపతి ధర్మమార్గ సంస్థాపకుఁడై॥ 31

గీ॥ సకల జంతువులను జంపకుండుట యెద్ది
యదియ పరమధర్మ మండ్రు ప్రాజ్ఞు
లిటులగానఁ బతి యహింసకుఁడై దీన
జనులఁ బ్రోవవలయు ననుదినంబు॥ 32

కం॥ తనసుఖమునకై యెవ్వం
డనదలఁ బీడించు నాతఁడాతని కోపం
బను పేరిటి యనలముచేఁ
గనుగొనఁగాఁ గమలఁజన్నె కట్టియ పోలెన్॥ 33

కం॥ కించిత్సుఖమునకై లో
భించి దయంగుంచి మించి పెద్దలఁగడు మె
ప్పించునె మంచికులస్థుం
డెంచక యిది పాపమనక యిమ్మహిలోనన్ ॥ 34

కం॥ పూనినయట్టి మనోవ్యధ
చే నలఁగుచుఁగడుఁ దెవుళ్ళచేఁదలఁకుచు రే
పో నేఁడోచెడు మెయికిం
గానెవ్వఁడు దీనుఁజెఱుపఁ గడఁగును ధాత్రిన్ ॥ 35

కం॥ ఆయాసార్జితధనముల
నాయెడ నొకక్షణము రమ్యమై యెవ్వేళన్
ఛాయామాత్రంబై తగు
కాయంబుల నీరుబుగ్గగతిఁ జూడఁదగున్ ॥ 36

కం॥ బలుగాలి దూలి ప్రీలెడు
నలమేఘసమూహమట్లు లలరెడు విషయా
దులచేతఁ జిక్కుపడుదురె
వలనెఱుఁగు మహాత్ములైన వారలుధరలోన్ ॥ 37

కం॥ తొలఁకెడి జలములలోపలి
కలువలచెలికాని నీడగతి సకలప్రా
ణులబ్రతుకు చంచలం బని
తలఁచి విభుఁడు మంచిపనులె తాఁ జేయఁదగున్ ॥ 38

కం॥ జగ మెండమావులకు సమ
మగు క్షణికంబగు నపారమగు నంచును రా
జగువాఁడు ధర్మసుఖములఁ
దిగులుటకై సుజనుపొందె తాఁ జెయఁదగున్ ॥ 39

కం॥ ఎన్నఁగ సుజనులు గొల్వఁగ
సున్నఘహీపతులు మిగుల నొప్పుదు రిలలో
సున్నము చేసినమేడలు
పున్నమ వెన్నెలలచేతఁ బొలుపగు మాడ్కిన్ ॥ 40

గీ॥ సుజనజనులచేష్టితము భూప్రజకు మోద
మొసవు లీలను గలువల పొసగఁ బొదలు
సరసులును జంద్రకళలు వసంతవనము
సంతస మొనర్పలేవుగా సంతతంబు ॥ 41

దుర్జన సంగతి

కం॥ దోసంబనక తపింపం
గా సుజనులఁ జేయునట్టి ఖలసంగతి రా
జేసరణి నైనఁగానీ
వేసవి మరుభూమివోలె విడువక వలయున్ ॥ 42

కం॥ కులమును శీలము చదువును
గల సుజనులలోనఁ జొచ్చి ఖలుఁడేఁచును ని
చ్చలు హేతువు గలుగకె యిం
గల మెండినచెట్ల నేర్చుగతి నెచ్చోటన్ ॥ 43

ఉ॥ సారెకు వాగ్విషంబు వెదఁజల్లుచు వక్రగతిన్ మెలంగుచున్
గ్రూరత సాధుమంత్రములకున్ భయ మందక యెట్టివేళయుం
మారక చిట్టుబుస్సుమను చుండెడు దుర్జనపన్నగంబు ని
ద్ధారుణి రెండునాలుకలు దాల్చును నెమ్మొగముల్ ధరింపుచున్

కం॥ బుసకొట్టుటచే నెగసిన
విసపుపొగ న్నల్లనైన వెడమోములచె
గనరెడి పాముల పొందులె
పొసఁగున్ దుర్జనులతోడి పొందులకంటెన్ ॥ 45

కం॥ పిల్లికిఁ గూడందిచ్చిన
గోళ్ళం జేఁజిప్పఁకొనుచుఁ గూడుం దినుచు
న్నెల్లవిధంబుల సుజనుని
వల్లనె పోషణము గాంచి వానినె చెఱచున్ ॥ 46

కం॥ ఇలలో ధూర్తజనంబుల
పలుకులు ములుకులటు నొంచుఁ బరజనమర్మ
స్థలములఁ గడుఁ దీవ్రములై
బలువగలం జూపఁ జాలి భయదము లగుచున్ ॥ 47

ఉ॥ మనమున నెంతయుంగినుక మందటిలన్ సిరిఁగోరిరేని తా
రనిశము సజ్జనావళుల కంజలి పూనుదు రట్టి యంతకం
టెను గసుపట్టి నంజలి ఘటింపఁ దగున్ ధర దుర్జనాళికిన్
వినయగుణంబు మించగ వివేకులు లోకమునందుఁ బొంపిగన్ ॥

మధురవచో విచక్షణత్వము

కం॥ లోకమున కెల్ల మోదము
జోక యొనర్పంగ నోపు చుట్టఱికంబున్
లౌకికమై తగు మాటయుఁ
గైకొనఁగా వలయు జగముఁ గడు గెల్చుటకై ॥ 49

కం॥ తేనెలు చిలికెడి పలుకులు
మానవపతి పలుకవలయు మహిజనమునెడన్
దానెంత యావిగలవా
డైనన్ నిష్ఠురముఁ బల్కఁ నది భయమందున్ ॥ 50

గీ॥ రొమ్ము మొత్తినపగిది జనమ్ము మిగుల
నెట్టిపలుకుల వెతపడు నట్టి పలుకు
పలుకఁగా రాదు కడుబుద్ధిఁగలుగు నృపతి
యధికమగు వెతచెందినయప్పుడైన ॥ 51

క॥ చుట్టలయెడఁ బగతులయెడ
గట్టిగఁ బ్రియ మాడవలయుఁ గడుఁ బ్రియములఁ గ
న్పట్టినదారి కేకలఁ దగి
నట్టి నెమలిలీల నేరి కాప్తుఁడు గాఁడే॥ 52

క॥ కేకుల కేకలు కోకిల
కాకలి రాచిలుక కులుకు కలికి పలుకులున్
జేకులఁ జేయవు ముద మీ
లోకమునకు సుజనుపల్కులుం బలె నెపుడున్॥ 53

క॥ నయ విశ్వాసము మర్యా
దయు సుగుణాసక్తిఁ గలిగి ధన మీయఁదగున్
నయగతి ధర్మముకొఱకై
ప్రియభాషల నమృతరసము పెరుగుచు నుండున్॥ 54

గీ॥ ప్రజఁ దను నుతింప నధికసంపదల మించి
పలుకుఁ దేనియ వెల్వారఁ బలుకుచుండ్రు
తెలిసి సత్కార మెవ్వరు చేయుచుండ్రు
వారె నరులై చరించు దేవతలు భువిని॥ 55

క॥ పావనుఁడై యాస్తికుఁడై
దేవతలం గొలువవలయు దేవతలబలెన్
భూవిభుఁడు గురులఁ గొలువఁ
గావలెఁ దనవలెనె మిత్రుఁ గనుఁగొనవలయున్॥ 56

క॥ సురలను సత్కర్మముచే
గురులను మ్రొక్కుటలచేతఁ గువలయపతి స
త్పురుషుల సుచరిత్రముచేఁ
బరితుష్టులఁ జేయఁదగు శుభం బొదవుటకై॥ 57

కం॥ మానినుల భటులఁ బ్రేమను
దానముచే బంధుమిత్రతతి బహుమానం
బూనుటచే దాక్షిణ్యము
చే నితరులఁ గైవసంబు సేయఁగ వలయున్ ॥ 58

మహాత్ముల వర్తనము

సీ॥ ఒకరికాంతల నింద నొనరింపకుండుట
పెద్దలయెడ దయఁ బెట్టుటయును
నిజధర్మముల నెల్ల నిచ్చఁ బాలించుట
యందఱియెడఁ బ్రియ మాడుటయును
కలిమి యెంతగఁగల్గి గర్వించకుండుట
యొరుల సంపదలకు నుడుకమియును
బంధుజనంబులఁ బాయక యుండుట
తనవారితోడుత నెనసియుండు
గీ॥ టెనసి వారల మనసురా మనుచుటయును
బరులఁ బరితాపములు బుట్టఁ బలుకకుండు
టఖిలజనములు వినుతింప నలరుటయును
వసుధ నివియె మహాత్ముల వర్తనములు ॥ 59

చం॥ చెలిమి దలిర్ప నింటి కెడసేయని చుట్టము వచ్చెనన్న ద
వ్వుల కెదురేఁగి వేడుకఁ గవుంగిటఁ జేరిచి యాదరించి తాఁ
గలిగినకొద్ది నిచ్చి యధికంబగు ప్రాణమునందు వంచనల్
గలుగక యోర్పు గల్గి యుపకారమె చూవుట సాధుకృత్యమౌ ॥

ఉ॥ ఎల్లెడ ధర్మయుక్తులయి హెచ్చరికం దగ సంచరించు నా
తొల్లిటివారిమార్గములు ద్రోయని మంచిగృహస్థులెల్ల వ
ర్తిల్లెడు నట్టి మార్గమిది దీన మెలంగెడు నట్టివారికిన్
మొల్లముగాఁగఁగల్గు నిహముం బరముం బరిపూర్ణకీర్తులున్ ॥61

ఉ॥ నిచ్చలు నిట్టిమార్గమున నిల్పినబుద్ధి దలిర్చు వానికిన్
నిచ్చలమైన శత్రువును నెయ్యపుఁ జుట్టముగాఁగఁ బొందుఁదా
నెచ్చట నిట్లుగావున మహీపతి మచ్చర మూడ్చి యీజగం
బిచ్చ వశీకరింపఁదగు నింపగు సద్వినయంబు పెంపునన్ ॥ 62

ఉ॥ ఎక్కుడు గర్వమొందుపతి యెక్కుడ భూప్రజ నెల్లఁగూర్చుదా
గెక్కుడ యైన నింపు లెనయించెడి పల్కులఁ బల్కి త్రాళ్ళచే
మిక్కిలి చుట్టిపట్టినను మీరక నిల్కడఁజెంది వారుఁ దా
నొక్కడనై ననుం గడవకుండుచుఁ గైవసమౌదు రెంతయున్ ॥

వ॥ ఇది మధురవచనప్రకారం బింక సప్తాంగంబు లెఱింగించెద. 64

## సప్తాంగ పరిరక్షణము

గీ॥ రాజు మంత్రియు రాష్ట్రదుర్గములు కోశ
మును బలంబును జుట్టము లనఁగఁ దనరి
యొకటి కొక్కటి కుపకార మొనరఁ జేయు
నట్టి సప్తాంగమును రాజ్య మనఁగఁ దగును ॥ 65

కం॥ ఒక యంగము లేకుండిన
వికలంబై రాజ్యమెందు వెలయదు గానన్
సకలాంగంబులు గలుగన్
బ్రకటింపుచుఁ బతి పరీక్షఁ బరికింపఁ దగున్ ॥ 66

కం॥ మును దా గుణసంగతుఁడై
జనపతి దరువాతఁ బూని సకలాంగములున్
ఘనముగఁ బరీక్ష సేయన్
జను ఘనమనుజేశులెల్ల సన్నుతిసేయన్ ॥ 67

కం॥ ఓజఁ జెలంగని వానికి
రాజత్వము బూని నిలుపరా దట్లగుటన్
రాజిత గుణగణములచే
రాజిలు నరవరుఁడు నొందు రాజత్వంబున్ ॥ 68

ఉ॥ వెందక చెంది నిల్కడలఁ జెందక యుండెడు రాజ్యసంపద
నెందును సద్గుణావళులఁ జెందిన యట్టి మహీతలేశులన్
బొందిసుమంతలేక తగి సన్నపు సున్నపు గారకట్టుచే
బంధముతో తటాకములయందు జలంబులు నిల్చుకైవడిన్॥ 69

వ॥ అందు రాజ గుణలక్షణము. 70

సీ॥ మేలెఱుంగుట గులశీలముల్ సత్యంబు
సత్త్వంబు ప్రాయ ముత్సాహగుణము
మొగమోటమును వేగమునఁ బనుల్ సేయుట
బుద్ధియుఁ దృఢభక్తి వృద్ధసేవ
మఱి లోకువైన సామంతులు గల్గుట
ఘనులైన భటులచేఁ దనరుటయును
ధర్మంబు దానంబు ధర్మసహాయంబు
గలిగి ముందరి కార్యములు నెఱుఁగుట

ఆ॥ దనకుఁ దగిన కార్యమునఁ బ్రవర్తించుట
మోసపోవురీతి మొనయ కుండు
టాదియైన సద్గుణావళి గలరాజు
మిగులఁ బ్రజకుఁ జేరఁ దగినవాఁడు ॥ 71

సీ॥ బలిమి ప్రౌఢిమయును దలపును వాక్చాతు
రియు నాయకత్వ మింద్రియజయంబు
నాజ్ఞాధరుండయ్యు నలరుటయును వైరి
దగిలివచ్చిన నిల్వఁగలుగు చెండు

సకలశిల్పమార్గముల్ దెలియుట దుష్టశి
క్షణము శత్రునివేశఁ గనెడి శక్తి
సంధివిగ్రహముల చందంబు లెఱుఁగుట
దేశకాలంబుల తెఱఁగు గనుట

గీ॥ గుప్తమంత్రుఁడగుట గూడఁబెట్టెడి నేర్పు
గలిగి వెచ్చపెట్టఁ గలుగుటయును
మఱియుఁ గ్రోధలోభమదములు చపలత
విడుచుట ధర భూమివిభుగుణములు ॥ 72

సీ॥ విన నిచ్చగించుట వినుట యర్థమును గ్ర
హించుటయు మఱి ధరించుటయును
నూహలచేత నపోహంబుచే నిశ్చ
యించుటయును దత్త్వ మెఱుఁగుటయును
బుద్ధిగుణంబులే పొలుపొందు మఱియును
దక్షతయును శీఘ్రతయును గినుక
శౌర్యము ననఁగ నుత్సాహలక్షణములే
యివి గల్గువాఁడె మహీవిభుండు

గీ॥ త్యాగమును సత్యమును శుచిత్వంబుననఁగ
నమరుచుండును మూఁడు మహాగుణంబు
లిట్టి మూఁడు గుణంబుల నెసఁగు నట్టి
జనపతిని దానె చెందును షడ్గుణములు ॥ 73

సీ॥ మఱియును బ్రామాప్పటు మచ్చరంబును మూర్జ
నత్వంబుఁ బరపీడనంబు నీర్ష్య
కల్లలాడుటయును గరువంబు మానుట
ప్రియదర్శనంబు శక్తియుఁ గలుగుట

వినుతగాంభీర్యుఁడై వృద్ధోపసేవియై
యలరుట మంచిమాటలఁ బలుకుట
సరసతి సద్గుణజాలంబుపై నను
రాగంబు గలుగుట రాజగుణము

గీ॥ లిట్లు తగు నాత్మసంపద నెసఁగి నీతి
సరణి నిసుమంతయును మీఱి చనక లోక
చర్య లెల్లను గనుఁగొంచు జనులఁ దండ్రి
చాడ్పునను బ్రోచువాఁడెపో జనవిభుండు ॥ 74

ఆ॥ ఎట్టి గుణము లంది యేనీతి నడచినఁ
బ్రజలు దన్ను జేరి భక్తిఁగొల్తు
రట్టి గుణము లంది యారీతి నడువఁగా
వలయు రాజు భూమివలయమందు ॥ 75

ఉ॥ ఎందును దుర్గుణుండగు మహీపతియైనను మంచిబంట్లఁదాఁ
జెందిన సద్గుణుండగుచు శ్రీల వహించును గాక దుష్టులం
జెందిన రాజు పాములను జెందిన గందపు మ్రానువోలెఁదా
నిందితుఁడై జనంబులకు నిచ్చలుఁచేరగరాక యుండఁడే ॥ 76

కం॥ పరమపవిత్రులఁ గులజుల
సరసులఁ బ్రజ నెల్లఁగై వసముగా నిచ్చల్
ధర మెలఁగు క్రోధరహితులఁ
బరిజనములఁ జేయవలయుఁ బార్థివుఁడెందున్ ॥ 77

వ॥ అందు

కం॥ చెడుగులగు గడుసుమంత్రులు
కడు సన్మార్గంబు లుడుగఁగాఁ జేసి పతిం
దొడిఁబడఁ జెఱుతురు గనుకె
య్యెడ మంచిప్రధానుతోడ నెనయఁగ వలయున్ ॥ 78

కం॥ నిజముగ సిరిఁ జెందినచో
సుజనుల భుజియింపఁజేయఁ జొప్పడు పతికిన్
నిజముగ నటువలె సుజనులు
భుజియింపని సిరులు వ్యర్థములు ధరలోనన్॥ 79

కం॥ కులమును దాపనతయు వడి
గలతనమును దండనీతి గడుఁ బనిఁగొను నె
ప్పులు ననురాగముఁ జదువును
గలవార లమాత్యజనులు గావలెఁ బతికిన్॥ 80

కం॥ తరుణులయెడ ధర్మమునెడ
నిరవగు నర్థమ్మునెడఁ బరీక్షితుఁడు సదా
పరిశుద్ధుఁ డనగఁ బరగున్
ధరణీపతి యిట్టి మంత్రిఁ దానేలఁ దగున్॥ 81

సీ॥ కడు మహోత్సవవేళఁ బొడగను వేళలఁ
గనుపట్ట నిచ్చిన కాన్కయంద్రు
భూజనంబులచెంతఁ బొరసిన యదియెల్ల
పొరబడి యనుపేరఁ బరగుచుండు
పగిది రొక్కములోనఁ బట్టి భక్షించిన
*యరి పట్టుబడియనఁ బరగుచుండు
నితరుల కార్యంబు లీడేర్చుటకు లోన
లాఁతుగాఁ బట్టిన లంచ మంద్రు

గీ॥ వీనిఁ బొరయని మంత్రిగా విభుఁడు లెస్స
యెఱిఁగి యుపధా విశారదు నరయవలయు
నట్టి మంత్రియుఁ బ్రజలకుఁ గొట్టుగాక
పతిహిత మొనర్చి యతనిచే బ్రతుకవలయు ॥ 82

* యది.

సీ॥ మఱియుఁ జెప్పినవెల్ల మఱవక చతురుఁడై
పనులయం దాసక్తిఁ బరగు, టెందు
నొఁగాము లెల్ల నూహాపోహ లొనరించి
యిది తప్పదని నిశ్చయించి కొనుట,
నిశ్చయించినవెల్ల నెమ్మది మఱవక
చెలఁగి మంత్రంబు రక్షించి కొనుట,
దేశకాలజ్ఞుఁడై తెలివితోడుతఁ గార్య
సిద్ధులఁ గ్రమ మొప్పఁ జెందుటయును
గీ॥ నృపతి మఱచినపని దానె యెచ్చరించి
మంచి మార్గంబుచేతఁ గావించనేర్చు
టాదిగాఁగల్గి యుండెడు నట్టి వెల్ల
ప్రాజ్ఞులగువారు మంత్రి సంపద యటంద్రు॥ 83

సీ॥ కులశీలబలములు గలిగి స్వదేశస్థుఁ
డై నృపతికి వశుఁడైన వాఁడు
కనుగల్గి కడుమాటకారియై ప్రోడయై
యుత్సాహియై యుక్తి నొనరువాఁడు
చపలత ప్రమాన్పాటు జాఱఁజేసినవాఁడు
బడలికలకు నోర్చి పరగువాఁడు
పావనత్వంబుఁ బ్రభావంబు శౌచంబు
నిలుకడ సత్యంబు గలుగువాఁడు
గీ॥ సత్త్వమును మైత్రి ధారణాశక్తిఁ గలిగి
ప్రజ్ఞ యారోగ్యమును దృఢభక్తిఁగలిగి
శిల్పము లెఱింగి వైరముల్ సేసికొనని
వాఁ డమాత్యపదుండు గావలయుఁ బతికి॥ 84

వ॥ మఱియును. 85

## పురోహిత గుణకథనము

ఆ॥ దండనీతియందుఁ ద్రయియందు మిగులంగ
నూహ గలుగ వలెఁ బురోహితునకు
నతఁ డథర్వవేదగతిచేత నెప్పుడు
శాంతి పౌష్టికములు సలుపవలయు ॥ 86

గీ॥ మఱి పురోహితులందును మంత్రులందు
శాస్త్రదృష్టియుఁ బనుల యెచ్చరికె లనఁగ
గలుగు నీరెండు గుణములు దెలియవలయు
నది యెఱుఁగువారితోఁగూడి యధిపవరుఁడు ॥ 87

సీ॥ స్వజనంబుచేఁ గులస్థానముల్ పనులందు
దృఢచిత్తుఁ డౌటయుఁ దెలియవలయు
జ్ఞానసంపదయు దక్షతయును బ్రతిభయు
నల యలంకృతులందుఁ దెలియవలయు
ధారణాశక్తి సత్యముఁ బ్రగల్భత కథా
యోగంబులను గనుఁగోఁగవలయు
మైత్రి శౌచము భక్తి యీత్రితయము వ్యవ
హారంబులంబట్టి యరయవలయు

గీ॥ ధైర్య మనురాగయుక్తి కృత్యములయందు
నిలుకడయుఁ గ్లేశముల కోర్వఁ గలుగుటయును
గడు ప్రభావంబు నుత్సాహ గౌరవంబు
నాపదలవేళ మంత్రియం దరయవలయు ॥ 88

సీ॥ సత్యంబు బలమును సద్వర్తనంబును
దెవులు లేకుండుట దెలియవలయు
సహవాసులైనట్టి జనులచే మఱియును
శుభరూపుఁడగుటయ క్షుద్రుఁడగుట

వైరంబు లేకుండ వర్తింప నేర్పుట
　　వెఱపును జపలత విడుచుటయును
బ్రత్యక్షగతిచేత భావింపవలయును
　　గానుపించని గుణగణము లెల్ల
గీ॥ కార్యములచేత నెప్పుడుఁ గనఁగవలయు
నట్టి క్రియలకు ఫలముచే నరయవలయు
నిన్నిరీతుల లెస్స పరీక్ష చేసి
మనుపవలయును మంత్రుల మనుజవిభుఁడు ॥ 89

మంత్రి పురోహితుల కార్య ప్రయోజనము

కం॥ నరపతి దుర్వర్తనమునఁ
జరియించిన మాన్పవలయు సచివజనంబుల్
నరపతియు సచివవాక్యము
గురువాక్యముపోలె నెన్నికొని నడవఁదగుఁ ॥ 90

కం॥ జనపతి యెచ్చరి కెడలిన
మనుజులు గడుఁ జెడుదు రితఁడు మది నెచ్చరికన్
దనరిన మనుజులు బ్రతుకుదు
రినుచేఁ దామరలగుంపు లింపొందుగతిన్ ॥ 91

కం॥ అలరెడుమతి నుద్యోగము
గలిగిన యాయాయి కార్యకర్తలచే ని
చ్చలు రాజు దెలియునట్లుగఁ
దెలిపించుచు మంత్రి దాను దెలియఁగవలయున్ ॥ 92

కం॥ జనపతి యనీతి నడచిన
ననిశము వారించువారె యతనికి హితులౌ
జనులును గూరిమి బంధువు
లనుంగుఁజెలికాండ్రు గురువులై తగువారల్ ॥ 93

కం॥ తా మఱి చదివిన రాజును
గామాంధుండగుచు నుండుఁ గడు నృపమహిమన్
గామాంధుఁడైన జనపతి
యేమిటఁ జెడుపనులు బూనఁ డీమహిలోనన్? ॥ 94

గీ॥ కామమున మదంబున నహంకారమహిమ
నంధుఁడై జాఱి పడఁబోవునట్టి పతికి
చుట్టములు మంత్రులును జెప్పినట్టి నీతి
దండయై యుండు నెపుడుఁ గైదండ యగుచు ॥ 95

కం॥ జనపతి కామాతురుఁడై
గనుచుండియుఁ గానలేఁడు గావున నతనిన్
నెనరగు చుట్టపు వెజ్జులు
వినయాంజన మిడుచు మాన్పి వెలయింపఁ దగున్ ॥ 96

కం॥ మదయుతుఁడు దుర్నయుండై
పొదలెడు నృపుఁగొలుచు మంత్రి పొం దపకీర్తుల్
చెదరని మదమునఁ బొదలెడి
మదమేనుఁగు దిద్దలేని మావంతుగతిన్ ॥ 97

రాష్ట్ర సంపత్స్వరూపము

కం॥ భూమిగుణంబున రాష్ట్రము
దా మించును రాష్ట్ర మెంత దనరినయేనిన్
భూమిపతికి మంచిది యెం
తే మహి యటుగాన మంచిదియె కావలయున్ ॥ 98

సీ॥ కరపట్టణములపై గనులు ద్రవ్యంబులు
జలములు ధాన్యముల్ చాలఁ గలిగి
యావులకును మంచివై మనోహరములై
మేలైన యాళ్ళచే మించఁ గలిగి

వారణంబులఁ బొల్చు వనదేశములు గల్గి
నీళ్ళ త్రోవలచేత నేల త్రోవ
చే, నేటికాల్వలచే నొప్పు భూములు
నరనాయకులకును సిరు లొసంగు

గీ॥ మొరములును జౌడు *కొొదపలు ముచ్చుబంట్లు
చెట్టు మిట్టలుఁ బుట్టలు వెట్టఁదనము
గుండ్లు ముండ్లును బాముల దండ్లు గల్గు
వసుధ యెవ్వేళ సంపద లొసఁగ లేదు ॥ 99

గ్రామ లక్షణము

సీ॥ తనకును జీవనం బొనఁగూర్చి శత్రు బా
ధల కోర్చి భూగుణంబులఁ దనర్చి
జలము లూరెడిచోట్లు గలిగి గట్లకు నున్కి
పట్టులై కోమట్లు బనులవారు
గాఁపు లుద్యోగముల్ గాంచి దున్నెడువారు
గడుఁ గల్గి యనురాగ గరిమఁ జెలఁగి
పశు సంతతులుగల్గి బహుదేశ జనులచే
నాకీర్ణమగుచు ధనాఢ్యమగుచు

గీ॥ అరయ ధార్మికోపేతమై వ్యసని మూర్ఖ
నాయకుఁడు గల్గు దేశంబు నరవరుండు
బహుళయత్నంబునను వృద్ధిపఱచి ప్రోవ
వలయుఁ బతియందు సంపదల్ వెలయుఁగాన ॥ 100

కోట లక్షణము

సీ॥ చెలువమై విరివియౌ సీమ చాలఁగఁ గల్గి
చెఱకు రాజనములచేలు గల్గి
కలువలు దామరల్ గల యగడ్తలు గల్గి
వనములు గొండలు గనులు గల్గి

---

* కదపులు.

కోటలు నున్నతగోపురంబులు గల్గి
మేడల వాడల మించుగల్గి
కపురంబు గస్తూరి గల్గు పేటలు గల్గి
కరితురగాదు లగ్గలము గల్గి
గీ॥ యేర్ల మిట్టల గట్టుల నెన్నఁగల్గి
ధీరులును శూరులును గలవారు గల్గి
కవులు జాణలు గాంతలు ఘనులు గల్గి
సిరులు గల రాజధాని వసించవలయు ॥ 101

కం॥ జలమును ధనమును ధాన్యము
గలుఁగును మందడుల కోర్వఁగల దుర్గము గా
వలయుఁ బతికి లేకుండిన
నల గాలిం దూలు మేఘ మనఁగాఁ దూలుఁ ॥ 102

కం॥ జలదుర్గము గిరిదుర్గము
స్థలదుర్గము వనముచేతఁ దగు దుర్గము ను
మ్మలి గల దుర్గము దుర్గం
బులుగాఁ బాటింపవలయు భూపతి యెందుఁ ॥ 103

కం॥ జలములు ధాన్యము లాయుధ
ములు రసవర్గములు యోధముఖ్యులు యంత్రం
బులు గల్గి రక్షణముచే
నలరెడు దుర్గంబు దుర్గమనఁ జెలువొందుఁ ॥ 104

గీ॥ తొలఁగిపోఁ జోట్లు గల్గిన దుర్గములును
మడుఁగులును గల్గి తుప్పరేగడలు గల్గి
యలరు భూములు సిరులు గావలసినట్టి
నృపతి కుండుటఁ దగునంద్రు నీతివిదులు ॥ 105

## భండారము

సీ॥ ఆదాయ మధికమై యల్పవ్యయముఁ గల్గి
 సారె వెచ్చించినఁ దీఱిపోక
ముత్తెముల్ రత్నముల్ మొదలుగాఁ గల్గిన
 సకలవస్తువుల కాశ్రయము నగుచు
నాప్తులై యుండెడి నధికారులును గల్గి
 ధర్మంబుచే నూర్జితంబు నగుచు
తరతరంబులనుండి తగ నూర్జితంబునై
 పొగడొంది దేవతాపూజఁ జెంది
గీ॥ పరగు భండార మెందును బలముఁ బ్రోచు
కొఱకు ధర్మార్థములను జేకూర్చుకొఱకుఁ
గడవగారాని యాపదల్ గడచుకొఱకు
రక్షణము సేయవలయును రాజవరుఁడు॥ 106

## బలము

సీ॥ మేటియై పెద్దలనాటి మూఁకలు గల్గి
 బహువిధ యోధులఁ బలసి వివిధ
యుద్ధంబులకు నోర్చి యొనఁగూడి వశ్యమై
 తనచేత నెపుడు జీతములు గాంచి
వడిగల తనమునఁ గడుఁ బ్రసిద్ధి వహించి
 యన్ని కైదువుల నేర్పుగ్గలించి
పూజగాంచిన గుఱ్ఱములు నేనుఁగులు గల్గి
 బలమైన రాచవారలఁ జెలంగి
గీ॥ నేర్పరులు గల్గిపోటజ్జ నేర్చి యెట్టి
పనులయందును మొనలందు బడలికలను
జెంద కెయ్యెడ భేదంబుఁ జెందకుండు
బలము గలుగంగ వలయు భూపతికి నెందు॥ 107

## మిత్ర లక్షణము

సీ॥ కులవంతుఁడై సత్త్వగుణము గల్గినవాని
బహుసహాయజ్ఞుఁడై పరగువాని
శూరుఁడై ఘనదానశూరుఁడై తగువాని
మంచిమాటలచేత మించువాని
సిరిగల్గి ఖేదంబుఁ జెందకుండెడివాని
ననురక్తుఁడై దక్షుఁడైనవాని
సౌమ్యుఁడై శుచియునై జ్ఞానియైతగువానిఁ
దరతరంబునఁ జెల్మిఁ దగిన వాని

గీ॥ ఇచ్చమైఁ గూడి వేగంబె వచ్చువాని
నెందు సహసుఖదుఃఖుఁడై యెనయువాని
నాపదలయందు వదలని యట్టివానిఁ
దనకు మిత్రునిగాఁ జేయఁ దగును బతికి॥ 108

కం॥ తనయందు నెట్టివేళల
ననురాగము గల్గియుండు టదె సంక్షేపం
బున మిత్రలక్షణంబగు
మనుజేంద్రుం డిట్టివిధము మదిఁ దెలియఁ దగున్॥ 109

## మిత్రుల భేదములు

గీ॥ ఔరసులు నందు సంబంధులైనవారు
కదఁగి దేశక్రమాగతుల్ క్రమముతోడ
రక్షణముఁ జెందువారును రాజునకును
బలుదెఱంగుల మిత్రులు దెలియవలయు॥ 110

వ॥ అది యెట్లన్నను. 111

సీ॥ మేనమామలసుతుల్ మేనత్తసుతులును
మేనయల్లుండ్రును మేనమామ
లును దల్లిచెల్లెలి తనయులు నాదిగా
నౌరసమిత్రులై యలరి మింతు
రల్లుండ్రు బావలు నాలితోఁబుట్టువుల్
సంబంధమిత్రులు జగతి నెన్న
గడిరాజు సవ్వలికడనుండఁ దగువారు
దేశక్రమాగతుల్ దెలిసి చూడ

గీ॥ నాపదలయందుఁ దనచేతఁ బ్రోపుఁ గనుచు
మెలఁగువారలు రక్షితమిత్రులగుదు
రిట్టి నలువుర మిత్రుల నెఱిఁగి చాల
మైత్రి గావింపఁ గాఁదగు మనుజవిభుఁడు ॥ 112

కం॥ దూరమున నెదురుకొనుటయు
సారెకు సమయమున నీయఁజాలుట మనసుల్
చేరికగా మాటాడుట
కూరిమితో మిత్రుఁ గూర్చికొను చందంబుల్ ॥ 113

కం॥ ఇలఁ దనకు మంచిమిత్రుఁడు
గలుగుటకుఁ జా ఫలము ధర్మకామార్థంబుల్
గలుగఁదగు నీతివర్గము
గలిగించని మిత్రు విడువఁగాఁ దగుఁ బతికిన్ ॥ 114

కం॥ మునుమునుపు గొంచెమై వడు
మను బ్రబలుచుఁ బోవఁబోవ మఱిమఱి మన్నమై
యొనరుచు నెడనెడఁ గూడక
యొనసి లసనై శ్రుతి వెలయు నేఱుంబోలెన్ ॥ 115

కం॥ దారయ యాప్రకృతిగుణంబుల
బరగిన నుతికెక్కి నిక్కి బవరమ్ములలో
నరివరులఁ గూల్చి పొల్చుం
గరువలి మేఘములఁ గూల్చు కరణిన్ ధరణిన్ ॥ 116

కం॥ జనపతి యీరాజ్యాంగము
లనువొందఁగఁ గూడి నిచ్చ లాదర మెచ్చన్
జనపదము లేలఁగాఁ దగు
ఘనమగు తత్పాలనమునఁ గడుసిరిఁ జెందన్ ॥ 117

చం॥ అమరెడు లీల నీప్రకృతులందు వసింపుచు నంతరాత్మ ని
క్కము సచరాచరంబగు జగంబున నిండినరీతి భూవిభుం
డమరుచు నున్నయీప్రకృతులందు వసింపుచు నేర్పుమీఱ ని
క్కము సచరాచరంబగు జగంబును నేలు మహాప్రభావుఁడై ॥

చం॥ క్రమమున నిట్టిరీతిఁ బలుకం దగి యొప్పెడు రాజ్యమెంచఁగా
నమరును నిల్కడై ధనమునై ధరణీపతి కట్టి రాజ్యము
త్తముఁడగు మంత్రి గల్గినను ధర్మముఁ గామము నర్థసంపదల్
సమధికలీలచే నొసఁగి సంతతకీర్తులు నిల్పుఁ బొల్పుగన్ ॥

శా॥ శ్రీవాణీజయసారధీరసుకవిశ్రేణీనుతాచార వి
ద్యావర్ణాశ్రమపాలనోర్జితనయవ్యాపార దీనావన
ప్రావీణ్యాంచితసద్విచార వినయప్రారంభణాధార వి
శ్వావిభ్రాజిదయాప్రసార విలసత్సప్తాంగరాజ్యస్థిరా ॥ 120

కం॥ శంకరనుత రఘువరపద
పంకజ భృంగాయమాణ పావనహృదయా
కొంకణ కోలాహల బిరు
దాంక మహాసమరవిలస దయనిశ్శంకా ॥ 121

మాలిని॥ చతురగుణవిశేషా సత్యభాషావిభూషా
యతులితగుణధానా యాశ్రితాంచన్నిధానా
శ్రుతిపథయుతచర్యా శూరసంస్తుత్యశౌర్యా
సతతజయవిహారా సంగమాంబాకుమారా ॥ 122

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాద లబ్ధ సారసారస్వత భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీరామకృష్ణ భక్తివైభవ భాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన * కామందుక నీతిశాస్త్రంబున విద్యావర్ణాశ్రమ పాలన ప్రభావంబును దీనజనరక్షణంబును సజ్జనలక్షణంబును మధురవచో విచక్షణత్వంబును సప్తాంగపరీక్షణంబును నన్నది ద్వితీయాశ్వాసము.



* కామందక

# ఆంధ్ర కామందకము

## తృతీయాశ్వాసము

కం॥ శ్రీదేవచోళవంశమ
హోదధిపరిపూర్ణచంద్ర యురువిక్రమ సీ
తాదయితచరణసేవా
త్యాదర కొండ్రాజు వెంకటాద్రి నరేంద్రా ॥ 1

వ॥ ఆకర్ణింపుము. 2

### స్వామ్యనుజీవివృత్తప్రకరణము

కం॥ వినయంబు మంచినడవడి
యును సిరులును జేరఁ దగిన యుత్తమగుణముల్
దనరంగఁ గల్పవృక్షం
బనఁదగు పతిఁ గొలువవలయు ననిశము భృత్యుల్ ॥ 3

మ॥ కొనియాడం దగునట్టి సంపదలు గైకోవచ్చుఁ గాలాంతరం
బుననైనన్ ధర నెట్టివానివలనన్ మోదంబులౌ నట్టి వా
నిని జాలంగ ధనంబు లేనియపుడు న్మేలెంచి కొల్వందగున్
ఘనతన్ సజ్జనసేవ్యుఁడై చతురుఁడై కన్పట్టినన్ బంట్లకున్ ॥

కం॥ కుటిలాత్ముఁ గొల్చి సిరిఁ గాం
చుటకంటెను నూరకుంట ఘుగుడిదనం బా
కటఁ జిక్కి స్రుక్కి తగ నె
చ్చుటనైనను నిల్చి మొద్దుచందం బొందన్ ॥ 5

కం॥ అనిశము నీతివిరోధము
నన మెలఁగుచు బుద్ధిలేని నరుఁ డరిసిరులన్
ఘనముగఁ బ్రబలఁగఁ జేయుచుఁ
దనకుంగల సిరులతోడఁ దాఁ గడు నొగులున్ ॥ 6

కం॥ చతురుఁడు నవికారుఁడు ని
శ్చితమతికార్యుండు యత్నశీలుఁడు నగు భూ
పతి వేళ యెఱుఁగ నేర్చిన
సతతము దమ నెలవునం బొసంగఁగ నిల్చున్ ॥ 7

కం॥ అప్పుడు మీఁదట శుభమై
చొప్పడు పని బడలియైనఁ జొప్పడు సేయన్
దప్పక లోకవిరుద్ధము
లెప్పుడు సేయంగవలవ దెచ్చటఁ బతికిన్ ॥ 8

కం॥ బడుసునఁ గలిసిన నువ్వుల
పడిసిన నూనియయు వడుసు వాసనచేతన్
జెడునటుల సకలగుణములఁ
బుడమిం గూటువగుణంబె పొదువుచు నుండున్ ॥ 9

కం॥ చదలేటి జలములైనను
నుదధిం దగఁ గలసెనేని యుప్పనివ ట్లా
నది యెఱిఁగి నృపతిఁ గొలుచుట
విదితముగా విడువవలె వివేకుల కెల్లన్ ॥ 10

కం॥ మతియుతుఁడు బడలియైనను
క్షితి దైన్యములేని బ్రతుకుఁ జెందఁగవలయున్
ధృతిమీఱ నట్లు నడచిన
యతని మహీవిభుఁడు మెచ్చు నందఱికంటెన్ ॥ 11

చం॥ తనుఁగొనఁ దొల్చి నిల్కడలఁ గైకొని సజ్జనసేవ్యుఁడై కడుఁ
ఘనత వహించి పుణ్యములు గాంచి నుతించగ మించునేలికన్
వినయము నీతిమార్గము వివేకము కల్మిని గల్గఁగోరుచున్
జనములుగొల్వఁగాఁజనుఁద్రిసంధ్యమవంధ్యమువింధ్యముంబలెన్

కం॥ చెందంగరాని వస్తువు
లందును యత్నమ్ము సేయ నవి సిద్ధముగాఁ
జెందుం గావునఁ దాఁ జే
యందగు యత్నము వివేకి యగువాఁడెందున్ ॥ 13

కం॥ అనిశము వినయము విద్యయు
ఘనమగు శీలాదికంబుఁ గైకొనవలయున్
దనమతి జనపతి యనుగతి
దనరఁగ సేవించువాఁ డుదారప్రౌఢిన్ ॥ 14

అనుజీవి వర్తనము

సీ॥ కులము విద్యలు శిల్పములు నుదారత్వంబు
నలరు సత్త్వము నిల్కడంది తగుట
యందమౌ దేహంబు నారోగ్యమును బుద్ధి
వడిగలతనముఁ బావనత గలిగి
దుర్జనత్వంబును ద్రోహంబు భేదంబు
నత్యాశయును గల్లలాడుటయును
చపలత ప్రమాన్పాటు శఠతయుఁ బోఁ ద్రోచు
నతఁడు సేవ యొనర్ప నర్హుఁ డెందు

గీ॥ నోపిక దిటంబు గల్గుట యొప్పిదంబు
సంతసంబును శీల ముత్సాహ మాప
దలకుఁ గ్లేశములకు నోర్వఁగలుగుటయును
వన్నెఁ దెచ్చును నీచ సేవకుల కెల్ల ॥ 15

సీ॥ ఒకచోటఁ గూర్చుండి యుండుట పదరుట
మాయలు గ్రౌర్యంబు మచ్చరంబుఁ
పెద్దల నదలించి ప్రేలుటయును దంబు
జడత వంచనయును విడువవలయు
జనపతి పీఠంబె కనుఁగొనవలయు ది
క్కులు సారెకును జూడవలదు మఱియు
నన్యోన్యమును మాటలాడక యతనిము
ఖావలోకనము సేయంగవలయు

గీ॥ నచట నెవ్వార లున్నవా రనిన నేన
టంచుఁ జని పని యానతిమ్మంచుఁ బలికి
యతఁడు చెప్పిన పని యోపినటుల వేగఁ
జేయవలె వేడ్కతో ననుజీవిజనము ॥ 16

సీ॥ తనయందుఁ బ్రేమ యెంతయుఁ గల్గి యుండెడు
నధిపతిచిత్తంబునందుఁ దగిలి
యతఁడాడినట్టి వాక్యము నిర్వహింపుచుఁ
బలుకగావలె మంచిపలుకు లెపుడు
బతి నియోగించినపట్టుల నొరులలోఁ
గలది గల్గినయట్లు పలుకవలయు
సుఖగోష్ఠివాదముల్ చూపుచో రాజుతో
నది యెఱింగియు నడ్డమాడ వలవ

గీ॥ దెంత నేరుపు గలిగిన యేనిఁదా వి
వేకి యగువాఁ డహంకృతి విడువవలయు
వెల్లవిరియైన మాటయు విభునితోడ
వలయు మెల్లనె తెలుప సేవకుల కెల్ల ॥ 17

సీ॥ వినయంబుఁ జేకొని వినుతింపఁ దగుప్రయో
జనము నందలి పతిచతురిమంబు
నాపదల్ చెందినయప్పుడు నేరని
నడకలు విడువక నడచునపుడు
కార్యభారంబులు గడపునప్పుడు తన్ను
నడిగిన శుభవాక్య మాడవలయు
నెపుడు పథ్యంబును హితవుగా నిజమాడ
యుక్తంబు ధర్మోపయుక్తరీతి

తే॥గీ॥ నెట్టివేళల నమ్మనియట్టిమాట,
మఱియు సభ మెచ్చనటువంటి మాట, కర్ణ
కటువగుచునుండు మాట, యే కదలనైన
నాడఁగా రాదు సేవకుండైన యతఁడు॥ 18

సీ॥ అధిపతి యేకాంత మతని రహస్యంపుఁ
బనుల నెవ్వరితోను బలుకరాదు
ద్వేషంబు నాశంబు తెగులు నెవ్వేళలఁ
దనమది నైనను దలఁపరాదు
సుదతులతో వారిఁ జూచువారలతోడఁ
బాపకర్మలతోడఁ బరులదూత
జనులతో రాజుచేతను నిరాకృతిఁ గన్న
వారితో నేకాంతవర్తనములు

ఆ॥వె॥ వారి తోడిపొందు వర్జింపఁగాఁ దగు
నధిపు వేషభాషలందు గలయఁ
బూని మెలఁగరాదు బుద్ధిచేఁ దనరెడు
సేవకులకు నెల్ల క్షితిఁ దలంప॥ 19

౨౮॥ తగుసమయంబును దగినవేషంబును
దగుచోటు గైకొని ధరణిపతికి
దినదినమును బొడఁగనుచుండఁగాఁ దగు
నతని సోదరులకు నాత్మజులకు
జనవరులకు మ్రొక్కి సర్వసమ్మతుఁడునై
దేశకాలంబులు దెలిసి యొరుల
పనిని వహించి నేర్పరుల దక్షులఁ గూడి
తనపనులను జేసికొనఁగ వలయు

౧౯॥ నీల్గుటయు నావులించుట (నేర్పు పొగడు) *
కొనుట నిందించుటయుఁ దగ్గికొనుట యుమియు
టయును గడు బెట్టుగా నవ్వుటయును విడిచి
భూవిభుని గొల్వఁగాఁ దగు సేవకుండు ॥ 20

౨౦॥ ఘనమగు సంపదచేతన్
గనుపట్టిన వారలైనఁ గడునేరుపు గ
ల్గిన బంటులు విరసింపం
జనదు ధరాధీశునుగుణసంఘముతోడన్ ॥ 21

౨౦॥ ఈరీతి సద్గుణంబుల
చే రంజిలి యర్థసిద్ధిచేఁ దగి మహిమో
దారుఁడగు విభుని సిరి చే
కూరుటకై విశ్వసింపఁ గొలువఁగవలయున్ ॥ 22

౩౦॥ పనులయెడ మిగుల నేర్పరు
లన వినుతికి నెక్కి నృపతి యనురాగమునన్
దనరుట యటు గాకుండుట
ననువుగఁ గనవలయు నింగితాకారములన్ ॥ 23

---

* (. .. ... )

## అనురక్త రాజలక్షణము

సీ॥ తనినఁ బ్రసన్నుఁడై కనుపట్టుటయును మా
టాడిన నాదరమంది వినుట
దగ్గఱఁ గూర్చుండుటకుఁ జోటు విడుచుట
కడువేడ్కఁ బరిణామ మడిగి వినుట
యేకాంతములయందు నేకాంత మగుకొల్వు
లందు సందేహంబుఁ జెందకుండు
టతఁడు చెప్పిన పల్కు లతనికై చెప్పిన
పలుకు లెప్పుడు నింపు గలిగి వినుట

గీ॥ యెంచఁగలవారిలో నెల్ల నెంచుటయును
మించి వినుతించుతఱి సంతసించుటయును
బదరి యహితంపుఁ బలుకులు వలికినపుడు
నలుగమియు గుఱుతులు రక్తి గలుగుటకును ॥ 24

కం॥ తలఁచుట గుణములఁ బొగడుట
బలికినఁ బని సేయుటయును బడలుట విని నఱ
బలుమఱు వగచుట బ్రబలిన
నలయుటయుం గరుణ గలుగునధిపుగుణంబుల్ ॥ 25

## విరక్త రాజలక్షణము

సీ॥ మెగులంగ నద్భుతం బగునుపకారంబు
లొనరించి నప్పుడు నూరకుండు
టతఁడు చేసినపను లన్యులు గావించి
రనుట వైరుల రేఁచు టతని చేటుఁ
గడు నుపేక్షించుట కార్యంబుపట్ల నా
నలఁ బెట్టి ఫలము లొసంగకుంట
యుంచుక మంచి పల్కొసఁగింప నర్థంబు
చేత నిష్ఠురముగఁ జేయుటయును

ఆ॥వె॥ కుపితు నట్టులుంట కోపహేతువు లేక,
తటిఁ బ్రసన్నుఁడయ్యు మెఱయు ఫలము
లిడక యున్కి, రక్తిహీనుఁ డౌవిభునకు
గుఱుతు లండ్రు నీతి నెఱుఁగువారు ॥ 26

సీ॥ చేరంగఁ జనుదెంచి జీతంబు లడిగినఁ
జూచి వేగిరమున లేచి చనుట
మర్మముల్ నాటంగ మాటాడుటయు రహ
స్యమునందు సందేహ మందుటయును
లేని నేరములు గల్పించి దూషించుట
జీతంబు దిగఁద్రొబ్బి చేరు టెందు
ననుకూలగతి నిజమైన మాటాడిన
నాయెడ దబ్బఱ వేయుటయును

గీ॥ గడఁగి మాటాడ నడుమనే కాదనుటయు
శయనమందును యత్నంబు సమకొనంగఁ
బోయి సేవించినను నిద్రఁ బోవురీతి
నుండుటయు గుర్తు రక్తి లేకుండుపతికి ॥ 27

కం॥ సంతతమును గలగుణములు
చింతింపక దూషణంబె చేయుట కోపా
క్రాంతుఁ డయి వేఁడిచూపుల
నెంతయుఁ జూచుటయు గుఱుతు లితవెడయుటకున్ ॥ 28

గీ॥ ఇట్టి లక్షణములచేత నెపుడుఁ గరుణ
గలుగుటయు లేకయుండుట దెలిసి బంట్లు
కరుణ గల్గిన పతిఁ గొల్వఁ గడఁగవలయుఁ
గరుణ లేకున్నఁ గొలువఁగాఁ గాదు పతిని ॥ 29

కం॥ ఆపదవేళలఁ జెడుగై
దీపించిన రాజునైన దిగవిడువఁగ రా
దాపదవేళనె యేలికఁ
గాపాడినవాఁడు మిగుల ఘనుఁడు దలంపన్ ॥ 30

కం॥ అలమటలు లేనివేళల
మెలఁకువ శౌర్యంబుఁ జూపి మించరు సుజనుల్
బలువగు నలమట వేళనె
మెలకువ శౌర్యంబుఁ జూపి మింతురు సుజనుల్ ॥ 31

కం॥ వినుతింపఁ దగి ప్రమోదం
బనువుగ ఘటియింప నధికు లగువారికిఁ జే
సిన యుపకారము లల్పము
లన వెలసియు నధికశుభము లడరంజేయున్ ॥ 32

కం॥ జనపతి యనుచితగతి నడ
చిన మాన్పుట మంచిపనులఁ జేసినయెడఁ దా
రును గూడుట సద్వర్తన
మనఁ దగు మిత్రులకు బంటులగు వారలకున్ ॥ 33

కం॥ మానినులఁ దగుల, మద్యం
బానుట విడకున్న, జూద మాడెడు నెడలన్,
మానుపవలె భూమిపతిన్
మానితగతిఁ దగునుపాయమార్గంబులనేన్ ॥ 34

కం॥ చేయంగ రానికార్యము
జేయంగాఁ జూచు విభునిఁ జేయకయుండన్
జేయందగుఁ దా రటువలెఁ
జేయని నరు లతఁడుఁ దారుఁ జెడకుండుదురే ॥ 35

కం॥ నయమును వినయము భక్తియు
భయము వెలయ నయ్య యనుచు భటులు "జయాజ్ఞా
పయ దేవ నాథ జీవే
తి" యథార్థోక్తులను జనపతినిఁ గొల్వఁ జనున్ ॥ 36

కం॥ తన విభుని మనసు రాఁ గొ
ల్చిన యట్టిద మంచినడక సేవకులకుఁ జె
ప్పినయటులఁ జేయునాతఁడు
తన వశముగఁ జేసికొనఁడె దానవునైనన్ ॥ 37

కం॥ బల ముత్సాహము బుద్ధియుఁ
గలఘనుల కసాధ్య మెద్ది గల దీధరణిన్
తల పెఱిఁగి తిరిగి తీయని
పలుకులు గలవారి కెందుఁ బగఱయుఁ గలఁడే ॥ 38

కం॥ ఎలమి గలతల్లి యైనను
నలుగడె తాఁ గూడువెట్టునపు, డటుమొగమై
యల బుద్ధి విద్య చెందని
యలసులపై నల్పతోషులగు వారలపైన్ ॥ 39

కం॥ ఎవ్వరు శూరులు పండితు
లెవ్వరు సేవాప్రకార మెఱిఁగి కొలుచు వా
రెవ్వరు వారిదె సుమ్మీ
యివ్వసుధావరుల కలిమి యెంతయుఁ దలఁపన్ ॥ 40

కం॥ అరయఁగ నప్రియుఁ డైనను
నిరతము బ్రియుఁడగుచుఁ దనరు నృపతుల కెందున్
ధర బుధులు చెప్పినటువలెఁ
జరియింపఁగ నెంచినట్టి సజ్జనుఁ డెలమిన్ ॥ 41

ఉ॥ మించుగ జీవనం బొసఁగి మేఘుని లీలఁగ నెల్లవారిఁ బో
షించఁ దగుణ్ మహోన్నతులఁ జేకొని మానవనాధుఁ డిట్లు పో
షించఁగ లేనిరాజులను జేరరు భూప్రజ లెందు లోకమం
దంచలు నీళ్ళులేక తగునట్టి కొలంకులఁ బాయుకై వడిన్ ॥ 42

కం॥ కులమును శౌర్యంబును వి
ద్యలు శీలము నిట్టివెల్లఁ దలఁపరె యియ్యం
గలవానినె గుణహీనునిఁ
గులహీనునినైనఁ జేరి కొలుతురు భృత్యుల్ ॥ 43

కం॥ ఇయ్యనివారలఁ గొలువరు
నెయ్యముతో నిచ్చువారినే కొల్తురు పా
లియ్యని యావులఁ జేరనె
పెయ్యలు దమ తల్లులైనఁ బ్రేమముతోడన్ ॥ 44

కం॥ వేళఁ దలంపక ధరణీ
పాలుఁడు దనుఁ జేరి కొలుచుబంట్లకు వారం
జాలిన పనికొలఁదిని దా
వాలాయము జీత మీయవలయున్ వేడ్కన్ ॥ 45

కం॥ కాలము దేశముఁ బాత్రముఁ
జాలంగా నెఱిఁగి యియ్యఁ జను జనపతి దా
నాలాగున నీ నేరని
పాలసుఁ డగురాజు నిందపాలై పోవున్ ॥ 46

కం॥ అనిశంబును సుజనులు కా
దనెడి యపాత్రవ్రయంబు లవి గానివి రా
జున కందు నేమి ఫలమగుఁ
దనభండారంబె చెడుట దక్కఁగ నెందున్ ॥ 47

కం॥ కులమును బ్రాంతజీకము వి
ద్యలును స్వభావంబు శూరతయును వయోవ
స్థలు దెలిసి యాదరింపఁ
వలయుఁ బతి మహాత్ములైన వారల నెల్లన్ ॥ 48

కం॥ మనసరులగు సత్కులజుల
జనపతులు దిరస్కరింపఁ జన దెవ్వేళన్
ఘనముగఁ దిరస్కరించినఁ
దను నొవ్వఁగఁ జూతు రొందె తను విడుతు రిలన్ ॥ 49

కం॥ ఇలఁ బేదలైన వారిం
గొలఁదిగఁ గలవారి సాధుగుణయుతు లైనన్
బలియింపవలయు వారల
బలిసినఁ బతి సిరుల మిగులఁ బ్రబలింతు రిలన్ ॥ 50

కం॥ కులము గుణంబును గలవా
రల నీచుల సమత నడపరా దధిపతి కి
య్యిలఁ దారతమ్య మెఱిఁగిన
నలరుచుఁ బేదైనఁ గొలుతు రతనిన్ భృత్యుల్ ॥ 51

కం॥ గాజును మణిసమముగఁ గను
రాజును బ్రజపట్టు లేనిరాజును గొలువం
దేజంబు లేనిరాజును
రాజనుచుం గొలువ రంద్రు రసికులు ధాత్రిన్ ॥ 52

చం॥ అనుపమలీలఁ గల్పతరువందును బోలె మహాత్ము లెల్ల నే
జనపతిఁ జేరి సౌఖ్యమునఁ జాలఁగ మింతు రతండు సంపదన్
ఘనత వహించి సన్నుతులు గైకొనుచున్ బ్రతుకొందు నెట్టిచో
నెనయుచు సజ్జనుండు భుజియించుటెకా సిరికిన్ ఫలం బిలన్ ॥

కం॥ చెలులును బ్రాజ్ఞులుఁ జుట్టం
బులు నాప్తులు గలసి మెలసి భోగింపక ని
ష్ఫలమై దలమై చెలఁగెడు
కలిమియుఁ దానేల యట్టి ఘనతయు నేలా ॥ 54

కం॥ కలకొలఁదిఁ బంచిపెట్టుచుఁ
జెలికాఁడునుబోలె సంతసిలఁ బలుకుచు భృ
త్యులు గలుగ నడచు దొర కీ
యిల యెంత జగత్త్రియంబు నేలఁగ వచ్చున్ ॥ 55

చం॥ మునుపె పరీక్షసేసి నయముం బ్రియముం దగ నాప్తులైన స
జ్జనముల నాయపెట్టువెడ సంతతముం దగ నిల్పి వారిచే
ననువుగ రాజవర్యుఁడు ధనాదులఁ గూర్చుట యొప్పు నీరముల్
దనకిరణాళిఁ బీల్చుచు మునంబునఁ జెందెడు భానుఁడుం బలెన్ ॥

కం॥ తొలుత నధికారితనమున
నలవడి యావంక లెఱిఁగి యత్నము ధనముం
గలిగి శుచులైనవారల
నిలఱేఁ డాయాయి పనులయెడ నిల్పఁదగున్ ॥ 57

ఉ॥ మంచితనంబువారి జనమండలి మెచ్చినవారి లంచ మా
సించనివారి యత్నములు సేయుచు నుండెడివారిఁ దాఁ బరీ
క్షించినవారి నేరుపులఁ జెందినవారి నిజంబుచేఁ గడున్
మించినవారి భూవిభుఁడు నిల్పఁదగుం బనులందుఁ బొందుగన్

కం॥ ఏపను లెఱిఁగినవారల
కాపనులనె చెప్పి సేయుమనఁ దగుఁ బతి తా
రూపాది విషయములకై
యేపట్టున నింద్రియముల నెసఁగించుగతిన్ ॥ 59

ఉ॥ కొలుచుకొటారులందు నృపకుంజరుఁ డెంతయు నాప్తు నిల్పి తాఁ
గలయఁ గనుంగొనన్ వలయు గల్గినయాయము కొద్ది వెచ్చముం
దెలిసి యొనర్పఁగాఁదగు మదింపక యెందును భూమిభర్తకుం
గొలుచుకొటారులే కదయకుంఠితజీవనహేతువుల్ మహిన్ ॥

చ॥ చెఱువులు గట్టుటల్ గృషులు సేయుట వాడల లెక్కచేయుటన్
కరులను బట్టుటల్ గనుఁ గైకొనుటల్ వనదుర్గసేతువుల్
పొరయుట బేరమాడుటయు భూస్థలి నిట్టివి యష్టవర్గ మౌ
నరపతి వీనిఁ గూర్చుటకు నమ్మినవారలఁ బంపగాఁ దగున్ ॥ 61

కం॥ ఇలతేఁ డీవ్యవహారము
వలనం గడుఁబేదలైనవారలు ప్రబలం
గల రా యా వ్యవహారం
బుల వారల కడ్డపాటు వోఁ జేయఁదగున్ ॥ 62

గీ॥ క్రంపగొట్టించి సేద్యముల్ గలుగఁజేసి
పైరు దలకొనఁ గాపాడఁ బంచి ఫలము
గలుగుచో దండయుక్తిని గాఁచియుండఁ
జేయఁగాఁదగు నటులైన సిరులఁ జెందు ॥ 63

ఉ॥ వైరులచేత దొంగలగువారలచే నధికార్లచేత భూ
మీరమణుండు లోభమున మించుటచేఁ జనవర్గచేత ని
ద్ధారుణికిన్ భయంబులగు దా నిటులైదువిధంబు లోభయం
బారసి వేళయందె ఫలమందుట మేలు త్రివర్గవృద్ధికై ॥ 64

కం॥ బలసి యెదురొడ్డి గరువం
బులు గల యధికారిజనులఁ బుడ్లునుబలెఁ దా
నిలతేఁడు చీల్చివేయఁగ
వలయుం గడు ధూర్తులైనవారలు వెఱవన్ ॥ 65

కం॥ జనపతియుం దల్పంబై
ఒనరిన యపకారమైనఁ దాఁ జేయఁగడం
గిన జడుఁడున్ జెడును జితిం
గనుఁగొని పడి మిడుత పడియుకరణిన్ ధరణిన్ ॥ 66

ఉ॥ భూవలయంబునన్ విభుఁడు పోషణ మొందు నొనర్ప లెస్సగా
నావులు పాలు పిండుగతి నన్నిటఁ బ్రోది చెలంగఁ జేసినన్
దీవలు పూవు లిచ్చుగతి ధీరతఁ జేకొని ప్రోచెనేని తాఁ
గావలె సన్నుయర్ధములు గన్పడ నిత్తురు వేడ్కతోఁ బ్రజల్ ॥ 67

శా॥ భండారం బొనఁగూర్పఁగా వలయు భూపాలుండు యత్నంబుచే
నిండార న్మదియందు నాప్తుఁ జతురున్ నిల్పందగున్ గీర్తి బ్ర
హ్మాండంబంతయు మీఱనీవలెఁ ద్రివర్గాపేక్షతో వేళలన్
దండారం జితలోకుఁడై మిగుల నుద్దండప్రతాపోన్నతిన్ ॥ 68

మ॥ తనకుం గల్గినకల్మియంతయును దా ధర్మార్థమై వెచ్చ పె
ట్టిన భూపాలునిలేమియున్ మిగులఁగా రీవుల్ ఘటించుం ధరి
త్రిని జేజేలకునై కళల్వరుసతో దీపించఁగా నిచ్చు చం
ద్రునినిర్ పేదతనంబువోలె జగదారూఢప్రభావోన్నతిన్ ॥ 69

కం॥ ఇతరులఁ గడు నమ్మక యే
గతిఁ గార్యం బొనరు నటులఁగా నమ్మఁదగున్
క్షితిపతికిం దలఁప 'బృహ
స్పతే రవిశ్వాస' యనెడి శాస్త్రముకల్మిన్ ॥ 70

ఉ॥ నమ్మఁగ రాక యుండెడుజనమ్ముల నమ్మఁగఁ బోల దెట్టిచో
నమ్మఁగ నర్హులై తగుజనమ్ములనైనను దాను మిక్కిలిన్
నమ్మఁగరాదు నమ్మిన ఘనమ్మగు సంపద, వారిసొమ్మె యౌ
నిమ్మహిఁ గాన రాజులకు నెవ్వరి నమ్మఁగరాదు నెమ్మదిన్ ॥ 71

ఉ॥ ఎట్టి యుపాయమార్గముల నిమ్మహిలోన జనంబు చిత్తముల్
గట్టిగఁ గానుపించు వెలిఁ గన్పడువస్తుసమూహ మట్లు తా
నట్టి యుపాయమార్గముల నందఱిచిత్తము లెంచి చూచుచున్
నెట్టన యోగిరీతి ధరణీధవుఁడుం జెలువొందఁగాఁ దగున్ ॥ 72

మ॥ తనచారిత్రముచేత నెట్టియెడ మోదం బందుచు న్మించుభూ
జనులుం బంట్లును గల్గి దుర్ణయగతిం జాలింపుచుం దేనియల్
సిలుకం బల్కుచునుండు భూమిపతి దా శీలంబు నేర్పొందు నా
త్తునిపై నెంతయు రాజ్యభార మిడినన్ బొల్పొందుఁ దేజస్వియై॥

కంటకశిక్షణప్రకరణము

ఉ॥ సంతత మాదరంబునఁ బొసంగుచు లోకమునందు వేదమం
దెంతయు నేర్పుతో మెలఁగి యెయ్యెడ నేర్పరు లైనసజ్జనుల్
సంతసమంది కొల్వఁ దనసద్గుణముల్ గనుపట్టుచుండ బా
హ్యాంతరరాజ్యచింత వసుధాధిపవర్యుఁడు సేయఁగాఁ దగున్ ॥

గీ॥ దేహ మాంతరరాజ్యంబుఁ దెలిసి చూడ
బాహ్యరాజ్యంబు రాష్ట్రమై పరగు నొకటి
కొకటి కాధారమై రెండు నుండుఁ గాన
యిట్టి రెండును నయవిదు లేక మంత్రు ॥ 75

కం॥ బలు వగురాజ్యాంగంబులు
గలుగుట రాష్ట్రంబువలనఁ గనుక ధరిత్రీ
తలనాధుఁడు యత్నముతో
నలువుగ రాష్ట్రంబుపాలనము సేయఁదగున్ ॥ 76

కం॥ జనముల రక్షించుటయే
జనపతికిన్ ధర్మ మట్టిసద్ధర్మము వి
ల్వను జనపతితను వటుగనఁ
దనతను వనిశంబు బ్రోవఁదగు నాయమునన్ ॥ 77

కం॥ ధర్మార్థం బగుహింసలు
ధార్మికులై మునులఁ బోలి తగురాజులు ము
న్నిర్మలులై యొనరిచి రిది
ధర్మము గావున వధింపఁదగు పాపాత్మున్ ॥ 78

కం॥ జనపతి ధర్మముఁ దప్పక
ధన మార్జింపంగవలయు ధర్మముకొఱకై
జనులను బీడింపుదు రే
జను లనిశము వారిచేఁత శాసింపఁదగున్ ॥ 79

కం॥ ఎట్టిది మెత్తురు సజ్జను
లట్టిదెపో ధర్మ మనఁగ నలరుం ధరలో
నెట్టిది మెచ్చరు సజ్జను
లట్టిదియ యధర్మ మనఁగ నలరుచునుండున్ ॥ 80

కం॥ జనపతి సుజనుల మర్యా
దనె మెలఁగుచు వినయమునను ధర్మ మధర్మం
బును దెలియుచుఁ దా భూప్రజ
లను బ్రోవఁగఁ దగును దూష్యులం దునుమఁదగున్ ॥ 81

వ॥ అవ్విధం బెట్టిదంటేని. 82

గీ॥ అధిపు చనవరులగుచు రాజ్యంబుఁ జెఱుచు
పాపకర్ముల మూఁకలై పరగువారి
నొక్కఁడొక్కఁడుగా నేని నుండువారి
దూష్యులని పల్కుదురు నయధుర్యులెందు ॥ 83

వ॥ అట్టి దూష్యజనంబులం జనంబు లెవ్వరు నెఱుంగకుండ ధనంబు చేతనైనను గైదువులచేతనైన నుపాంశుదండ ప్రకారంబున దండింపవలయు నొండె, లోకశత్రువులని సకలజనంబులచేత నిందనొందించి ప్రకాశదండంబుచేతనైనను జంపవలయు నందు నుపాంశుదండప్రకారంబు. 84

సీ॥ దూష్యుని గట్టున దోడ్తేరగాఁ బంచి
పొడగని పొమ్మని పొంకపఱచి
రానరాకుండెడుకైదువుల్ గలవారి
నతని పిఱుంద రా ననువుపఱచి
తనకు నమ్మిక గలద్వారపాలకుంచే
దూష్యునిబంటులఁ దొలఁగఁ దోలి
లోపలిచావడిలోనికి రప్పించి
యతనిఁ జంపగ నంపు నాయుధముల

గీ॥ వారిచే నెన్న నేరముల్ వాని కెఱుక
పడఁగ నొనరించి లోకంబు బ్రతుకవలసి
సిరుల మిక్కిలి నభివృద్ధిఁ జెందవలసి
వానిఁ జంపించవలయు భూవల్లభుండు ॥ 85

ఆ॥వె॥ అధికదండనమున నలికిపోదురు ప్రజ
యల్పదండనమున నలుకకుందు
రిటులఁ గాకయుండ నిల నేలుపతి యుక్త
దండనంబె కలిగి యుండవలయు ॥ 86

కం॥ తలకొలిపి మొలకపైరుల
బలియంగాఁ జేయ నవియు ఫలమిచ్చుగతిన్
చెలిమిఁ దగఁ బ్రోవ వేళన్
పలమొసఁగఁగ నేర్తు రెందు బ్రజలుం బతికిన్ ॥ 87

రాజపుత్రరక్షణము

కం॥ కడు నర్థలోభములచేఁ
గొడుకు లెదిరి విభునిఁ జెఱుపఁగోరుదు రగుటన్
కొడుకుల మనుపఁగవలయుం
ఒడమి జనంబులను దాను బొదలుట కెందున్ ॥ 88

కం॥ మదయుతులు నిరంకుశులై
కొదవ వెడలినరాజతనయకుంజరములు నెం
పిదము లయి పరిభవించినఁ
జదువరె తోఁబుట్టునైన జనకుని నైనన్ ॥ 89

కం॥ ఏకడల మత్తులై తిగు
రాకొమరులు నెఱుపుచుందురాజ్యముఁ బ్రోవన్
జేకుఱుట దుర్లభం బగుఁ
గైకొని పులివాతఁ బడినకంత యనంగన్ ॥ 90

కం॥ తముఁ బ్రోచువారినైనను
దమకముతోఁ గొదువ గలుగుపిఱిఁ జెఱుతురు రా
కొమరులు భువిలోపల సిం
హముకొదమలలీలఁ జాల నాలరు లగుచున్ ॥ 91

కం॥ వినయము గలుగుచు మెలఁగఁగఁ
దనయుల శిక్షింపవలయు ధరణీపతికిన్
వినయులు గాకుండినతన
తనయులచేఁ గులము బలము దలముం జెడదే ॥ 92

కం॥ వినయము గలుగుకులస్త్రీ
తనయుని యువరాజు సేయఁ దగు నెయ్యెడలన్
వినయము లేనికుమారునిఁ
బనుపడ మదగజములీల బంధింపఁదగున్ ॥ 93

ఆ॥వె॥ ఓజగేడనైన రాజపుత్రుని వెళ్ళఁ
దోలఁ దగదు వెళ్ళఁ దోలెనేని
యతఁడు గడుఁ బ్రయాస మంది శత్రువు లైన
జనులఁ గూడి యతనిఁ జదుపఁ గాన ॥ 94

కం॥ వెసఁ దండ్రి చెప్పినట్టుగె
కసరక వర్తించునటులఁగా నెల్లపుడున్
వ్యసనాశ్రయజనములచే
వ్యసనము గలసుతుల వెతల నందించఁ దగున్ ॥ 95

ఆత్మరక్షితకప్రకరణము

కం॥ ఇలఱేఁడు మోసపోవక
తెలివిన్ విష మిడకయుండఁ దెలియం దగుఁ బీ
టల వలువలఁ దొడవుల శ
య్యల భోజనపానవాహనాదులయందున్ ॥ 96

కం॥ విషహర మగుమణు లిడికొని
విషహర మగుజలకమాడి విభుఁ డొందఁదగున్
విషరహిత భోజనంబుల
విషహరు లగువెజ్జులుండ వేడుకతోడన్ ॥ 97

విషపరీక్షావిధానము

కం॥ ఇలలోఁ గోఁతులు గొరవం
కలు రాచిలుకలును విసము గనుకొనినం బా
ముల గనుగొనినను గడుఁ గూ
తలు బెట్టు నటండ్రు నీతితత్త్వవిధిజ్ఞుల్ ॥ 98

సీ॥ విషముఁ జూచినవేళ విషయుక్త మైనప
దార్థంబుఁ జూచిన యట్టివేళఁ
దలక బొబుచును గోఁతులును రాచిలుకలు
గోరువంకలు సారెఁ గూఁత లిడును
కన్ను లెఱ్ఱగఁ బొబుఁ గలహంసలకు నెల్ల
మఱి మదంబును జెంది మలయుఁగొంచ
మదకోకిలంబులు మరణంబుఁ జెందును
వెన్నెల పులుగులు వేగ బడలు

గీ॥ ఏందు నొక్కటివేసైన నెంచు లెన్నఁ
దాఁ బరీక్షించి ధారుణీధవున కెపుడు
భోజనముఁ జేయఁదగు నిట్లు భోజనంబుఁ
జేయుచుండినఁ బతి హానిఁ జెందకుండు ॥ 99

కం॥ నెమిలియు దుప్పియుఁ బాముల
నమలుం గావున విభుండు నగరులలోఁ దా
నెమిలిని దుప్పిని సతతముఁ
దమితోడుతఁ బెంచి విడువఁదగు లీల విలన్ ॥ 100

కం॥ జగతీపతి భుజియింపఁగఁ
దగు నన్నము మున్ను వహ్నిఁ దా నిడి విషమున్
దగ నెఱిఁగినపక్షుల కిడి
తగులీలఁ బరీక్షఁ జేసి తగు భుజియింపన్ ॥ 101

గీ॥ ఎందు విషముండు నన్నంబు లిడినయపుడు
నల్లనగుమంటచే నగ్ని నల్ల నగును
బొదలి చిటచిట మనెడి చప్పుడును బొడముఁ
బులుఁగులకు నెల్ల మరణంబు గలుగుచుండు ॥ 102

కం॥ చలువల నందుట పెఱచా
యలఁ జెందుట యెండియుండు టార్ద్రిం బగుటన్
నలుపైన యావి గలుగుట
తలఁప విషాన్నంబునకును దగుచిహ్నంబుల్ ॥ 103

కం॥ ఉడుకుతఱి నల్ల నురుగులు
పొడముట తావియు రసంబుఁ బోవుట స్పర్శం
బుడుగుట యెండుటయును విష
మిడఁబడుకూరలకు గుఱుతు లివి యెఱుఁగఁ దగున్ ॥ 104

కం॥ ఘన మగు చాయలు గలుగుట
యును జాయలు లేకయునికి యూర్ధ్వముగాఁ బై
కొనురేకలు నురుగొందుట
లనిశము విషయుక్త మగుపదార్థముగుఱుతుల్ ॥ 105

కం॥ జలములయెడ మధువునఁ గో
యిలచాయలఁ జెంది పాల నెఱుపై దధిలో
పల రసముల నలుపై విష
ములు గలసిన పైకి రేక మొనయుచు నుండున్ ॥ 106

కం॥ ఉడుకక యుండుట మాడుట
గదుఁ జిముడుట నల్లచాయఁ గలుగుట పలి య
ప్పుడ వాడొందుట విషముల
నిడునార్ద్రపదార్థములకు నివి చిహ్నంబుల్ ॥ 107

మ॥ భువిలో నెండినయట్టివానికి విషంబుం జెందినన్ సూక్ష్మజం
తువు లెల్లం బడి చచ్చుఁ జేరువకు రాఁ దోద్తోనగుం జాయ మా
ర్దవయుక్తంబులు గట్టివౌ మఱి మృదుత్వం బందుఁ దా గట్టివ
స్తువు వేగంబ నలంగి తుందుమురులౌ దోషాశ్రయత్వంబునన్ ॥

సీ॥ కప్పడంబుల రత్నకంబళంబులయందుఁ
బొగవన్నె మచ్చలు బొడమియున్న
దారంబు తెగుటయుఁ దగిన నూఁగునకును
రోమంబునకును జాఱుటలు గల్గ
మఱి లోహమునకును మణులకు నల్లని
యడుసుఁ బూసినయట్లు దొడరుటయును
గాంతిసంతతియును గౌరవం బుడుగుట
సామర్థ్యమును సుఖస్పర్శ మడఁగు

గీ॥ దావిగాఁ గల్గియుండెడునట్టివెల్ల
సెఱుకు లనుమందు విషములఁ గూడెనేని
యిన్నివిధముల విషమిడు టెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 109

వ॥ పలుకులు కొంకి త్రొమ్పడుట, పల్మరు దొట్రిలి నాల్గుదిక్కులన్
గలయఁగఁ జూచుటల్, జెమట గ్రమ్మట కంపము బుట్టు టావులిం
తలు మొగమెండి నల్లఁబడి తారుటలుం గడుఁ జంచలించుటల్
పెలుచఁదనంబునన్ విషముఁబెట్టిన వానికిఁ జిహ్నముల్ మహిన్॥

కం॥ నీరును మధు వౌషధములు
నారసి యొనరించువాని కవి మున్నిడి తా
నేరుపుతోఁ గొనవలయును
ధీరమణుఁడు ప్రతిదినంబు భోజ్యాదులతోన్ ॥ 111

కం॥ తొలుతఁ బరీక్షింపుచు ము
ద్రలు బెట్టినభూషణములు దావుల పూవుల్
గలపంబులు మొదలైనవి
యెలమిఁ గలుగు బంట్లు బతికి నీయఁగ వలయున్ ॥ 112

కం॥ తనకుం బరరాజులు పని
చినవస్తువు లెల్ల వేగఁ జేకొన కెందున్
మునుపె పరీక్షింపుచుఁ గై
కొనఁగాఁ దగు నాత్మహితముఁ గోరెడిపతికిన్ ॥ 113

కం॥ మిగులఁగ నితవరులగుచున్
దగునాప్తుల బ్రోవవలయు ధరణీవిభునిన్
బగవారివలన దన వా
రగువారలవలన హాని యడరక యుండన్ ॥ 114

గీ॥ పల్లకుల నందలంబుల భద్రకరుల
గుఱ్ఱముల వీని లెస్సఁగా గుఱుతు లెఱిఁగి
యెఱిఁగినటువంటివారు దే నెక్కవలయు
నాత్మరక్షణ మొందుట కవనివిభుఁడు ॥ 115

కం॥ దొర మిక్కిలి యిరుకట మగు
తెరువున నెవ రెఱుఁగకుండుతెరువున నేచో
నరుగుట కొఱగా దందురు
ధరలోపల నీతిశాస్త్రతత్పరు లెల్లన్ ॥ 116

కం॥ కనుగొనినపనుల నితవరి
తనమున బ్రాతతికమునను దగువారల నెం
దును మంచివారిఁ దెలియుచు
జనపతి యేర్పఱచి యనుపఁజనుఁ బనిచెంతన్ ॥ 117

గీ॥ ధార్మికులు గానివారలఁ దా నెఱింగి
దోసకారుల నవమానితులను బరుల
వలన వచ్చినవారిఁ గ్రూరుల నెఱింగి
దూరమునఁ బాయవలయును దొరల కెల్ల ॥ 118

గీ॥ అరులయోడలఁ జెదరఁగ నడ్డపెట్టఁ
బడెడునోడ బరీక్షింపఁబడనిపీలి
కాండ్రు గలయోడ పెనుగాలిఁ గడచునోడ
బ్రాఁతయోడయు నెక్కఁగాఁ బతికిఁ దగదు ॥ 119

ఉ॥ నరపతి వెట్టబెట్టగు దినంబులఁ గ్రీడలు సల్పఁ బొల్పుగన్
సరసులఁ బెద్దమీలను మొసళ్ళను వీడఁగఁ జేసి యాప్తతం
బరగిన సైన్యముల్ దనుఁగనన్ దగనుండ నొనర్చి కాచునా
పరములతో హితుల్ సతులు దాను వినోదము మోద మందఁగన్॥

ఉ॥ కానకుఁ బోక చేరువునఁ గన్పడి కంటకశుద్ధి నొందును
ద్యానమునందు జవ్వనము నందుటకుం దగులీల భోగముల్
మానవనాథుఁ డొందఁదగు మారునిచేత మదించి యెంతయుఁ
దానటు మోసపోక లలనావలనాకలనాభిరాముఁడై ॥ 121

గీ॥ ఉచితమై పోవ రావచ్చియుండి యాప్త
రక్షితంబగు నడవికి రాజు లక్ష్య
మెఱుఁగుటకు నల్పభోజనం బెసగువేఁట
కరుగఁదగు నుత్తమంబగు హయము నెక్కి ॥ 122

ఉ॥ దిట్టుట గల్గి శుద్ధిగని ధే యనినంత సమీరు మీరుచుఁ
ముద్దులు గుల్కు తేజి నృపముఖ్యుఁడు వేడుకతోడ నెక్కి ము
న్నొద్దిజనంబు గావలిగ నుండెడుకానకు వేఁట పోఁదగుఁ
చద్దయు నాప్తసీమకును దాఁ జలలక్ష్యనిరీక్షణార్థమై ॥ 123

ఉ॥ అరసి సమీపకాననము నైనను గంటకశుద్ధి చేసి భూ
వరుఁడు నిజాప్తులైనపరివారము లాయితపాటుతోడ రా
నరుగుట యొప్పు నందు బలువై తగుకానల నిక్కమైనచో
నిరతము నుండరాదు నృపనీతిరహస్యవిచారశాలికిఁ ॥ 124

కం॥ తనతల్లి యింటికైనఁ
జనపతి యెచ్చరికతోడఁ జనగాఁదగుఁ గా
వున నడవికి జనియెడిచోఁ
దనరఁగ నెచ్చరికె లేక తగునా యరుగఁ ॥ 125

గీ॥ ధూళిఁ జల్లుచు విసరెడి దొడ్డగాలి
కాలమందును జడివానకాలమందు
మండువేసవియందును మబ్బులోన
నరుగరా దెందు సుస్థిరుఁ డైనపతికి ॥ 126

చం॥ కలకల ముల్లసిల్ల నల కట్టికవా రిరుపంకి సందడిన్
దలగ నొనర్చి దూరముగఁ దారు భజింప బలంబుపెంపుసొం
పులు దగ రాజవీథులనె పోవుచు వచ్చుచు నుండఁగాఁ దగున్
జెలఁగి నిజోన్నతుల్ జనులు చెంతలఁ జూడ నృపాలమౌళికిన్॥

కం॥ ఇలఁ జేఁ డుత్సవముల యా
త్రల మూఁకలయందు నేఁగుతఱి సందడు ల
గ్గల మగుచోట్లకుఁ బోరా
దలవున వేగిరము చను టయముగా దెందున్॥ 128

కం॥ తలపాఁగలు నరచట్టలు
గలిగిన మరుగుజ్జు లన్నగాండ్రును వేదిం
గొలిచి తిరుగఁగా మెలఁగన్
వలయును జనపతియుఁ దినదు నగరులలోనన్॥ 129

కం॥ తల పెఱుఁగుచు శుచిభావము
గలిగిన లోపలియమాత్యగణముల శస్త్రా
గ్నులు మఱి విసములు వెలిగాఁ
గలక్రీడలఁ బ్రొద్దు గడపగాఁ దగుఁ బతికిన్॥ 130

మ॥ తమసన్నాహముచేఁ దనర్చి పనులం దక్షత్వముం జేర్చి యు
త్తము లౌవారలు సమ్మతింప మెలఁగన్ దా నెంతయు న్నేర్చి ని
త్యము నంతఃపురమందుఁ గాచుజనముల్ ధాత్రీపతిం గావ యు
క్తమగున్ లోనినగళ్లనుండుతఱి నిక్కంబై ననెయ్యంబునన్॥

ఉ॥ ఎనుబదియేండ్లసత్పురుష లేఁబదియేడులు గల్గునింతు లిం
దును జతనంబు మీఱ మదితోడుత నంతిపురంబులోని కా
మినుల శుచిత్వముం గనుచు మెల్కువ వచ్చుచుఁబోవుచుండు నా
జనముల దా రెఱుంగఁ దగు సంతతమున్ నరనాథుపంపునన్॥

మ॥ జలకంబాడి మిటారి కుచ్చెలఁ మించన్ వల్వముల్ గట్టి యిం
పులతోఁ జక్కఁ జెక్కఁగన్ మెఱయుసొమ్ముల్ బూనితావుల్ గుబుల్
కొలుపన్ గంధముఁ బూసి క్రొవ్విరులు పెక్కుల్ నిక్కఁగాఁ దాల్చి చెం
తలఁ గొల్వం దగు వారకాంతలు మహీనాథుం బ్రమోదంబునన్ ॥

శా॥ రాణింపం జలకంబు దీరిచి యొయ్యారంబై మిటారించు పై
రాణీసేలలు గట్టి క్రొవ్విరుల దండల్ చుట్టి భూషాళి వి
న్నాణం బొప్పగఁ బెట్టి కప్పురపు గంధస్ఫూర్తి గన్పట్టి మేల్
జాణల్ గాణలు నై నవారవనితల్ రాజేంద్రుఁ గొల్వందగున్ ॥

కం॥ వెలి దిరిగెడి తొత్తుల వ
ద్రుల జోగులఁ గపటజనులఁ దూఁడి చరించన్
వలదు నృపునంతిపురమున
మెలఁగెడు వారెల్ల మిగుల మెలఁకువతోడన్ ॥ 135

కం॥ కొనిచను పదార్థములు వ
చ్చిన పనులుం దెలివిఁ బడగఁ జెప్పుచు యత్నం
బునుపొందఁగ రాఁ బోవం
జను నంతిపురంబులోని జనముల కెల్లన్ ॥ 136

చం॥ కనుఁగొనినంత నంటికొనుఁగాన తెవుల్గలవారిఁ జూడ కెం
మను నొకపాటి నొప్పులను దూలెడు బంటులఁ జూచి యాదరం
బెనయఁగఁ బ్రోవఁగాఁ దగు మహీతలభర్తకు నెంచ నార్తులౌ
జనములఁ బ్రోచుకంటెను బ్రశస్తతరం బగుధర్మ మున్నదే॥ 137

మ॥ తొలుతం దా జలకంబుఁ దీర్చి చలువల్ దోడ్తో విరుల్ సొమ్ములుం
గలపం బంపుచు దేవియుం జలకమున్ గావించి రాఁ జల్వలుం
గలపంబుల్ మణిభూషలున్ విరులు జోకం దానె యిప్పించి నే
ర్పులఁ గూడం దగు రాజు పెంపెసఁగఁ బ్రాపున్ సొంపుఁ గల్పించు మన్॥

కం॥ తనయింటనుండి జనపతి
తనదేవినివాసమునకు దా నరుగంగా
జనదు మఱి యెంతప్రియుఁడై
తనరిన వనితలను నమ్మఁ దగ దధిపతికిన్ ॥ 139

సీ॥ భార్యయింటికిఁ జని భద్రసేనుఁడు తొల్లి
యాపెతోఁబుట్టుచే హతుఁడగుటయు
నాలిగృహంబున కరిగి కారూశుండు
తన తనూభవునిచేతనె పొలియుట
ప్రియురాలు విసముతోఁ బేలాలొసంగిన
వేగంబె కాశికావిభుఁడు పడుట
జడలోన దాఁచుకుండెడుకత్తిఁ దెలియక
రమణిచేతనె విదూరథుఁడు చెడుట

గీ॥ యటుల గరళాంజనముఁ బూసి యద్దమంచె
మేఖలయు నీయఁ జారూప్య మేదినీశు
లవనిపై రూప్యసంవీరు లగు నెఱింగి
యధిపుఁ డతివలయిండ్లకు నరుగరాదు ॥ 140

కం॥ వనితలచే విసములచే
జనపతి యటు మోసపోక, శాత్రవతతులన్
వనితలచే విసములచే
వనిశము దా మోసపుచ్చు టర్హం బెందున్ ॥ 141

కం॥ పరమాప్తజనులచేతనె
నరవరుభార్యలు సురక్షణముఁ జెందుదు రా
దారకుం గై వసములు గా
దారకున్ భోగైకయుక్తితో నిహపరముల్ ॥ 142

కం॥ తనమది ధర్మము గోరుచుఁ
దనకార్యములెల్లఁ గూడఁ దగ రాజు క్రమం
బున మధురాహారుండై
యనువొందఁగ నుచితరాత్రులం దింపొందన్ ॥ 143

చం॥ మనుజవిభుండు కార్యగతి మాపు విచారముచేసి కొల్వుపొ
చ్చిన ప్రజ సంచి లోనిగృహసీమల వామలు సేవఁజేయఁగా
ననుపమలీల నాయుధమునందని చేతఁ జెలంగి నిద్రపో
వను దన కాప్తులైన పరిచారులు నారెల గాచియుండఁగన్ ॥

ఉ॥ మేదురనీతిమార్గమున మేల్కొనియుండెడు రాజు నగ్గినన్
మేదినిలో జనంబు లెలమిన్ సుఖవృత్తిని నిద్రఁగాంతు రే
వాదలు లేక మత్తుఁడయి పార్థివుఁడూరకె నిద్రవోయినన్
మోదముఁజెంది భూమిజనముల్ సుఖవృత్తిని నిద్రఁగాంతురే ॥

చం॥ ఎటులను రాజరాజ్యముల కెల్లను రక్షణమంత్రము మౌను లెం
దటుగను నెట్టివేళల ధరాధిప వర్యుఁడు నీతియుక్తుఁడై
యటులనె ప్రోచుచుండి నెఱయం బరిపాలన మాచరించినన్
జటుల నిజప్రతాపమున శత్రులఁ గెల్చుచుఁ బొల్చు సంపదన్ ॥

చం॥ విలసితరాజధర్మయుత విశ్రుతభృత్యవితానపాలనా
తులిత మనీషదూష్యజనధూర్తవిఖండనదక్ష సద్గుణా
కలితతనూజసంపదధికస్థిర యాత్మసురక్షణక్రమో
జ్జ్వలరిపుమౌళిరత్నరుచిజాలమనోజ్ఞపదాంబుజద్వయా ॥

కం॥ భూనుత లక్ష్మణ చర్యా
శ్రీనియత నిజానుజన్మచినతిమ్మమహీ
శానవరత సంసేవిత
ధీనయ సుగుణాభిరామ తేజోధామా ॥ 148

పంచచామరము — పరోటుహో ప్తవంశసంగ సింగరాట్సుతాజ్ఞిరా
వరాపురోర్లి పద్రమానిదాన దానవైభవా
స్ఫురత్కరాగ్రజాగ్రదుగ్రఘోరి ధారసారప
త్కరాళచండ ఖడ్గదండదండితారి మండలా ॥ 149

గద్యము :— ఇది శ్రీమన్మదన గోపాలవరప్రసాద లబ్ధసార సారస్వత
భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన
విధేయ శ్రీరామ కృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ
ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబున స్వామ్యను జీవివృత్తి
లక్షణంబును, గంటక శిక్షణంబును రాజపుత్రరక్షణంబును నాత్మ
రక్షా విచక్షణత్వంబును నున్నది తృతీయాశ్వాసము



# ఆంధ్ర కామందకము

## చతుర్థాశ్వాసము

కం॥ శ్రీకర రఘురామ గుణా
లోకస్తుతిచతుర నీతి నిర్ణయ నిపుణా
లోకహిత వంశతిలకర
నాకర కొండ్రాజ వెంకటాద్రి నరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### మండలయోని ప్రకరణము

గీ॥ బలము భండారమును గల్గి పార్థివుం డ
మాత్యులను మంత్రులను గూడి మతుల నెప్పుఁ
గా విచారింపవలయు దుర్గమున నుండి
మహిమ నెంపొందుచుండెడు మండలముల ॥ 3

కం॥ పరిపూర్ణమండలుండై
ధర రంజిలఁ జేయుతుహినధామునిమాడ్కిన్
బరిపూర్ణమండలుండై
నిరతము విజిగీషువైన నృపతి తనర్చున్ ॥ 4

కం॥ జనపతి విశుద్ధమండల
మున మెలఁగిన రథికుచందమున నెల్లపుడుం
చనదు నవిశుద్ధమండల
మున మెలఁగ రథంబు చక్రముంబలె నలఁగున్ ॥ 5

వ॥ ఇట్టి విజిగీషు వైనట్టి రాజునకు నమాత్యుండును రాష్ట్రంబును దుర్గంబును భండారంబును బలంబును నియ్యేమను బంచప్రకృతు లని నీతిజ్ఞులైన వారలు వలుకుచుండుదురు. మఱియును బృహస్పతిమతంబువార లీ పంచప్రకృతులకు రాజును మిత్రుం డునుంగూడ సప్తప్రకృతులం గలిగినది రాజ్యంబని పలుకు చుందురు రిట్టి ప్రకృతులతోడం గూడికొని మహోత్సాహుండై యన్నిటియందును నభ్యాసంబు గలిగినవాఁడై శత్రువులం గెలువ నిశ్చయించినరాజు విజిగీషు వనంబరగునట్టి విజిగీషువైన రా జెట్టివాఁడనిన. 6

కౌలీన్యాది విజిగీషు గుణములు

సీ॥ కులమును బుద్ధియుఁగలిగి యుత్సాహియై
చిత్తజ్ఞుఁడై వృద్ధసేవి యగుచు
కడు నియ్యనేర్చి ప్రగల్భుఁడై సత్యంబు
సడలక పనులందు జడతలేక
కలఁగక వినయంబు గలిగి స్వతంత్రుఁడై
దేశకాలజ్ఞుఁడై దిటము గల్గి
యన్నియు నెఱిఁగి మాటాడగా నేరిచి
దక్షుఁడై గుప్తమంత్రంబు గలిగి
గీ॥ మిగులఁ బోటరియై బత్తి మే లెఱింగి
పాపకర్మము గాకుండు బంట్లు గల్గి
శాస్త్రదృష్ట నిజాచార చతురుఁడైన
యతని విజిగీషు వండ్రు మహాత్ములెల్ల ॥

సీ॥ బహుళరాజ్యాంగుఁడై బడలికలను గెల్చి
జాడ్యంబుఁ జపలత జాలివిడిచి
చతురుఁడై రిత్తయై చనని కోపముగల్గి
శరణాగతులను వత్సలతఁ బ్రోచి

దంచనాపూర్వకవాక్యముల్ పదరుచు
సలమటలకు నోర్చి బలిమిగలిగి
మారకార్యజ్ఞుఁడౌ దొరఁ గెల్చు దొరయగు
గుణము లన్నియునుఁ జేకూడెనేని

గీ॥ కడుఁ బ్రతాపగుణంబైనఁ గలుగవలయుఁ
దెలిసి చూడఁ బ్రతాపంబు గలుగువాని
కఖిలశత్రులు వెఱతు రియ్యవనిలోన
మృగపతికి నోడి యొదిఁగెడి మృగములనఁగ ॥ 8

కం॥ అతుల ప్రతాప నిధియగు
పతి నేకొనుచుండు నెపుడు బలువగు సిరి నీ
క్షితిఁ గావున నుత్సాహము
గతిచేతఁ బ్రతాపగుణమె కైకొనవలయున్ ॥ 9

కం॥ ఇల నేకార్థప్రీతిం
గలహించిన శత్రు వగుచుఁ గనఁ బడు నందున్
బలవజ్జిగీషుగుణముల
నలరిన బెడిదంపుఁ బగతుఁడంద్రు నయజ్ఞుల్ ॥ 10

గీ॥ పిఱికి సోమరి క్రూరుండు పిసిఁడి చంచ
లుండు మూఢుండు సత్యహీనుండు మోస
పోవునాతండు యోధులఁగావరించి
పలుకునతఁడును సాధ్యుండు పరుల కెందు ॥ 11

మండలస్వరూపము తద్భేదములు

వ॥ ఇఁకయు మండలస్వరూపం బెట్లన్నను బరాశరుండు విజిగీషుప
సరియు నన్యోన్యజయేచ్ఛ గలవారగుటంజేసి వీర లిరువురకు
నేకప్రకృతియ కావున నీప్రకృతియ మండలంబని యిలుపు

మండు. వెండియు నతండే విజిగీష్వరులకు భేదం బొనరిం జేసి వీరలిరువురు దొరల గలయది మండలంబని పలుకుచుండు. మఱికొన్ని మతంబులవారు విజిగీష్వరి మధ్యము లనియెడి మువ్వురు దొరలంగల యది మండలంబని పలుకుచుండుదురు. మఱియు నొకమతంబువారు విజిగీష్వరి మధ్య మోదాసీను లనియెడి నలువురు దొరలం గల యది మండలంబని పలుకుచుండుదురు. మఱియుఁ గొన్నిమతంబులవారు విజిగీషునకు వెనుకటి పార్ష్ణిగ్రాహాక్రందు లిరువురును ముందరి యరి మిత్రు లిరువురునుం గూడి విజిగీషువుతోడ నేవురు దొరలంగలయది మండలంబని పల్కుచుండుదురు. మఱియుఁ బులోమేంద్రులు విజిగీష్వరి మిత్రపార్ష్ణిగ్రాహ మధ్య మోదాసీను లనియెడి యార్వురు దొరలంగలయది మండలంబని పల్కుచుండుదురు. మఱియుఁ గొన్నిమతంబులవారు విజిగీష్వరి మధ్యమోదాసీను లనియెడి నలుగురు దొరలకును నలుగురు మిత్రులం గూడి యెనమండ్రు దొరలం గలయది మండలంబని పల్కుచుండుదురు. మఱియుఁ గొన్ని మతంబులవారు విజిగీషునకు ముందరి యరిమిత్రాదు లేవురును వెనుకటి పార్ష్ణిగ్రాహాదులు నలువురును విజిగీషువును గూడి పదువురు దొరలం గలయది విజిగీషు మండలం బనుపేరఁ బ్రసిద్ధంబుగాఁ బలుకుచుండుదురు. మఱియు శుక్రమతంబువారిట్టి విజిగీషుమండలంబు రాజులు పదుగురును మధ్యమోదాసీను లిరువురునుం గూడి పన్నిద్దరు దొరలఁ గలయది యగుటం జేసి ద్వాదశ రాజమండలంబునకే తొలుతఁ జెప్పఁబడిన యమాత్యాది పంచప్రకృతి భేదంబుల వలనను స్వామ్యాది సప్తప్రకృతి భేదంబుల వలనను విజిగీష్వ మండలంబుఁ గావ్యంబువలన నయ్యెడు నుభయార్యుభయ మిత్ర

భేదంబులవలనను నన్నియుఁ బ్రత్యేకంబుగాఁ గూడికొని మున్నూట యిరువది నాలుగు మండలంబుల విస్తారంబు గలిగిన మండల భేదంబులు బహుప్రకారంబులుగా బహుమతంబులవారలు వినుచుండు రయినను సకలమతసమ్మతంబును సకల లోకప్రసిద్ధంబును సకలలోక విఖ్యాతంబునైన యది యీ ద్వాదశ రాజమండలంబేయగు నదియెట్లనిన. 12

## ద్వాదశరాజ మండలము

సీ॥ అరియును మిత్రుండు నరిమిత్రుఁ డవ్వల
నహిత మిత్రామిత్రుఁ డహితమిత్ర
మిత్రుండు ననఁగ భూమీపతులైదుగు
రల విజిగీషువు నగ్రమునను
వెనుకఁ బార్ష్ణిగ్రాహుఁ డనియెడు నాతండు
నాక్రందుఁ డనురాజు నవలి వంక
యందుఁ బార్ష్ణిగ్రాహకాసారుఁ డాక్రంద
కాసారుఁడన నల్వు రవనినాథు

గీ॥ లరిజిగీషులభూములయందనుండు
మధ్యముఁడు వారిచెంతను మనుపఁ గట్టి
కడనుదాసీనుఁ డన్నిట ఘనుఁడు దీనిఁ
దెలియద్వాదశ రాజమండల మటండ్రు ॥ 13

గీ॥ మఱియు మిత్రుఁ డుదాసీన మనుజపతియు
నరియునన నింతమాత్రనే యగుచు నుండు
మండలము పతి కీరితి మండలంబు
సొరిది గెలుచుటె మండలశుద్ధియండ్రు ॥ 14

శ్లో॥ అష్టశాఖం చతుర్మూలం షష్టిపత్రం ద్వయేస్థితం ।
షట్పుష్పం త్రిఫలంవృక్షం యోజానాతి స నీతివిత్ ॥

గీ॥ ఆకు లర్వదియును విరు లాఱు కొమ్మ
లెనిమిదియు మూఁడుదలములు నునికి రెంటి
యందు వేరులు నాలుగు నమరు మ్రాను
నెఱుఁగు వాఁడిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 15

వ॥ ఇందలి యభిప్రాయము 16

సీ॥ అరివిజిగీషువు లిరువుర కగు మిత్రు
లెనమంత్రు లను శాఖ లెనిమిదియును
మధ్యమోదాసీన మానవేంద్రులు నరి
విజిగీషువును నన వేళ్ళు నాల్గు
మహిని ద్వాదశరాజ మండలమున కెన్న
నై దేశి ప్రకృతుల నమరఁ గూడ
రమణ నర్వది మండలము లగు నదియును
షష్టిపత్రంబులు షడ్గుణములు

గీ॥ ననెడి విరులు నయానయ యత్నయుగళి
నెపుడు నునికి క్షయస్థానవృద్ధులనఁగ
నలరు త్రిఫలంబులును గలయట్టి మ్రాను
నెఱుఁగు వాఁడిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 17

వ॥ ఇందుకు మఱియొక పద్యము.

సీ॥ గసులును గృషులాదిగాఁ గలయష్టవ
ర్గంబునట్టి శాఖలును గల్గి
సామంబు మొదలైన చతురుపాయము లనఁ
బొలుపొందునట్టి వేరులును గల్గి

యుల విజిగీషుమండలముఁ గైదేసి
ప్రకృతులతో నెనుబదియు నవియు
రెండు సర్వవి మండలము లగు నవియును
షష్టి పత్రమ్ములు షడ్గుణములు

గీ॥ ననెడి విదుల నయానయ యత్నయుగళి
నెపుడు నునికె క్షయస్థానవృద్ధు లనఁగ
నలరు త్రిఫలంబులను గల యట్టి క్రమము
నెఱుఁగువాఁ డిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 18

వ॥ కావున నందు నీ చెప్పిన ద్వాదశరాజమండలంబుల యుష్ట
ప్రమంబుఁ గ్రమంబున వివరించెద. 19

## మండలచరిత ప్రకరణము

సీ॥ అలవిజిగీషువై నట్టి రాజునకును
వెనుకఁ బార్ష్ణిగ్రాహుఁ డనెడి రాజు
నవలఁ బార్ష్ణిగ్రాహకాసారుఁడను రాజు
శత్రువు లగుదు రీజగతిలోన
నాక్రందుఁడను రాజు నాక్రందకాసారుఁ
డను రాజు మిత్రులై యొనరుచుండ్రు
కావున నచ్చోటఁ గలిగిన మిత్రభూ
వరులచే శత్రుభూవరుల కెపుడు

గీ॥ గదలఁగా రాక యుండఁ బో రౌదవఁ జేసి
తనకు ముందరఁ గల్గు శాత్రవుల మీఁద
దండు గదలంగవలయు నుద్దండలీల
వినుతి కెక్కుచు జయముఁ జేకొనెడికొఱకు ॥ 20

సీ॥ అటులనే విజిగీషువై నట్టి భూపతి
రసికుఁడై నీతిమార్గంబు మెఱసి
తన శత్రుమీఁదటఁ దన మిత్రభూపతి
దన శత్రుమిత్రుపైఁ దనదుమిత్ర
మిత్రుఁడై నట్టి భూమీపతిఁ గవియింప
నను వారి కందఱ కవలనుండఁ
దనయరిమిత్రమిత్రుని గదలకయుండ
నటఁగృతకృత్యుఁడై యధికుఁడైన

గీ॥ యుభయమిత్రుల రేఁచి పోరాదవఁ జేసి
తనకుఁ బిమ్మటఁగల్గు శాత్రవులమీఁద
దండు గదలంగ వలయు నుద్దండలీల
వినుతి కెక్కుచు జయముఁ జేకొనెడి కొఱకు ॥ 21

వ॥ మఱియు నిట్టి విజిగీషువగు రాజు దనమిత్రులుం దాను నిట్లి రిద్దరుఁ గూడి యెడనెడనయుండెడి తన శత్రువుల నిరుదిక్కులను జిక్కించక యుక్కడంచి జయించి యుండు తెఱంగు వివరించెద. 22

సీ॥ తానును నాక్రందధారుణీపతియుఁ బా
ర్ష్ణిగ్రాహు నొవ్వఁగాఁ జేయవలయు
నాక్రందు నాక్రందనాసారు ననికంపి
పార్ష్ణిగ్రహాసారుఁ బఱపవలయుఁ
దనమిత్రుండును దానుఁ గూడుక తన
యరిరాజుఁ బెకలించి చెఱుపవలయుఁ
దనమిత్రుచేతను దనమిత్రమిత్రుచేఁ
దనయరిమిత్రునిఁ దఱుమవలయు

ఆ॥వె॥ ఉభయమిత్రుఁడేక భాగ మిత్రమిత్రుఁడే
శత్రుమిత్రమిత్రుఁ డమిలిమిలయు
నిట్టి సహితవరుల నెఱుఁగఁడ గమయము
గెలుపవలయు నల జిగీషువునకు ॥ 23

కం॥ ఈరీతి రెండుగతులన్
నేర్పుతో గెలుపఁగోరు నృపతి గదియున్
వైరుల మెత్తురు, లేదా
వారి వసుంగొలిచి నిలిచి వర్తింతు రిలన్ ॥ 24

చం॥ చనకుఁడు వైరిన్ సమతఁదాల్చిన మిత్రుపుపంకవారి నే
యనువుననైనఁ గూర్చుకొని యండజనిం దనవారిఁజేసికోఁ
జను నటులైన చుట్టములె చాల సలంచినయట్టిశత్రునిన్
జనపతి దా జయించుటకుఁ జాలఁగ శక్తుఁడగున్ సుఖస్థితిన్ ॥

ఆ॥వె॥ కారణములచేతఁ గాదె లోకము శత్రు
లగుట మిక్కి మిత్రు లగుట మిక్కి
నటులు గాన శత్రు లయ్యెడికారణం
బులను విడువవలయుఁ బుడమిఱేఁడు ॥ 26

కం॥ దొర తాఁ బ్రధాన మగుచున్
ధరఁగలిగిన ప్రజలనెల్లఁ దనవారలుగా
బరిగింపందగు నటువలెఁ
బరగిన సప్తాంగరాజ్యవటపిం జెందున్ ॥ 27

ఉ॥ సారమునందె యుండి పరదుర్గనివాసుల నందఱేశులన్
గూరిమిఁ జూపి మిత్రులుగఁ గూర్చుకొనందగు నట్లొనర్చినన్
వారలు ప్రాణబంధువులు వశ్యులునై వినయంబు పెంపునన్
దారె యొనర్పుచుండుదురు తక్కిన మండలముల్ వశంబుగన్ ॥

సీ॥ ఎటుబలుఁడైన మధ్యముఁడు పైఁదిగ నెండౌన గూడి వచ్చినన్
పటిలత మాని తాను నరికూటువఁ గూడుమనుండు టొప్పుఁ దా
నెటువలె శక్తుఁడై నిలుచునంతటి పూనిక నూనకుండుచోఁ
దటుకున సంధిసేయఁదగు దానవిధాన నిదానలీలలన్ ॥ 29

గీ॥ అధికుఁడైన యుదాసీనుఁ డడరినపుడు
సకలమండలనాదులు నొకటి యగుచు
సంఘధర్మంబుమై నుండఁ జనునపుడును
బలిమిచేకున్న శరణొంది బ్రతుకవలయు ॥ 30

## సంఘధర్మ స్వరూపము

కం॥ ఘనముగ నాపద లొదవిన
జనపతు లందఱును గూడి స్వార్థముకొఱకై
యొనఁగూడి యవి యడంచుట
యనుపమగతి సంఘధర్మ మనఁగాఁ బరగున్ ॥ 31

## శత్రుమండలమును గుఱించిన వైశేషికవర్తనప్రకారము

కం॥ సహజుఁడు కార్యజుఁడనగా
సహి నిరువురె శత్రులరయ మానవపతికిన్
సహజుఁడు దాయాదుండౌ
సహితుఁడు కార్యజుఁడు వాని యన్యుండెంచున్ ॥ 32

గీ॥ అరియెడఁ జరింపవలసిన యట్టి నడక
లయ్యె నాలుగు నుచ్ఛేద మపచయంబు
గాలమునఁ జేయు పీడన కర్శనంబు
లనుచు నయవిద్య తెలుఁగువారండ్రు ధరను ॥ 33

వ॥ అదియె ట్లనిన. 34

సీ॥ ప్రకృతుల నచ్చోటఁ బరిమార్చుట వ్యసనం
బదియుఁ దా మృత్యువ యనఁగఁ బరఁగు
బలిమి భండారంబు గలిమి రిక్తఁగఁ జేయు
టదియుఁ దా నపచయం బనఁగఁ బరఁగు
సరసి మహామాత్యసంహార మొనరింప
నది కర్శనంబని యనఁగఁ బరఁగు
దుర్గరాష్ట్రాదులఁ దొడరి ఖండించుట
యది పీడనం బని యనఁగఁ బరఁగు

గీ॥ నిట్టి నాలుగు తెఱఁగుల నెఱిఁగి యరుల
యందుఁ గావింప నేర్చిన యట్టి ఘనుఁడు
సకల ధాత్రీతలంబును బ్రకట లీల
నేలు వైరుల నెల్ల జయించి మించు ॥ [illegible]

గీ॥ ఆశ్రయవిహీనుఁడై యుండి యడరెనేని
హీనబలుఁ డగుపతి నాశ్రయించెనేని
పొందుఁ బలువురితో వైర మందెనేని
యపుడు భూపతి గడి శత్రు నడపవలయు ॥ [illegible]

ఉ॥ ఎంద సమాశ్రయం బనుచు నెంతురు దుర్గము మిత్రు లిలలోఁ
జెంది మహాభిమానమును జెందిన శత్రుని వేళయంచె పే
బొందగఁ జేయఁగావలయు నాతనిఁ గొల్చు నమాత్యుఁ జంపియుం
గ్రందన రాష్ట్ర దుర్గముల రాయిడి వేఁ గడుఁ బీడ సేసియున్ ॥

కం॥ తనమర్మము తన ఛిద్రము
తన విక్రమ మెఱిఁగి చెఱుచుఁ దనవాఁడగుచున్
తనరిన శత్రువు లోపల
మనికొందిన యగ్ని యడ్డు మ్రాక్రుంబోలెన్ ॥ [illegible]

ఉ॥ మాటికి సర్వతంత్రముల మర్మముఁ దెల్పెడువాఁడు గల్గ నె
వ్వాఁడును శాత్రవుండు సుమిఁ జొప్పడుఁ దొల్లి రఘూద్వహుండు నా
మేటి విభీషణుండు నలమిత్రసుతుండును గల్గఁ బట్టి యె
వ్వాటును లేక రావణునిఁ బట్టి వధింపఁడె వాలిఁ ద్రుంపఁడే॥ 39

సీ॥ బలవంతుతోడుతఁ గలహింపుచును దన
యరి ప్రయాసంబున నంది నప్పు
డతనిభండారంబు నతనిబలంబులఁ
జెఱుపఁగాఁ దనుఁ దనుఁ జెఱుచుకొంచు
నొకశాత్రవునిఁ బట్టి పెకలించివైవ వై
నొక బలవద్వైరి యొదవెనేని
మునుపటి పగఱనే తనవానిఁగాఁ జేసి
వాని నేర్పుతోఁ గూడికొనఁగవలయు

గీ॥ కులమువారల తోడుతఁ గూడి బలియు
డండఁ గొని యుండువైరి నాతని కులంబు
వాని నొకశత్రుఁ గల్పించి వాని మిగులఁ
వెంపు సేయుచు విభుఁ డరి నొంపవలయు॥ 40

సీ॥ విసముచేతనె యెందు విసము నాశము నొందు
వజ్రంబుచేఁ దెగు వజ్ర మెపుడు
మీలు మీలనుబట్టి మ్రింగుచు నుండును
గరియును గరిచేతఁ గట్టువడును
దాయాదియును దన దాయాదిచేఁ జెడు
నటుగాన రావణు నడచు నప్పు
డల విభీషణుఁ బూజ నందించి పట్టె శ్రీ
రామచంద్రుండు గౌరవము జయము

గీ॥ ఇట్టి నయరీతి నెంతయు నెఱిఁగి నృపతి
వైరిఁ జెఱిపెడికొఱకునై వైరికులజుఁ
డైనవానినె పట్టి తా నాప్తుఁ జేసి
కొనుచు మెలఁపున జయముఁ గైకొనఁగవలయు ॥ 41

కం॥ ఏకార్యముఁ జేయంగాఁ
జేకొనఁ దన మండలంబె చెడుపా టగుఁ దా
నాకార్య ముడుగవలయున్
గైకొన్న ధరాతలంబుఁ గడు రంజిల్లన్ ॥ 42

కం॥ దానమున సామమున స
న్మానమున న్మెలఁగఁ జేయఁదగుఁ దనవారిం
బూనుకొని భేదదండవి
ధానమ్ములచేతఁ బరులఁ దండింపఁ దగున్ ॥ 43

వ॥ ఇది శత్రుమండలవర్తనప్రకారం బింక మిత్రమండలవర్తన
ప్రకారంబు వివరించెద 44

## మిత్రమండల వర్తన ప్రకారము

కం॥ క్రమమున హితాహితుల లో
పము నిండుచునుండు సములు గలరే యిది వి
స్మయమే 'సర్వస్స్వార్థం
సమీహతే' యనఁగఁ బరగు శాస్త్రముకల్మిన్ ॥ 45

గీ॥ భోగమందు వికారంబుఁ బొందెనేని
యెంచి పట్టంబునైన నొప్పించవలయు
మిగులఁగ వికార మొందినఁ దెగి వధింప
వలయు నిలఁ బాపకర్ముండు వైరి గాన ॥ 46

కం॥ మిగుల నుపకారియైనను
బగవానిఁ మిత్రుఁగాఁగఁ బాటింపఁ దగుఁ
మిగుల నపకారియైనను
దగుఁ జుట్టమునైన విడువఁ దగు జనపతికిఁ ॥ 47

కం॥ తనయెడఁ దనశత్రునియెడ
ననిశంబును బక్షపాతియై మెలఁగెడు మి
త్రునిఁ గూల్చవలయు నింద్రుఁడు
కినుకఁ మును విశ్వరూపుఁ గెడపిన మాడ్కిఁ ॥ 48

గీ॥ అహితునకు హిత మొనరించునట్టి మిత్రు
నైన విడువంగఁ దగుఁ దన యహితుమాడ్కి
హితుల పట్టున నెవ్వాఁడు హితము సేయు
వాఁడెపో మంచిమిత్రుఁ డివ్వసుధలోన ॥ 49

కం॥ అనురక్తుండు విరక్తుఁడు
ననపల దుపకారకారి యగుమిత్రునిఁ దా
ననువుగఁ దెలియుచు దోషం
బునఁ జెందినమిత్రు విడువ భూపతి చనుఁ ॥ 50

కం॥ కడుదోసఁ గొందని మిత్రుని
విడిచినచో నర్థధర్మవితతియు నడఁగుఁ
బుడమిం గావునఁ బతి యె
ప్పుడు సద్గుణములను దోషములఁ దెలియఁ దగుఁ ॥ 51

కం॥ తానె నిజంబుగ నేరమిఁ
గానక మఱియాజ్ఞసేయఁగాఁ దగ దేరం
దానే నేరమిఁ దెలిసిన
చో నుచితపు టాజ్ఞచేతఁ జొప్పడుఁ బతికిఁ ॥ 52

క॥ నేరము లేవియుఁ బొరయని
వారిని దండించునట్టివసుధావిభుఁడు
గ్రూర మగుపాముఁ జూచిన
తెఱఁగునఁ బ్రజలెల్లఁ జూచి తిట్టుదు రెపుడున్ ॥ 53

క॥ తగ నధికమధ్యమాధమ
జగమిత్రులతారతమ్య మరయుఁగ నలయున్
నగ నధికమధ్యమాధమ
జగువారలపనియుఁ దెలియనగు నధిపతికిన్ ॥ 54

గీ॥ తెలియ కెవ్వరినైన నిందింపరాదు
లేనినిందలు గట్టెడువానిపలుకు
నగిలి వినరాదు మిత్రభేదములు పూని
సేయువారలఁ జతి చేరనీయరాదు ॥ 55

క॥ పాటించి తెలుప నోపని
మాటయు మచ్చరపుమాట మధ్యస్థంపు
మాటయును బక్షపాతపు
మాటయుఁ బతి లెస్సఁ దెలిసి మఱి సేయఁదగున్ ॥ 56

కం॥ తనచుట్టములకుఁ బోరాం
దినవొక్కనిఁ బట్టి వాదు నెఱపక వేగం
బున వారలలో వారికిఁ
గినుకలు మాన్పంగవలయు క్షితిపతి యెందున్ ॥ 57

ఉ॥ కాలముపేర్మిఁ దా ఘనము గౌరవ మొందుచు నుండుఁ గానఁ ద
త్కాల మెఱుంగురాజు గుణకల్పన కొంత ఘటించి నీచునిన్
జాలఁగ సంస్తుతింపఁ దగు సారెకు నాతని దుర్గుణంబు లె
వ్వేళను గప్పి పెట్టుచు వివేకవిలోకనచాతురీగతిన్ ॥ 58

కం॥ తనవారినిఁ బెఱవారిని
దనవారినె చేసికొనఁగఁ దగు జనపతి యెం
దును దా బహుమిత్రుం డై
చను వైరులు సెప్పినట్లు నడతురు పుడమిన్ ॥ 59

కం॥ తన కాపద యగువేళను
దనమిత్రుం డైన శరణిఁ దన బంధువులుం
దనతండ్రియుఁ దన యన్నలు
దనతమ్ములు హితముఁ జేయఁ దా రోపుదురే ॥ 60

కం॥ క్షితిలోపల నతులదృఢ
వ్రతులై తగుతనదుమిత్రవర్గముచేతన్
బ్రతివీరు లైనవారలఁ
జతురతమై నిగ్రహింప జనపతి కొనరున్ ॥ 61

శా॥ ఇల నీరీతుల నీతిమార్గమునఁ దా నేప్రొద్దువర్తించి ని
శ్చలితోద్యోగమునన్ జయేచ్ఛ గలరాజన్యుండు పెంపొందు పం
చలశుద్ధిం దగి శుద్ధమండలమునన్ వర్తించు నాచారదో
జ్జ్వలచంద్రుం డన భూప్రజావితతికిన్ సంతోషముం జేయుచున్ ॥

వ॥ ఇది మండలశోధన ప్రకారంబు. ఇంక సంధ్యాది షడ్గుణంబుల
స్వరూపంబుఁ గ్రమంబున వివరించెద. 63

## సంధివికల్పప్రకరణము

కం॥ బలియుఁ డగువైరి గదిమ్మిన
బలువగునాపదలఁ జెందు సంధి ప్రతి సేయఁగ వే
ప్పలు లేనిరాజు కాలం
బలవడఁ గడపుచును సంధి యమర్పింపఁ దగున్ ॥ 64

వ॥ అదియు గొన్నిమతంబులవారు కపాలసంధి, యుపహారసంధి, సంతానసంధి, సంగతసంధి, యుపన్యాససంధి, ప్రతీకారసంధి, సంయోగసంధి, పురుషాంతరసంధి, యదృష్టనరసంధి, యాదిష్ట సంధి, యాత్మామిషసంధి, యుపగ్రహసంధి, పరిక్రియసంధి, యుచ్ఛిన్నసంధి, పరదూషణసంధి, స్కంధోపనేయసంధి, యనం బదునారు విధంబులుగాఁ జెప్పుదురు. ఇవి కొన్నిమతంబుల వారు పరస్పరోపకారసంధియు, మైత్రసంధియు, సంబంధ సంధియు నుపహార సంధియు నను నాల్గు తెఱంగులే యని పల్కుచుందు రైనను నిందులో నుపహారసంధి యొక్కటియు నీ కామందక మతంబునకు సమ్మతంబు. అది యెట్లనిన నెందును దనమీఁద దండెత్తివచ్చిన బలవంతుం డగుశాత్రవుం డెందైన నొకటిఁ గానుకఁ గొనక మగుడి చనండు కావున మైత్రిచేసైన సంధి యొక్కటి ఎక్క వక్కిన సంధు లన్నియు నియ్యుపహారసంధిలోని భేదంబులే యగు నైన నీపదియారు సంధుల స్వరూపంబుఁ గ్రమంబున వివరించెద. 65

సీ॥ సమసంధియ కపాలసంధియై పొలుపొందు
నుపహార మీఁగిచే నొనరుచుండు
సంతానసంధి నాఁ జనుఁ గూఁతు నిచ్చినఁ
గడుమైత్రి నెనయ సంగతపుసంధి
కలకాల మది యొక్కగతిఁ బ్రవర్తింపుచు
సమకార్యములు గల్గి చాల మించి
యాపదలందును నధికసంపదలందు
భేదంబు చెందక పెంపుఁ జెంది

గీ॥ యలమనుష్యముఖాంతర మందునై సఁ
గట్టి కొట్టుచుఁ గాఁకలం బెట్టునెడల
నది సువర్ణంబులీలచేఁ జెదర కుండుఁ
గనుక కాంచనసంధి నా వినుతిఁ గాంచు ॥ ౬౬

సీ॥ మంచికార్యము నిద్దఱెంచి సేయుటకునై
యడరుట యది యుపన్యాససంధి
యితనికి నుపకార మే నొనర్చితి మున్ను
నతఁడు నా కుపకార మటులఁ జేయు
నుపకార మిపుడు నే నొనరించుచున్నాఁడ
నిఁకమీఁద నా కుపకృతి యొనర్పఁ
గలఁ డీతడని రాముఁ డెలమి సుగ్రీవున
కొనరించినట్లుగా నొప్పు నిదియు

గీ॥ ననెడు నదియును బ్రతికార మనెడిసంధి
యిరువు రొకయాత్రఁ గూర్చి తా రింపుమీఱ
సంధి సేయుట సంయోగసంధి యనఁగఁ
బరగు నీరీతు లెఱుఁగ భూపతికిఁ దగును ॥ ౬౭

సీ॥ మనయిరువుర యోధలును గూడి మాకార్య
మిది యొనగూర్చిన నింత ధనము
మీ కిత్తుమని తాను మేకొన్నసంధి తా
నది పురుషాంతర మనెడుసంధి
మాకార్య మిది మీర చేకూర్చినను మీకు
నిట్టివస్తువులు మే మిత్తు మనిన
నది యదృష్టపురుషమనఁ దనరెడు సంధి
దేశాంశ మియ్య నాదిష్టసంధి

గీ॥ తనదు సైన్యంబుచేతనే తగ నొసర్చు
సంధి యాత్మామిషం బనుసంధి యండ్రు
ప్రాణరక్షణమునకు సర్వంబు నొసఁగి
వలసియుండుట యెది యుపగ్రహ మటండ్రు ॥ ౬౮

సీ॥ భండారమం దొకపా లిచ్చి యైన నం
దిచ్చదాఁకినసొమ్ము లిచ్చియైనఁ
దనదుభండార మంతయు నిచ్చియైనను
సంధించి ప్రకృతిరక్షణ మొనర్పు
నది పరిక్రియసంధి యనఁ జెలువొందును
దనభూమిమే లెంచి తనపగఱకు
నొనగూడి యిచ్చిన నుచ్ఛిన్నసంధి యౌఁ
దద్భూమి ఫల మింత దన మటంచు

గీ॥ నమర నిచ్చిన ఫలదూషణాఖ్యసంధి
ఫలమె విభజించి కందాయముల నొసంగ
నిర్ణయించుట స్కంధోపనేయసంధి
యిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 69

సీ॥ బాలుండు వృద్ధుండు బహుదీర్ఘరోగుండు
నిజబంధుదాయాదనిందితుండు
పిఱికి యైనయతండు పిఱికిబంటై యుండు
పిఱికిబంట్ల యతండు పిసిడివాఁడు
విరసరాజ్యాంగుఁడు విషయసక్తుండసు
బహుచిత్తమంత్రుండు బహువిరోధి
కరువులు వ్యసనముల్ గలిగినయతఁడును
వ్యసనముల్ గలుగుసైన్యములవాఁడు

తే॥ దైవహతుఁడు సత్య ధర్మహీనుఁడు బాల్య
విడిచినతఁడు సురల ద్విజుల నెపుడు
గడవ నాడువాఁ డకాలయోధియు దైవ
చింతకుండు సంధి సేయఁ దగరు ॥ 70

వ॥ అది యెట్లనిన నిట్టియిరువది తెఱంగులవారును సంధానార్హులు
గారుండుటకుం గారణంబులు గలవు వివరించెద. 71

సీ॥ బాలుండెదురుగాఁగఁ జాలనికతమున
నని సేయఁగాఁ బూన రతనిబంట్లు
తానును నని సేయ రేనివానికి సుప
కారార్థ మెవ్వండు పోరొనర్చు
ముసలివాఁడును రోగములు గల్గువాఁడు ను
త్సాహశక్తులులేమి తమజనంబు
చేతనే భంగంబుఁ జెందుదు రెందును
విరసుఁడై జ్ఞాతుల విడచినయతఁ

గీ॥ డరికిఁ గైవసమై యుండు నట్టిజ్ఞాతి
జనులచేతనె మున్నుగాఁ జంపఁబడును.
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవారు
లిట్టివారలతో సంధి నెనయరాదు ॥ 72

సీ॥ కోఁచవాఁ డని సేయఁ గొఱఁగానికతమునఁ
దనుఁ దానె వెఱచి నాశనముఁ జెందు
నడుఁగోఁచబంటులఁ గలభీరుఁడైన నా
బంట్లుచే నాజి విప్పాటుఁ బొరయు

నరిచేత లంచంబు లంది పిచ్చతనంపు
బంటులు పతిఁ గీడుపఱతు రెపుడు
క్రోధి జీతము లీయ లొంగెడుకతమున
బంటులు మొగియరు బవరమునకు

గీ॥ ఎరిగిరాజ్యాంగుఁ దరులతోఁ బురమొనర్చ
విసివి రాజ్యాంగములు వాని విడిచి పెట్టు
విషయసక్తుని గడు సుఖవృత్తి గెలువ
వచ్చుఁ గావున వీరితో వలదు సంధి ॥ ౭౩

సీ॥ బహువిచారంబులు బహుచిత్తములు గల్గి
పతిమంత్రులకు నెల్లఁ బగతుఁ డగుచు
చలచిత్త మందుటవలనఁ గార్యంబుల
యెడ వారిచేతనే విడువఁ బడును
పెక్కుదేగలయందుఁ జిక్కుపాపుర మన
బహువైరి యగువాఁడు పదరి చెదరి
యెట్టిత్రోవలఁ బోవు నట్టిత్రోవలయందె
శ్రుక్కి శాత్రవులచేఁ జిక్కువడును

గీ॥ కఱువు వ్యసనంబులును జెంది కలఁగువాఁడు
కోలుకోలేక తనుఁ దానె కూలుచుండుఁ
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లిట్టివారలతో సంధి నెనయరాదు ॥ 74

సీ॥ వ్యసనముల్ గలిగినయట్టిబలంబులు
గలవాఁడు పోటు కెక్కంగ లేఁడు
దైవోపహతకుఁడు తనుఁ దానె చెడుచుండు
సత్యంబు ధర్మంబు నడలినయతఁ

పసువుగా సంధి జైకొనినమీఁదట నైనఁ
బెదరునుఁ దా మల్లడి కలంగఁ
బలము చెప్పినయట్టి దంతావళము నీటఁ
గొంచెపుమొసలిచే గుదిసినట్లు
గీ॥ బలువు చెప్పినయాతండు సలఁగి శత్రు
శాత్రవునిచేతనైనను పడయుచుండుఁ
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లట్టివారలతో సంధి నెనయరాదు ॥ 75

సీ॥ దేవుళ్ళఁ బాపలఁ దిట్టునాతఁడు ధర్మ
హీనుండు గావున నీల్గుచుండుఁ
గెలుఁగొనలేక చీఁకటిలోనఁ గాకంబు
ఘూకంబుచేతను గూలినట్లు
కాల మెఱుంగక కలహించునాతండు
గాలజ్ఞయోధచేఁ గూలుచుండు
నాపదలకు మఱి యధికసంపదలకు
దైవంబె కద నిమిత్తం బటంచు
గీ॥ దైవచింతకుం డన్ని యత్నములు మాని
యూరకుండియు చెడుచుండు నుర్విలోనఁ
గాన వీరలతో సంధి గాదు తలఁప
నిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 76

సంధి కర్హు లగువారు

గీ॥ ఆర్యుఁడును ధార్మికుండు ననార్యుఁ డధిక
బలుఁడు దాయాదవర్గంబు గలుగునతఁడు
సత్యవంతుండు బహుజయశాలి సంధి
కర్హులని పల్కుచుండ్రు నయజ్ఞు లెందు ॥ 77

వ॥ అని యెట్లనిన, నిట్లు సంధానార్హులైన యేడుగురి తెఱఁగును
క్రమంబున వివరించెద. 78

సీ॥ ఆర్యుఁడై తగువాఁడు ప్రాణబాధలయందుఁ
దనమంచితనమె విడక యుండు
ధార్మికుండెందును దనధర్మము విడఁడు
గడుఁ బ్రజానురాగంబు గలుగఁ దనకు
నతఁ డెవరించిన నతనికై యుండును
నని యొకస్తుతు కాన నతఁ డసాధ్యుఁ
డగు ననార్యుండైన యతఁడు గూడకయున్న
నతఁడు శత్రులఁగూడి యడఁగఁజేయు

గీ॥ మొదలు ముట్టంగఁ బరశురామునివిధమున
నిట్టివార లసాధ్యులౌ టెఱిఁగి యందు
సంధి గావించవలయు నీజగతిలోన
నీతిమార్గం బెఱింగిన నృపవరుండు ॥ 79

సీ॥ అధికుఁడెంతయు నప్పు నాక్రమించినచోట
నెన్నియత్నంబుల నెనసియైన
నతఁడు దా బలసింహమాక్రమించినలేఁడి
లీల నెందును దిక్కులేకయుండు
నధికుతో నేమాత్రమైనను గినిసిన
నప్పుడు మొదలంట నపుడె చెడును
బలవంతుతోడుతఁ గలహించుమని నీతి
శాస్త్రంబు బలుకు టెచ్చటను లేదు

గీ॥ మొనసి పెనుగాలి కెదురని మొగిలు కరణి
నధికుతోనల్పుఁ డెదురలేఁ డటులఁగాన

ప్రతుకవలసిన భూపతి బలయుతోఁ
సంధిసేయంగవలయు నిశ్చయముగాఁగ ॥ 80

ఆ॥వె॥ అధికుఁడెదుర నప్రముఁడై వేళయైనచో
విక్రమించునట్టివిభునిసిరులు
చెందివెలయు గట్టుచెంతఁనప్రమతఁజెంది
యవలఁ బ్రబలునదులయందు మొంది ॥ 81

సీ॥ దాయాదవర్గంబు దనకుఁగల్గినవాఁడు
కడుమూఁకఁజెందిన కారణమున
భేదింపరాకుండుఁ బెనుముండ్లు బలసిన
వెదురులపొదలోని వెదురుమాడ్కి
సత్యవంతుఁడు దన సత్యంబు నడుపుచు
సంధికృత్యంబుల జారకుండు
గెలుపువెయ్యేడఁ బెక్కుగలవాఁడు దొరకెనా
పరశురామునిఁ బ్రతాపమునఁ బోలి

గీ॥ యతనిశౌర్యంబుచేతనే యఖిలదిశల
మించుభూపతులెల్లఁగంపించియుంచు
రిట్టివార లసాధ్యులౌ పెఱిఁగి విభుఁడు
సంధిసేయంగవలయు నీజగతిలోన ॥ 82

కం పెక్కు జయంబులు గల దొర
నొక్కటిగా సంధిగూడు నుర్వీ విభునిం
దిక్కని గొల్తురు వైరులు
చక్కనగాఁ దత్ప్రతాప సంతాపితులై ॥ 83

ఆ॥వె॥ సంధియయ్యెననుచు సత్యవంతులనైన
నమ్మియుండఁ జనదునరవరునకుఁ

జేయరానిబాసచేసియు నింద్రుండు
వృత్రుఁజంపినట్టి విధమెఱింగి ॥ 84

ఆ॥వె॥ తనయుఁడైన ననుఁగు దండ్రియైనను రాజ్య
మంది యొకవిచార మొందఁ గాని
లోకజనముచర్యలోనివి గాకుండ
ధరణిపతులనడకఁ దలఁప వలయు ॥ 85

కం॥ బలవంతుఁ డెత్తివచ్చిన
నలుకక దుర్గమున నిల్చి యంతటికంటెన్
బలవంతుఁ దెచ్చి తఱుముఁగ
వలయుఁ బటాపంచముగ నవారితశక్తిన్ ॥ 86

వ॥ మఱియు భరద్వాజమతంబున. 87

కం॥ తనయుత్సాహము బలిమియుఁ
గనుఁగొని యరిమీఁద నెత్తి కలహింపఁ దగున్
ఘనసింహ మెదిరి చందకరు
లను వెంటాడంగఁ జాలునాగున నెందున్ ॥ 88

కం॥ ఉరుటుగల సింహ మొక్కటి
మదగజ సంఘములఁ గెల్చుమాడ్కిఁ బగఱపైఁ
బొదలిన తనయుత్సాహము
నదుటుం గని గమకమునన సుఱుకఁగవలయున్ ॥ 89

కం॥ కడునల్పసైన్యసైనను
బడలికఁబడి యొక్కశత్రు భంజించినచోఁ
బొడవైనవప్రతాపము
కడిమినె యిల నితరశత్రుగణముం బొగడున్ ॥ 90

కం॥ సముతోడ నైనసంధియు
నమరుం గెలుపోటమియును ననిలో సందే
హముగన నిట్లనె పలుకఁడె
యమరగురుఁడు నిశ్చితార్థ మది కాదంచుఞ్ ॥ 91

చం॥ బలియఁగఁ గోరురాజు తనబల్మికి మున్నుసమానవైరితోఁ
ఝలమునఁబోరఁగాఁ జనకసంధి యె చేయుట మేలు కానిచో
నలవడఁ బచ్చికుండ మెరయంబడి రెండుగ్రవీలుకై వడిఞ్
బొలియుటె కాక గెల్పులను బొందుట లెందును జెందనేర్చునే॥

ఆ॥వె॥ సముల మనుచు బదరి సందిసేయక మీఱి
పోరి యిరువురొకట బొలియరైరె
సంపదనై నయట్టి సుందోపసుందులు
గాన సములు సంధిఁ బూన మేలు ॥ 93

ఆ॥వె॥ తనకు వ్యసనమైనతఱి హీనుఁడైనను
సంధిసేయఁడేని చాలఁగీడు
తడిసినట్టివానియొడలిపై నొకమంచు
దొట్టుబడిన వడఁకు పుట్టకున్నె ॥ 94

కం॥ హీనుఁడగు వైరి యెడలం
దా నెంచును వ్యసన మెడలుతఱి సంశయము
న్మానుచు నిర్దయుఁడై పతి
వానియవిశ్వాస మెఱిఁగి వధియింపఁదగున్॥ 95

సీ॥ అరి కడుబలవంతుఁడైన సంధియుఁ జేసి
చేరి విశ్వాసంబుఁ జెంద నడచి
తాను నమ్మిపయట్టివానికై వడి నుండి
తనయింగితాకృతుల్ గనఁగనీక

త్రిగుప్రియంబులె పల్కి తనదుశౌర్యము తన
కనువైనవేళ సేయంగ వలయు
నదియటులన్న నట్లనుసరింపుచుఁ దొల్లి
విశ్వాస మందించి వేళయెఱిఁగి

గీ॥ ఘనుఁడు దేవేంద్రుఁడుం దితి కడుపుఁజొచ్చి
కడుపులోనున్న పగఱ ద్రక్కడఁగఁ జీఱి
యల మరుద్గణకర్తయై యతిశయిల్లె
నిట్టిమార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు॥ 96

సీ॥ బలవంతుఁడగురాజు చలమునఁ బైనెత్త
నాతనియువరాజు నతనిమంత్రి
తోనైనఁ దాను సంధానంబు గావించి
వారిలో వారికిఁ బోరుఁబెట్టి
యదియును గాకున్న నతనిప్రధానున
కెంతయుఁ దా ధనమిచ్చియైన
వలయు నర్థముల లేఖల నిచ్చియైనను
బరునియత్నంబులు సెఱుపవలయు

గీ॥ నిన్నిరీతులఁగార్యంబు లెసఁగకుండఁ
జేయఁ గడునుగ్రుఁడై వైరిచెంతనుండు
వారిపైనెల్లను గడువిశ్వాస మొంది
యతఁడు సేసిన యత్నంబు లతఁడెమాను॥ 97

కం॥ అరియత్నము లుడుపఁగఁ దగు
నరిమిత్రుల సంధిచేసియైనను లేదా
యరివైద్యుల భేదింపుచు
నరిఁ జెఱుపఁగవలయు రసవిషాదులనైనన్॥

వ॥ ఇట్టి యత్నంబులు చేసినను బెట్టిదుండగునట్టిపగఱ మట్టుఁ బడక
బిట్టు గదిమినయేని వెండియు, 99

సీ॥ బహువేషభాషలఁ బరగినవారలై
యాభిచారికనిమిత్తాదు లెఱిఁగి
యాశత్రుదేశంబు నందె తాపుర ముండి
సంచరించెదఁ దనచరులచేత
నొకకొన్ని ప్రశ్నలు నొకకొన్ని శకునముల్
కడు నిదర్శనములుగాఁగఁ దెలుపఁ
జేసి శత్రుల విశ్వసింపఁ గావింపుచు
వారిచేతనె బహువ్యసనములను

గీ॥ భీకరోత్పాతములును గల్పింపఁజేసి
యిట్లు శత్రునియుత్సాహమెల్లఁ జెఱచి
వానిఁ దోఁకోలపాలయు నవార్యమహిమ
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 100

గీ॥ పుత్రమిత్రకళత్రాప్తభూమివిత్త
వాహనాదులు గదనంబువలన నొక్క
నిమిషమున వ్యర్థమగుట లో నృపతి యెఱిఁగి
మిగులఁ గలహంబులకుఁ బూని మెలఁగరాదు ॥ 101

కం॥ బలమును ధనమును జుట్టం
బులు నిజదేహంబు రాజ్యమునఁగీర్తితతుల్
దలఁకుచు సంశయడోలా
కలితముగాఁగనె వివేకి కదనమొనర్చున్ ॥ 102

సీ॥ తనసరిదొరయైనఁదనమీఁద పండెత్తి
తనతోడ సంధిగై కొనకయున్నఁ
దా నటమీఁద నాతనితోడ సంధి గా
వలసినవాఁడెయై వైర ముడిగి

కాలోచితంబైన క్రమమున సామదా
నంబులచేత భేదంబుచేత
నటు మట్టుఁబడకుండినే యామీఁదఁదా మించి
యరి కసాధ్యంబైనయపుడు నిలిచి

గీ॥ చతురగతిఁ దొడ్డ సన్నాహసహితసైన్య
పటలిచేతను జీకాకుపఱుపవలయు
నతఁడెటులఁ దప్పఁడై కూడి యెటుల విఘుఁడు
'తప్తయోస్సంధి' యనెడి శాస్త్రంబెఱింగి ॥ 103

కం॥ ఈరీతి సంధికార్యము
దారు వచింపుదురు మునులు తత్సంధి బలా
త్కారమునసైనఁ గార్యము
గౌరవలాఘవము లెఱిఁగి కావింపఁదగున్ ॥ 104

వ॥ ఇది సంధిస్వరూపంబు. ఇంక విగ్రహస్వరూపంబు వివరించెద.

విగ్రహ వికల్ప ప్రకరణము

కం॥ తమలోఁ దా రెప్పుడు కో
పముల నసూయలను దెరసి పలుమరు నపకా
రములె యొనరింమటలచే
నమరంగాఁ బొడము విగ్రహము మహిలోనన్ ॥ 106

ఆ॥వె॥ ఫలముగోరువాఁడు పగవారిచేతను
వెతలఁ జెందువాఁడు చతురుఁడగుచు
నహితుతోడ విగ్రహము సేయవలయును
బలము దేశకాలబల మెఱింగి ॥ 107

వ॥ ఇట్టి విగ్రహంబు స్థానాపహారంబువలనను రాజ్యాపహారంబు వలనను, వనితాపహారంబువలనను, గ్రామాపహారంబువలనను,

సిద్ధివిఘాతంబువలని, సమృద్ధివిఘాతంబువలనను, జ్ఞానాప హారంబువలనను, జ్ఞానశక్తివిఘాతంబువలనను, మిత్రార్థంబు వలనను, నవమానంబువలనను, నభిమానంబువలనను, బంధు నాశనంబువలనను, నేకార్థప్రీతివలనను, ధనాపహారణంబువలనను, గృతానుగ్రహభేదంబువలనను, దైవంబువలనను, ప్రకృతి క్షోభంబువలనను, దేశపీడనంబువలనను, బహుజనద్వేషంబు వలనను, గలుగుచునుండు నిందుకు శమనప్రకారంబెట్లన్నను గ్రమంబున వివరించెద. 108

సీ॥ స్థానరాజ్యములకు సతులకు మఱియు దే
శములకుఁ గా వచ్చు జగడమెల్ల
పుచ్చుకొన్నవి మళ్ళ నిచ్చుటచే నొరుల్
గైకొన్నదమయుక్తిఁ గనుటచేత
నర్థంబు ధర్మంబు నడపఁబో రాదవఁదొ
ల్తటియట్ల యిచ్చి యేర్చుటలచేత
జ్ఞానాపహారంబు జ్ఞానశక్తివిఘాత
ముల నైన జగడంబు చలము కొనక

గీ॥ పట్టునర్థంబు పదిలె చొప్పడుటచేతఁ
దనకొనర్పు నుపేక్షచేఁ దాల్మిచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁజెలంగ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 109

సీ॥ ద్రోహం బధర్మంబుతోఁ గూడుమిత్రుని
కలహంబుఁ దనయుపేక్షణముచేత
నెనసినమంచిమిత్రునికైనజగడంబుఁ
దనదిగా వహియించుకొనుటచేత

ఉపమానమునఁ గల్గు నావిగ్రహం బను
నయముతోఁ గూడుమానంబుచేత
అభిమానమునఁ బుట్టినట్టి వైరంబు సా
మంబుచేలను బ్రణామంబుచేత

గీ॥ బంధునాశంబువలనఁ జొప్పడినపోరు
సగిన యట్టి రహస్యవర్తనముచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 110

సీ॥ ఏకార్థమునకుఁగా నిరువుర కగుపోరు
తనకోర్కి వదిలి వీడ్కొనుటచేత
ధనముఁ గైకొనుటచే నొనరినజగడంబు
క్రోధంబుఁ జాలించుకొనుటచేత
ఒకరి చేయునను గ్రహము మాన నగుపోరు
మగుడి యనుగ్రహమహిమచేత
దైవికగతిచేతఁ దనకైనజగడంబు
దైవంబు గూర్చుయత్నంబుచేత

గీ॥ మండలక్షోభమున నైన మచ్చరంబు
నందుకొనఁగూడి తగునుపాయములచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 111

సీ॥ మించి దేశంబు బాధించఁగా నైనపో
రతనిదేశముఁ గూల్చునందుచేత
బహుజనంబులతోడఁ బరగినజగడంబుఁ
దగుసామదానభేదములచేత

మానుపఁగావలె మఱి యిట్లు పొడమెడి
కలహముల్ దా మాన్పఁగనఁగఁడేని
సర్వంబు నొకవేళఁ జాల నాశనమొందుఁ
గావునఁ గడు విచక్షణత మించి
గీ॥ యేయుపాయంబుచేఁ బీడ యొసఁగకుండ
నాయుపాయంబుచే విగ్రహంబు లెల్ల
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగి
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 112

వ॥ మఱియుఁ గొన్నిమతంబులవారు [illegible]ప్రాప్తి[illegible]వలనను, గ్రహంబులవలనను, వనితలవలనను, వాగ్దోషంబువలనను, నపరాధంబువలనను, బుట్టెడి వైరంబు లైదువిధంబులే యని పల్కుచుండుదురు. [illegible] భూమి[illegible] [illegible]గించుటవలనను, భూమిబాధ గలుగుటవలనను, శక్తి చెఱుచుటవలనను, గడిరాజువలననుం బొడమెడి వైరంబులు నాలుగువిధంబులే యని పలుకుచుండు. మనుమతంబువారు కులమువలనను నపరాధంబువలననుం బొడమెడి వైరంబులు రెండువిధంబులేయనియును బలుకుచుండుదు రైన నందుఁబూని రాని విగ్రహంబులు బదియాఱువిధంబులు గల వవి యెట్లనిన.

సీ॥ అల్పఫలంబైనయది నిష్ఫలంబును
ఫలము నిశ్చయలీలఁ బరగునదియు
నపుడు దోషముగల్గి యామీఁద ఫలమిచ్చు
నదియును దోషంబు లపుడులేక
యిటమీఁద ఫలయుక్తి నలరకుండెడునది
యపుడు మీఁదట దోష మందునదియుఁ
దా నెఱుంగనిశూరతను మించువానిది
పరులు ప్రేరేపఁ జొప్పడునదియును

ఆ॥ నొఱుఁ గొఱకై యయదియును దెఱవకొఱకుఁ
గాఁగవచ్చినయది దీర్ఘకాలముచెయు
నైనవిగ్రహముల నెల్ల మానవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 114

సీ॥ బ్రాహ్మణో త్తములతోఁ బరగిన నదియును
వేళ గాకుండెడివేళ నెందు
దైవబలంబుచేఁ దగువానితోడిది
కలహంబునకె నిచ్చఁ గాలు ద్రవ్వ
పెలికొండ్రు గల్గినక్షితిపతితోడిది
తత్కాలఫలయుక్తిఁ దగుచునుండి
యామీఁద నిష్ఫలమైవచ్చునదియును
తత్కాలఫలయుక్తిఁ దగులనీక

ఆ॥ యంతమీఁదట ఫలయుక్తి నమరునదియు
నవఁగఁ దగినట్టి పైపదియాఱుతెఱఁగు
నైనవిగ్రహముల నెల్ల మానవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 115

గీ॥ చేయునప్పుడు మీఁదటఁజేటులేని
విగ్రహమ్మైన యెపుడుఁగావింపవలయు
నవియ కావన్నివసులందు నటులఁగాఁగఁ
దలఁచి మెలఁగంగవలయు నిచ్చలు విభుండు ॥ 116

ఉ॥ అప్పుడు మీఁదటన్ ఫలము నందఁగఁ జేయువిశుద్ధకర్మముం
దప్పక యాచరించుజననాథుఁడు నిందలఁజెందకుండుఁ దా
నెప్పుడు నట్లుకావున మహీస్థలిలో నిహముం బరంబుఁ దాఁ
జొప్పడఁ గూర్చునట్టిపని సొంపునఁజేయఁగ నొప్పుఁ బ్రాజ్ఞుఁడై ॥

చం॥ ఒకయినుమంతయర్థమున నుండెడు లోభముచేఁ బరింపఁగాఁ
దక డిగ నాడఁగావలదు తత్పరలోకవిరుద్ధకర్మలం
బ్రకటముగాఁగ దవ్వులనె పాయుట మేలగు నట్టు లాగునన్
ప్రకరము వల్కఁగావున నృపాలుఁడు సత్క్రియఁ జేయు నేతగున్

సీ॥ బలము పోషణ మంది చెలఁగియుండెడివేళ
నసురక్తిమై ప్రజల్ దనరువేళఁ
దాను జూచినచూపు దైవ మీడేర్చుచోఁ
దనమిత్రు లతిభక్తిఁ దనరువేళ
సకలసామంతులు సంధిఁగోరెడివేళ
నాప్తమంత్రులు గలయట్టివేళ
ధనధాన్యములు చాలఁ దన కొనఁగూడుచో
నుత్సాహ మాత్మలో నుబ్బువేళఁ

తే॥ బరుల కిటువంటి వెల్లఁ జొప్పడనియట్టి
వేళ నొనరింపఁగాఁదగు విగ్రహంబు
ధనము మిత్రుండు భూమి నాఁ దగినమూఁడు
గతులఫలముల నొకటైనఁ గలుగఁ దెలిసి॥ ౧౧౯

ఉ॥ మేలు ధనంబు ధాత్రిపయి నుంచుసువస్తులకన్న నెంతయున్
మేలు దలంప మిత్రుఁ డలమిత్రునికంటెను భూమి మేలగున్
మేలగుభూమిచేతఁ గడుమేలగు సంపద గల్గు సంపదన్
జాలఁగ బంధుమిత్రుఁబును సద్గుణజాలము గల్గు నెప్పుడున్॥

కం॥ తనతో సమసంపదచే
ననువొందెడిశత్రుజనుల నప్రతిహతమై
తనరు నుపాయముచేతనె
జనపతి శిక్షింపవలయుఁ జతురుం డగుచున్॥ 121

౧౨౨. క॥ కలహంబై న నుపాయ
ముమ్మలచేతనె తాళి శాంతిఁబొందింపఁదగుఁ
గెలుపులు దలఁప ననిశ్చయ
ములు గావునఁ ద్వరితగతుల మొనయరు నృపతుల్ ॥ 122

౧౨౩. సీ॥ బలవంతుండగు శాత్రవుండు గెనుకకా బైపచ్చి బోధించినఁ
గలఁగకాబాఱక నిత్యసంపదల నాకాంక్షించుమిత్రుఁడు ద్దిన
శ్చలతకా వైతసవృత్తిచే వినతుఁడై శత్రుం బ్రసన్నాత్ముఁగా
నలరింపందగు సర్వవృత్తు లటు పాంపుం బెట్టి చేర్పొందుగకా ॥

౧౨౪. ఆ॥వె॥ పాముఱీతిఁ గ్రూరభంగిఁ జరించిన
విభుఁడు నాశ మందు వేగ జగతి
సిరులఁ జెందుచుండుఁ దిరముగాఁ బ్రబ్బళ్ళ
లీల వినయవృత్తి వాలునతఁడు ॥ 124

ఆ॥వె॥ మత్తురీతి వెఱ్ఱిమాడ్కిఁ దా నూరక
యుండివేళఁబైకి నుఱికి సింహ
మటులఁ గ్రమముచేత నందినయది జాఱ
కుండఁబట్టి విజయ మొందవలయు ॥ 125

సీ॥ తాఁబేటిలీల యెంతయును ముడుంచుచు
తనమీఁదవచ్చు బాధలకుఁదాళి
గట్టుకై వడి నిల్చి కదలక యోర్చుచు
ననువుగాకుండెడియట్టివేళ
యరిని మూపునఁబెట్టియైన మోవఁగనేర్చి
ప్రియభాషణంబులఁ బేటుపఱచి
కడుఁబ్రసన్నాత్ముఁడై పుడమివార్త లెఱింగి
యరియంతరంగంబునందు నిల్చి

ఆ॥వె॥ సమయమెఱిఁగి కృష్ణసర్పంబుగతిఁ జిఱ్ఱు
మనుచు నొడిసి యగ్నియటుల భగ్గు
రనఁగ నెగసి నీతియసుచేత ముందలఁ
బట్టి తివియవలయుఁ బరులసిరుల ॥ 126

ఉ॥ నిలుకడఁగాంచి మేలెఱుఁగునేర్పు వహించి పరాక్రమంబునన్
గులమున మించి సత్యమునఁగూడఁగ ధైర్యదయాతిదానస
త్కళల వరించి యూర్జితుఁడు గౌరవశాలియునైనరాజు ని
చ్చలు నిలశత్రురాజుల కసాధ్యుఁడగున్ మదినెంచిచూడఁగన్ ॥

చ॥ పరుసముఁబల్కి మేల్మఱచి బాసలుదప్పి భయంబుఁజెందుచున్
గరువము దుఃఖమోపమియుఁ గల్గి ప్రమాదము జాగుచందమున్
విరసముఁజెంది జూదముల వేఁటల నింతులఁ బానలీలలన్
విరతము నాచరించు నవినీతుఁడు సంపదఁజెందనేర్చునే ॥ 128

చ॥ గెలువగఁ గోరునట్టి దొర కీడుగుణంబులు గల్గుశత్రుపై
నలవుమెయిం ద్రిశక్తియుతుఁడై చనఁగాఁదగు నట్లుగాక ని
శ్చలగుణశాలియై తనరుశత్రుని మీఁదట నెత్తువాఁడు నే
ర్పులఁదనుదానె చంపుకొనఁ బూనుచునుండును నిందకర్హుఁడై ॥

చ॥ ఘనమగు రాజ్యసంపదలు గైకొను నిచ్చఁజెలంగి బుద్ధిచే
ననువగుమండలక్రియలనన్ని యెఱింగి దృఢప్రయత్నుఁడై
పనివడి విగ్రహస్థితులఁ బాగుఁజెందుచుఁ గార్యసిద్ధికై
యనిశముఁ బూనఁగావలయు నద్భుతశౌర్యసమగ్రచర్యలన్ ॥

వ॥ ఇదియు విగ్రహస్వరూపంబు ఇంక యానప్రకారంబెట్లనిన.

## యానప్రకరణము

గీ॥ అధికబలవిక్రమంబుల నలరి ప్రకృతు
లాత్మగుణముల ననురక్తి నంది కొలువ
విజయమందుట కలమహీవిభుఁడు రిపుల
పడఁచుటకు దండువెడలుట యానమండ్రు ॥ 132

వ॥ అదియును విగృహ్యయానంబును, సంధాయయానంబును, ప్రసంగయానంబును సంభూయయానంబును, నుపేక్ష యానంబు ననియైదు తెఱంగులయ్యె వానిస్వరూపంబులు గ్రమం బున వివరించెద. 135

సీ॥ బలవంతుఁడరిప్రధానుల విగ్రహించి దం
డెత్తుటయును దనహితులచేత
నరిమిత్రులను నొంచి యరిమీఁద దండెత్తు
నదియును విగ్రహయానమండ్రు
వెనుక శత్రులసంధి నొనరి యన్యుల మీఁద
నరుగుటయును దను నడ్డకట్టి
విమతులు సంధించి వేఱొక్క యరిమీఁద
నరుగుట సంధాయయాన మందు

గీ॥ రొక్కచోటికిఁ గదలి వేఱొక్కయెడకు
నల్యురీతిఁ బ్రసంగవశంబు కతనఁ
జనినయది ధాత్రియందుఁ బ్రసంగయాన
మండ్రు నయశాస్త్రవిదులై నయార్యులెందు॥ 134

సీ॥ శౌర్యశక్తులమించి చాల మూఁకలగూల్పఁ
గలిగిన సామంతగణము తోడఁ
గలసి శాత్రవులను గదుమ మద్యోగించి
కదలిపోవుట చూడ నదియుఁగాక
ఫలమిత్తునని ప్రతినలు పల్కి కొంచెపు
దొరలతోఁ గూడుక యరుగునదియుఁ
దమప్రకృతుల నొంపఁ దా రిరువురు గూడి
యిరువురు శత్రుల నే పడంప

గీ॥ ముసుపు సూర్యాంజనేయుల ననినరీతి
నరుగుటఁ దలంప సంభూయయాన మండ్రు
నిట్టి యానప్రకారంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 135

సీ॥ శత్రుపై దండె త్తి చనుచోట నహితున
కపుడు సహాయుఁడై యతనికంటె
బలవంతుఁడగురాజు పైనెత్తివచ్చిన
మునుపటిశత్రుపైఁ జనక తాను
వాని నుపేక్షించి వానిసహాయుపైఁ
జన నుపేక్షయాన మనఁగఁ బరగు
వాసవసూతి నివాతకవచులపైఁ
జని యుపేక్షయానమునను తొల్లి

గీ॥ ప్రబలులై మించినట్టి హిరణ్యపురని
వాసులను గెల్వఁగదలిన వైపు దనర
నిట్టియానప్రకారంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 136

గీ॥ అరికి వ్యసనంబు గల్గినయట్టివేళ
నరికి దైవంబు దోడుగానట్టివేళ
నదనుఁ జేకొని దండెత్త నర్హ మండ్రు
నీతిమార్గం బెఱింగిననృపవరునకు ॥ 137

ఆసన ప్రకరణము

వ॥ ఆసన ప్రకారంబు. 138

కం॥ అరియును విజిగీషుఁడరా
వరు లిరువురు బలిమికలిమి వడినొండొరులన్
దెరలింపలేక యుండుట
పర నాసన మనఁగఁ బరగుఁ దజ్జ్ఞులచేతన్ ॥ 139

వ॥ అవియును విగృహ్యాసనంబును సంధాయాసనంబును ప్రయాణా సనంబును, సంభాయయానంబును, ఉపేక్షాసనంబును నన నైదు తెఱంగులయ్యె నావిష్ఫురితాసనంబుల గ్రమంబున వివరించెద. 140

సీ॥ ఒక్కరొక్కరిసీమ నొండొరుల్ గైకొని
యెందొడ్డి యెత్తిపోకుండుటయును
గడువైరిలోన విగ్రహమందు వారును
నిష్టంబు సాధ్యంబు కానివేళ
ధాన్యాదులును మిత్రవతులును గట్టియల్
గొఱ్ఱు దొరకుండఁ గాఁచియుండి
ముట్టడిగాఁ జుట్టుముట్టుకొనుచునుండు
నట్టిదియును విగృహ్యాసనంబు

గీ॥ వైరివైనిట్లు ముట్టడి వైచి యెంచి
ప్రకృతు లన్నియుఁ బెఱఁ బాపి పగఱఁ బొదలఁ
గైవసము చేసికొనుచుండుగ కాలమెఱిఁగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు॥ 141

సీ॥ రావణాసురుఁడు పూర్వమున నివాతక
వచులతోఁ బోరాడి వారుఁ దాను
నలసి చతుర్ముఖు నంపి సంధి యొనర్చి
నట్టులు విజిగీషు నరియుఁ బోరి
యలసి సంధియొనర్చి కలసియుండుటయు సం
ధాయాసనంబనఁ దనరుచుండు
నది గాక యరిమీఁద నలవునఁ గదలి పే
ర్వాక ప్రసంగము చెంది యొరునిమీఁద

గీ॥ కడఁగి యెండెత్తిపోయి తా విడిసియుండు
నది ప్రయాణాసనం బన నమరుచుండు
నిట్టి చందంబు లెల్లఁ దా నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 142

సీ॥ అరివిజిగీషులఁ దా నాక్రమించుటకు మ
ధ్యముఁడు పై దండెత్తఁ దలచినప్పు
డరియును విజిగీషు వన్యోన్యమైత్రిచే
నొనగూడి బల్మిచే నుండు టొప్పు
నదిగాక ఘనుఁడైన యల యుదాసీనుండు
గలిసిన నరివిజిగీషులను
నెక్కునవారెల్ల నొక్కటైయున్న సం
భూయాసనం బనఁ బొలుపుమీఱు

గీ॥ నిట్టిభేదంబులెల్లను నెపుడు చిత్త
మందెఱుఁగనుండ నేర్చిన యట్టిరాజు
సదరిపుల గెల్చి సకలసంపదలఁ బొల్చి
జనులు వినుతించ మించి యిజ్జగతి నేలు ॥ 143

సీ॥ బలియుఁడై కృష్ణుండు పారిజాతముఁదెచ్చు
చోట నుపేక్షించి సురవిభుండు
నూరకయున్నట్లు పగతుఁడు బలియుఁడై
యున్నచోఁ దా నూరకుండునదియు
నొకహేతువునఁ జేసి యొకశాత్రవుఁడు పేర్చి
తను నుపేక్షించిన దానిఁగొనుచు
మును రుక్మియుండిన యనువున నుండుట
యది యుపేక్షాసన మనఁగఁ దనరు

గీ॥ ఇట్టిభేదంబు లెల్లఁ దా నెప్పుడు చిత్త
మం దెఱిఁగియుండి నేర్పెసయట్టి రాజు
మదరిపుల గెల్చి సకలసంపదలఁ బొల్చి
జనులు వినుతింప మించి యీజగతినేలు ॥ 144

## ద్వైధీభావ ప్రకరణము

వ॥ మఱియు ద్వైధీభావంబు స్వతంత్రపరతంత్రభేదంబుల రెండు
దెఱంగుల నయ్యెనందు స్వతంత్ర ద్వైధీభావం బెట్టిదనిన. 145

సీ॥ ఇరుదిక్కులకుఁ దన కెద్దఱుం ద్రుల
బలవంతులై యున్నఁ గలఁగకుండక
వారివారికిఁ జూడ వారివాఁడును బోలెఁ
దన్నుఁ దక్కొలుగా నెన్నిపల్కి
కాకాక్షివలె నిరుగడల వర్తింపుచు
సంధిఁ జేయువదాన సంధియున్న
పుసి గడుపుచు నిద్ద రెనయక యొత్తిన
యందులో బలవంతు నాశ్రయించి

గీ॥ వార లిద్దఱు వదలిన వారియరులఁ
దాన బలవంతు నొక్కనిఁ బూని కొలిచి
నడపఁగా నేర్చి కాలంబు గడపెనేని
యది ద్వైధీభావగుణ మని యంద్రు బుధులు ॥ 146

కం॥ సాధారణుఁడై యిరుగడ
సాధువులకు నెనసి ఘనముఁ బొరయుట యిది దా
సాధారణోఁ బరతంత్ర
ద్వైధీభావం బనంగఁ దనరుఁ దజ్ఞులచేన్ ॥ 147

## సమాశ్రయ ప్రకరణము

వ॥ మఱియు సమాశ్రయగుణంబు బలవంతుం డగు నరియైనను గాక పరశత్రువునైన నాశ్రయించుటం జేసి రెండు విధంబులై యుండుఁ దత్క్రమం బెట్లనిన. 148

సీ॥ బలవంతుచే నొంపఁబడి నిరుపాయుఁడై
ప్రతిసేయఁగా లేక బడలినపుడు
కులమును సత్వంబు బలమును గల్గిన
యార్యుని నొక్కని నాశ్రయించి
వినయంబుతో నిత్యమును పొడగని చేరి
యతనిభావం బెల్ల నాత్మ నెఱిఁగి
చెప్పినకైవడిఁ జేసి వినీతుల
గతి గుణములఁ గొల్చుకరణిఁ గొల్చి

గీ॥ యతనిదయచేతఁ బరిపూర్ణుఁడై స్వతంత్ర
వృత్తిఁ జెందుచుఁ గ్రమమున వెలయు టొప్పు
నట్టి యన్యసమాశ్రయం బెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిన నృపవరుండు ॥ 149

సీ॥ అహితులచే నొచ్చి యార్తుఁడై యాశ్రయ
హీనుఁడై తగు సంధిచేనివాఁడు
భండారమైనను బలమునైనను భూమి
యైనను భూఫలంబైన మఱియు
సకలంబునైన నిచ్చలతఁ జెందుచు నిచ్చి
యతివినయంబున నతనిఁ జేరి
తా బల్మిచెందినతఱి నైన శత్రువుఁ
దాపదఁ జెందిన యప్పుడైన

మొదలయిన కొన్నిమతంబులవారు కల్పించిన వాదింపం
బడినవాఁ డితనిని నాశ్రయింపుటంజేసి సమాశ్రయగుణంబుఁ
బ్రత్యేకంబు గావున నాసంధివిగ్రహంబులు రెండును నిట్టి సమాశ్ర
యంబునంగూడి మూఁడు గుణంబులే యని పలుకుచుండుదురు
మఱియుఁ గొన్నిమతంబులవారు సంధ్యాసనగుణంబునకంటెను
విగ్రహయానంబె కావున విగ్రహగుణంబొక్కటియె న్యాయం
బని పల్కుచుండుదురైనను వీని కన్నిటికిఁ బ్రత్యేకంబైన
యవస్థాభేదంబులు గలుగుటంజేసి యీ కామందకమతంబునకు
షాడ్గుణ్యంబె సమ్మతంబు ॥ 154

కం॥ ఈరీతిషడ్గుణంబుల
నేమఱుతోఁ దెలియునట్టి నృపవరుఁ డెలమిన్
వైరులను గెలిచి పారా
వారావృతమైనధరణీవలయం బేలున్ ॥ 155

ఉ॥ సరసవిహార సారయుతసద్గుణ సింగధీర నీతి సు
స్థిరరుచికీర్తిహార సుదతీజనమన్మథ సూర్యవంశవా
స్వైరతర సేవితార్యజనసైన్యవిరాజిత సోమవారిభృ
త్స్ఫురనిధిదాన సౌమ్యహిత సంతతశోభన సర్వసన్నుతా ॥ 156

కం॥ మండలశోధన సాధన
పాండిత్యా షడ్గుణప్రభావజ్ఞ వరా
మండల పాలనఖేలన
దండితమత్తారిభూప దానకళాపా ॥ 157

భుజంగప్రయాతము.

కరాధార దోర్దండ చాపప్రచండా
పరాభేద్యమంత్రప్రతాప స్వతంత్రా

# ఆంధ్ర కామందకము

## పంచమాశ్వాసము

కం॥ శ్రీవినుతాలోక జగ
త్పావన రఘురామ పాదపంకజయుగళీ
సేవాధురీణ శాంత
ప్రావృత కౌండ్రాజువెంకటాద్రి నరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము 2

### మంత్రవికల్ప ప్రకరణము

గీ॥ నృపతి షడ్గుణతత్త్వంబు నిశ్చయించి
గూఢ మగుచర్యఁ దగ మంత్రకుశలుఁ డగుచు
మంత్రివర్యులతోఁ గూడి మంత్రరీతు
లమర నూహింపఁదగు రహస్యంబుగాఁగ ॥ 3

కం॥ తన కాప్తుండై తగుప్రా
జ్ఞునితో మంత్రం బొనర్పఁ జొప్పడుఁ బతికిన్
దన కాప్తుండౌ మూర్ఖునిఁ
దన కాప్తుఁడుగానిప్రాజ్ఞుఁ దా విడువఁదగున్ ॥ 4

కం॥ ధర యెల్ల ననుభవించును
వరనాయకుఁడు మంత్ర మెఱిఁగినం గాకున్నన్
బరిభవ మొందు స్వతంత్రతఁ
బరగియు మంత్రంబు నెఱుఁగుప్రాజ్ఞులచేతన్ ॥ 5

కం॥ నిగమములచే ధర్మంత్రుం
దగనెఱర వెడు దుష్టమంత్ర మహాయజ్ఞము వై
వ్యగణముచే బలెఁ గావున
జగతిన్ సన్మంత్రమునఁ బొసంగఁగవలయున్ ॥ 6

మ॥ అనేకము ధర్మమార్గములయందె చరించినవారు సిద్ధులై
యొనరిసయట్టి కార్యముల నూర్జితులై తగువారు పెద్దలై
చనరినవారు నైనగుణధన్యులు చెందినశాస్త్రమార్గ మెం
చను వదలంగ రాదు నయచిద్యులకున్ నిజకార్యసిద్ధికిన్ ॥ 7

కం॥ జనపతి శాస్త్రముతో నెద
సినపర్యల వేగిరమునఁ జెంది మెలఁగినన్
దనశత్రునిచే ఖడ్గం
బునకున్ గ్రాసంబు గాకపోవం గలఁడే ॥ 8

కం॥ బలిమిఁ ద్రిశక్తులలోపల
నల మంత్రము మంత్రశక్తి ననువొందక కే
వలము ప్రభావోత్సాహ
మ్ములఁ గల్గియు శత్రుఁ డోడె మును గురువునకున్ ॥ 9

ఉ॥ నీతి యొకింతయుం దెలియచేరని సింగము బల్మిచేతఁ దా
నేతటియందు నేనుఁగుల నెల్ల వధించుచు నుండు బుద్ధియున్
నీతియుఁ గల్గినట్టిపతి నేర్పున సింగపుగుంపులం గరి
వ్రాతము నుక్కునం గెలిచి వర్ధిలకున్నె ధరాతలంబునన్ ॥ 10

గీ॥ మునుపు సామాద్యుపాయముల్ మొనపవలయు
కాల మెఱుఁగుచు వైరిపైఁ గదియవలయుఁ
గాక మఱి కేవలంబు విక్రమముఁ బూని
మెలఁగువాఁ డెందు వగఁ జెంది కలఁగకున్నె ॥ 11

చ॥ చలి మెదలించి మాళవుఁడు శక్య మశక్యమునా ననుచుఁ గడుం
దెలఁగడిబుద్ధిచే నెఱిఁగి చేసిన మే లగు నట్లు గానిచో
బలమునఁ గొండ డీకొనినయమ్మదదంతికి నంతభంగమౌ
పొలుపున హాస్యరీతులను బొందక యెంతొ శుభంబుఁ జెందునే ॥

కం॥ రాజతి యశక్యముఁ బనికై
బడలినచోఁ గీడ కాక ఫలమొందునె యె
య్యెడ పిన్న నవిఁగొనంగాఁ
గడఁగెడి పెనువెట్టికంబు కడిఁ గొనఁగలడే ॥ 13

ఆ॥వె॥ మిడుత యగ్నిలోనఁ బడునటు నారంబు
వచ్చుపనులఁ జూచి వలచి చెపుడు
తగినపనులె పూనఁదగు నగ్నిలోఁబడు
మిడుత కేమి కలుగు చెడుటకంటె ॥ 14

కం॥ ఇలలో దుర్లభమగుపని
బలియుఁడు మోహమునఁ జెంది పచరిన నందున్
గలిగినయాపద లతనిం
గలకాలముఁ దాప మొందఁగాఁ జేయుఁ బుడిన్ ॥ 15

కం॥ అనుపమమతిచే నిపులను
జనపతి దా నాక్రమింపఁ జను నేర్పున మె
ట్టనువుగ మెట్టెడునాతఁడు
ఘనమగుగిరి శిఖర మెక్కఁ గైపడి మెఱయున్ ॥ 16

ఉ॥ అందగ దుర్లభంబగుచు నందఱు ద్రొక్కలు ద్రొక్క నిక్కి పెం
పొందినయట్టిరాచఱిక మొక్కఁడ నించుక దుష్టవర్తనం
జెందినయేని నాశనముఁ జెందదె యెం దపచార మింత దాఁ
జెందినబ్రాహ్మణత్వము గృశింపుచు నిందల నొందుకైపడిన్ ॥

కం॥ విపులమతు లెంచి చూడ్కి
భ్రమయము నొందించునట్టికార్యంబులు చే
గమె మంచిఫలము లిడుఁ గా
నమరంగాఁ బ్రోదిఁగనినయల మను మనఁగన్ ॥ 18

కం॥ ఉపుపుగ నొనరించినయపు
అనిశము ఫలియింపుచుండు నది గాకున్నన్
మోసమునఁ దాప మొసఁగు
మును చెలియక సేయుకార్యములుబలెఁ బతికిన్ ॥ 19

గీ॥ చెయ్వు దొఱఁగ వెన్న యొనర్పఁ బూని
కార్య మొకరీతి ఫలియింప గానివేళ
వాఁడు నింద్యకుం డగునట్టివాఁడు గాడు
తానె దైవంబు కడుఁదోసగానికతన ॥ 20

కం॥ బలములకై నిర్మలమతి
గలవాఁ డుద్యోగశాలి గావలె నెందున్
ఫలవిఘ్న మడరకుండన్
బలపద్దైవంబు నెఱిఁగి ప్రార్థింపఁదగున్ ॥ 21

కం॥ తనబలిమి నెదిరిబలిమిం
గనుఁగొని యరిమీఁద గదలఁగాఁదగు నెమ్మిం
దను నెఱుఁగు టెద్ది యదియో
జనపతులకు నెఱుక నీతిచాతుర్యంబున్ ॥ 22

కం॥ ఆర్యులు విడుతురు నిష్ఫల
కార్యము నిశ్చితఫలంబు గలుగక యొడలో
కార్యము బహువైరముఁ గల
కార్యము కడుగ్లేశమడచుకార్యముఁ బుడమిన్ ॥ 23

కం॥ తగుకార్యములె విహితముసఁ
దగిలినయవి యెప్పుడు మీఁదఁ దా మంచివియై
తగు నవి తొలుతన్ సజ్జను
లగువారిక్రమాగతంబు లై నవి పతికిన్ ॥ 24

గీ॥ ఎట్టికార్యంబు దనకును హిత వొనర్చు
నెట్టికార్యంబుచే నింద లెనయకుండు
నట్టికార్యంబె పూని చేయంగవలయు
నప్పు డించుకకరినమై యడరెనేని ॥ 25

కం॥ సులభమునఁ గార్యసిద్ధులు
గలుగుటకై బుద్ధిచేతఁ గార్యము బూనన్
వలయుఁ బతి మంచిమిత్రులఁ
గలిగినచో సింహవృత్తి కడు మేలొకటన్ ॥ 26

చం॥ తొడిఁబడ మించి పైకుతికి దుష్టవిరోధుల వంచి సంపదన్
వడయుట లెంచ దుష్కర ముపాయబలమ్మున నేదియైనవా
ప్పడి తగుమావటీఁడు బలభద్రగజంబుశిరంబుమీఁదటన్
దొడరియు వాయుమార్గములతోడఁ బదం బిడు లెందుఁ జూడమే॥

ఆ॥వె॥ చతురమతి నుపాయసరణిచే సాధ్యంబు
గానివస్తు వించుకయును గలదె
యినుపముద్ద యైన నిలలోన నీరుగా
కఱఁపఁ బడును చెఱిపి విఱుపఁబడును ॥ 28

కం॥ జల మింగలంబు నార్చుట
యిలమీఁదటఁ గడుఁబ్రసిద్ధి యీయింగలమే
బలువగు నుపాయశక్తిని
జలచలచలఁ దెరలఁజేసి జల మిగిరించున్ ॥ 29

వ॥ మఱియు మంత్రంబునకు జ్ఞానంబును, రక్షణంబును, ప్రవ
ర్తనంబును బ్రవృత్తియు సంగంబులును వ్యాపారంబు నుత్పత్తి
క్రమంబును బరిశుద్ధియు ఫలసిద్ధియు నావర్తనంబును, ధారణం
బును, మొదలయిన యవస్థాభేదంబులు గల వందు విషయంబు
సాక్షాత్కారంబునం దెలియనియర్థంబు దెల్లంబు సేయుట యనెడి
యవిజ్ఞాతవిజ్ఞానంబును దెలిసినయర్థంబు కర్మపూర్వకంబుగా
నిర్ణయంబుఁ గావించుట యనెడి విజ్ఞాతనిశ్చయంబును సంశ
యంబు కార్యంబులు బ్రసక్తంబులైన నొకటి గావించుట యనెడి
సందేహ భేదనంబును, వెండియు సంధివిగ్రహంబులలోని వ్యక్త
మవ్యక్తంబుల సంధియ మంచిదగుటఁ దెలిసి యదియును భేద
పూర్వకంబైన తెన్నయని తెలిసికొనుట యనెడి శేషదర్శనంబును
నను నిట్టి చతుర్విధ భేదంబులుగల జ్ఞానంబు మంత్రులవలనఁ
సంభవించుంగావున. 30

సీ॥ మంత్రులుఁ దానును మతులందు నెన్నఁగాఁ
బరిశుద్ధిసేయు టుత్పత్తియండ్రు
చనఁ దు నుత్పత్తిచేఁ దనమంత్ర మది యెన్న
దెలిసి రక్షించుట స్థితియటండ్రు
చాల దానినిఁ బ్రకాశంబుగాఁ జేయుటే
మఱి లయ మని యండ్రు మంత్రమునకు
నన్నియు నెఱుఁగను నిది దేశ మిది కాల
మిది యుపాయ మిది వ్రయం బిది ఫలంబు

గీ॥ దీని కిది యుక్త మంచును దెలివితోడ
మంత్రవిదులను గూడి నెమ్మదిఁ జెలంగి
శాస్త్రమార్గంబు వదలక చతురుఁ డగుచు
మంత్ర మూహింపవలయును మనుజవిభుఁడు ॥ 31

కం॥ జనపతి వనమంత్రులయా
ప్తాని మెలఁగుట నుండి యెట్టిజనులును దాఁగా
వినక మది యన్నిపలుకులు
విశదలయును మంచిమాట వెదకెడివాఁడై ॥ 32

కం॥ ఘనమది మదించి పనియెడఁ
దనమంత్రుల మెఱుపతి పృథామంత్రుఁడు వే
దని నింద నొందు నతనిని
గనుఁగొని రిపు లాక్రమింపఁ గడఁగుదు రెపుడున్ ॥ 33

కం॥ మంత్రము రక్షింపఁగవలె
మంత్రము మూలంబు మిగుల మనుజేంద్రునకున్
మంత్రము చెడఁ దాఁ జెడుఁ బ
న్మంత్రము రక్షింప రక్షణముఁ గనుఁ దానున్ ॥ 34

కం॥ మతుమఁతయి కాల మెఱుఁగుచు
మతులితగతి సింహావృత్తి నడరెడుధరణీ
పతి కార్యము సేయుతఱిన్
హితులును నది మైన నహితు లెఱుఁగఁగవలయున్ ॥ 35

కం॥ వల మెవ్వేళ నొసంగన్
గలుగుచుఁ గడువేగఁ గోర్కె ఘటియింపంగాఁ
గలుగమఁ బశ్చాత్తాపము
గలిగింపనియట్టిమంత్రిగతి మంచిదగున్ ॥ 36

## మంత్రాంగములు

ఆ॥వె॥ దేశకాలగతులు దెలియుట, సాధనో
పాయచింతయును, సహాయవితతి,
నాపదలఁ బ్రతిక్రియయుఁ, గార్యసిద్ధియు
నైదు మంత్రమునకు నంగము లగు ॥ 37

## కార్యసిద్ధి సూచకములు

గీ॥ పౌరుషంబు సహాయసంపద మనఃప్ర
సన్నతయు దేహదార్ఢ్యంబు సమకొనుటయు
బుద్ధి విశ్వాసమును జాలఁబొడముటయును
గార్యసిద్ధికి గుఱుతులై కానుపించు ॥ 44

కం॥ సులభములగు యత్నంబులు
గలుగుట, లఘుసాధనములు గలుగుట, విఘ్నం
బులు లేకుండుట, కార్యం
బులకున్ ఫలసూచకములు భువి నివి తెలియన్ ॥ 45

కం॥ పలుమఱు మదిలోఁ దలఁపఁగ
వలయున్ మంత్రము ధరింపవలయును యత్నం
బలరఁగ నటుగాని యెడం
ఫలియింపదు సన్నిరీలఁ జాల వహించున్ ॥ 46

కం॥ వెలివడు మంత్రం బాప్తుల
వలనన్ రక్షింపకున్న వసుధాపతికిన్
దెలిసి యటుగాన నాప్తుల
వలనను మంత్రంబుఁ బ్రోవవలె యత్నమునన్ ॥ 47

ఆ॥వె॥ పలవరింతపలుకువలనఁ గామమువల్ల
మదమువలన మఱి ప్రమాదములను
గదిసి గుట్టుఁదెలియుఁ గామినీవితతుల
వలన మంత్ర మదియు వసుధలోన ॥ 48

గీ॥ కంబములు లేక తోరణగంబ్ము లేక
నడుమ గోడలు లేక పెంపడరుచోట
మేడపైఁ గానలో నైన మెలఁకు వలర
మంత్ర మూహింపవలయును మనుజవిభుఁడు ॥ 49

మంత్రిమండల వృత్తము

సీ॥ రాజవర్తి మంత్రిమండలముతో మంత్ర మూ
హింపఁగాఁ దగు నభివృద్ధికొఱకు
నది యెట్టు లన్న దేవాచార్యమతము వా
రఖిలసమ్మతిఁ బదియాఱ్వు రండ్రు
మనువు పన్నిద్ద రైనను జాలు నని పల్కె
మఱియు శుక్రాచార్య మతమువార
లిరువదియగుసంఖ్య నెంతు రీమంత్రుల
నితర మతంబువా రెటులనైనఁ

గీ॥ గణిగినందఱె చాలు మంత్రు లని యండ్రు
ఇటుల మంత్రులసంఖ్యఁ దా నెఱుఁగ నేర్చి
వారిఁ దెలియంగఁదగు వేఱు వేఱ సారె
శాస్త్రమార్గంబు వదలక జనవిభుండు ॥ 50

చం॥ హితుఁడయి మంచిపక్షమున నెన్నిక కెక్కినమ నీతిశాస్త్రసం
గతముగఁ గార్యచర్యలఁ దగం జరియించినవాఁడు నాత్మస
మ్మతుఁ డగువాఁడునైన తనమంత్రిశిఖామణి పల్కినట్టి యా
మతమె యొనర్పఁగా నగును మానవనాథున కెట్టివేళలన్ ॥ 51

కం॥ మును మంత్రనిశ్చయంబున
నెనసి నృపుల్ కార్యకాల మెఱిఁగి మెలంగన్
జనుఁ గాలము మీఱినచో
ననువుగఁ గల్పింపవలయు నది మఱుడంగన్ ॥ 52

కం॥ అదను మదిఁ గోరుచుం దగు
నద నొక్కొకవేళ దొరకునపుడు దనపనుల్
కొదవయిడికొనినఁ గ్రమ్మఱ
నది నబ్బుట దుర్లభం బటండ్రు నయజ్ఞుల్ ॥ 53

ఆ॥వె॥ శత్రు నతనిరాష్ట్రసారంబు నతని దు
ర్గంబు వర్గరక్షణంబు మిత్ర
వితతి యతనికిని యుపేక్ష భండారంబు
చెప్పఁ దెలియవలయు నెల్ల దూత ॥ 65

ఉ॥ తనవిషఁ జెట్టుపల్కు మన దా నరితోడుత నల్ల పల్కఁగాఁ
జనుఁ దనమీఁదఁ గైదువలు సాఁచిన నించుక భీతి లేక చూ
పున ముఖచేష్టవల్లఁ దలపోయుచు రాగవిరాగభావముం
గనుఁగొనఁగాఁ దగున్ మఱియుఁ గార్యమెఱుంగఁగఁ గడాని వాతురిన్

చం॥ తనకు ననిష్టవాక్యములు దాళుకొనన్ జనుఁ గామమున్ మదం
బును మఱి క్రోధము న్విడచి పోఁ దఱుమం దగు నిద్రపోవఁగాఁ
జన దొరుతోడఁ గూడుకొని చాలఁ బరేంగితముల్ గనుంగొనన్
జనుఁ దనభావ మెయ్యెడఁ బ్రచారము సేయఁగ రాదు దూతకున్॥

గీ॥ వైరులందు నమాత్యాదివర్గ మనెడి
ప్రకృతులకుఁ గల్గురాగాపరాగములకుఁ
దెలియఁ దగు మఱి భేదింపవలయు వారి
నెరపి భేదింపఁ దగు రహస్యంబుగాఁగ ॥ 68

కం॥ తనపతిగుణములఁ బ్రకృతులఁ
దను నడిగినఁ బలుకవలదు ధరణీశులతో
డను సర్వము మీ రెఱుఁగరె
యని పల్కఁగ వలయు మంచివగుపల్కులచేన్ ॥ 69

కం॥ కులమునుఁ గడుఁ బేరెన్నిక
గలుగుట ఘనమైనయట్టి కార్యపుసేతల్
బలిమి యన నాల్గుదెఱఁగుల
గల వినుతులఁ బతిని రిపుని గణుతింపఁ దగున్ ॥ 70

ఉ॥ జీతము రెండుదిక్కులను జెందెడివారలవెంట నెల్లయుం
జాతురి గల్గుశిష్యులు విహారము సేయుచునుండుతోడ వా
నేటి శత్రురాజు ఘటియించినకార్యము దెవ్వరైతి ధా
త్రీతలభర్త సేయుఁ దానరీతుల మాతముఖంగఁగాఁ బ్రభూ॥

గీ॥ తీర్థముల నాశ్రమంబుల దేవతా
యములయందుఁ బ్రహ్మవేషముల మెలఁగు
నట్టిచారులతో మాటలాడవలయు
శాస్త్రరీతుల దెలియువ్యాజంబు చేసి॥ 72

కం॥ జనవిభుఘనసత్ప్రతాపం
బును మంచితనమ్ము సత్యమును గరిమ కులం
బును దానము నుత్సాహముఁ
జెను పొందుఁగఁ బలుకవలయు భృత్యులతోడన్॥ 73

కం॥ ఇల నిదురపోతు మత్తుఁడు
గలవాఁడవమె బలుకుమంచుఁ గను మాత మొదలం
గలయక నిద్దురపోఁ దగు
వల దెప్పుడు దోసములను వసియలఁ దనలన్॥ 74

కం॥ తనకార్యసిద్ధికొఱకై
ఘనముగఁ దడవైనయపుడు గని వెతఁబడఁగాఁ
జన దెపుడు దూతవర్యుఁడు
తనకార్యము పొసఁగువిధమె తలఁపఁగ వలయున్॥ 75

వ॥ మఱియు రాయబారియగునతండు శత్రురాజు ననుసరింపుచు
నుండునెడఁ దమయేలికరాకయును నొత్తంబడిక యాలస్యంబైన
యెడఁ గ్రమంబున మంచివచనంబు లుంచి పంచనావాక్ప్ర
ప్రపంచంబులఁ గాలంబుఁ గడపుతెఱఁగెల్లను. జనవిభునకు

నొకయించుక వ్యసనంబుఁ గలిగియున్నకతనను, సైన్యంలో నొకయించుక వ్యాజ్యంబుగలుగు కతనను దమబంధువులలోనఁ గలహంబుఁ బుట్టిన నీతిపరుండు గావున నిపుడు దాడిచే కతనను ఫలకాలంబు గాన ధాన్యాదిసంగ్రహంబు సేయుచుండు కతనను దుర్గంబునకు సవరణలు సేయించుకతనను దన సైన్యంబులకు క్షేమంబుఁ గోరువాఁడై వర్షాదికాలదేశవిష యంబులవలనఁ దా రాకయున్నకతనను దాన ధనాదికంబు వట్టించుకొని వచ్చువాఁడై యున్నకతనను, వెలిగుడారంబుల వేసి పయనంబునకు సామగ్రి యొనఁగూర్చుకొనుచుండుకతనను, నాలస్యం బయ్యెనని యుచితరీతులఁ గాలంబు గడుపుచు నుండి శత్రువునకుఁ గార్యకాలంబులోనఁ గూడకయుండుటఁ దెప్పఁదెలిసి మగుడివచ్చియైనను రాకయుండియైనను శత్రువార్తలన్నియు దెప్పగాఁ దనయేలికకు నెఱిఁగించవలయు మఱియును 76

సీ॥ వగఱసామర్థ్యంబు బలమును దుర్గంబు
భండారమును మిత్రబంధుతతుల
నతఁడు పూనుచునుండు నట్టికార్యంబుల
తెఱఁగులు దెప్పగాఁ దెలియుటయును
గడలఁగావలివారి నడవులకడవారిఁ
దనవారిగాఁ జేసికొనుట మఱియుఁ
బను కనిసేయఁగాఁ దగుచోట మగుడి పో
నను వైనచోటుల నరయుటయును

గీ॥ దూత యొనరించుపను లండ్రు దూతజనుని
వలన నెఱుఁగంగ వలయును వైరిచర్యఁ
దనజనమ్ములయందును ధరణినాథుఁ
డరివరులదూతచేష్టల నరయ వలయు ॥ 77

## దూతచరవికల్ప ప్రకరణము — దూతలక్షణము

చ॥ చిలుకపస మించి క్లేశములు వాసి ప్రయాసము నోర్చి దక్షుఁడై
పెంపుమెయిఁ బోవ రాఁ గలిగి శీలముఁ జెంది పరేంగితంబు న్వా
కాలు వనలో నెఱింగి కరినాత్ముఁడు గాఁ బటు యుక్తిపెంపునన్
గలిగినవాఁడు దూత యనఁగా మతికెక్కుచునుండు నెప్పుడున్॥

వ॥ ఇది దూతలక్షణం బగు నింకఁ జారలక్షణంబు వివరించెద. 79

## చారలక్షణము

క॥ ముఱుఁగుసు జాడల నెప్పుల
నెఱుఁగఁ దగి చెరలందు మాఱువై తిరుగంగాఁ
జను వేగువారు వార్తల
నొసువుగఁ దెలియుమను బతికి నవి తెల్పుటకై ॥ 80

చ॥ ఇలఁ గల చారకార్యముల నెల్లఁ గనుంగొనఁ జాలునట్టి పు
ష్పలు పతి కెంపు నెంచఁగ వినూతనచాతురిఁ బొల్చువేగువా
రలె కద కాన వారలు ధరాతలమందుఁ జరించుచు సర్వవా
ర్తలు దెలుపం జనున్ బతిహితంబుగ వచ్చుచుఁ బోవుచుండఁగన్

చ॥ వెలఁగెడు సూక్ష్మసూత్రములచేత బలెం దనవేగువారిచే
నిలఁ గల సర్వవార్తలు మహీపతి దా నెఱుఁగంగ నొప్పు ని
ట్లలపునఁ జారచక్షుఁడయి యందము నొందినరాజు నిద్రచే
నలసినవేళ మేల్కొనినయట్టివిధంబున మించు నెంచఁగన్ ॥ 82

గీ॥ కదలుటలచేత వ్యాపించు గాలిలీలఁ
గిరణములచేత వ్యాపించు తరణికరణి
నరపతికి లోకసమ్మతులైన వేగు
వారిచేతనె వ్యాపింపవలయు జగము ॥ 83

చం॥ చనుఁగొని వేగువారనెడి చక్షువు గల్గినవాఁడు గాఁదగున్
జనపతి వారిచేతనె దిశాంతరమందుఁ జరింపుచుండఁగాఁ
జను నటు గాన పూర్వుఁ డయి చారులచే నిల సంచరించునం
డినుఁ బటు సంఘుఁడో యన వడిన్ సమమై తనునట్టి పట్టునన్॥

కం॥ వైరులకుఁ గలుగు సంపద
వైరుల వర్తనల తెఱఁగు వైరుల యవి యా
భూమిని జనముల కోరికె
సారెకుఁ బతి దెలియవలయుఁ జారులచేతన్॥ 85

వ॥ ఇట్టి చారులు ప్రకాశం బప్రకాశంబు నన రెండు తెఱంగులై యుండుదు రందుఁ బ్రకాశుండు దొరచేఁ జెప్పంబడిన దూత యనం బరంగుచుండు, నప్రకాశుండై గూఢచారి యనం బరంగు నందు, యజ్ఞంబునందు ఋత్విజుండు మంత్రంబుచేతనే మెలఁగు చందంబున నరవరుండును జారులచేతనే ధరాతలంబునం దెల్ల సంచరింప వలయు, నందుఁ దొరచేఁ జెప్పంబడినదూతచేతనే శత్రురాజుం సంధికార్యంబులు మొదలైన రహస్యప్రచారంబు లెల్లను దెలియ వలయును గూఢచారులచేతనే శత్రురాజుల బాహ్యప్రచారంబు లెల్లను దెలియ వలయు నిట్టి గూఢచారులు సంస్థులు సంచారులు నన రెండు తెఱంగులై యుండుదురు అది యెట్లనఁ గ్రమంబున వివరించెద. 86

## సంస్థగూఢచార లక్షణము

సీ॥ ఒకరివారై వేఱె యొకరివారగువారు
వానప్రస్థరూపునఁ దనరువారు
సన్న్యాసులై కడు శాంతిఁ జెందినవారు
వేదముల్ సెప్పెడి విప్రవరులు

నానావేషధారులై పరగెడివారలు
మంత్రముల్ మంత్రించు మంత్రవిదులు
మత్తకోర్లకు దున్నికొనియెడివారలు
కోమటులై యమ్మికొనెడివారు

గీ॥ సరస వైరులపురములయందు నిలిచి
విభునిచేతను ధన మొంది వేగువారు
చాలసుఖమెలమిc దమచరుల కెల్ల
నొదవు నాధారరీతుల నుండవలయు ॥ 87

గీ॥ ఇటుల శత్రుపురంబులం దెపుడు నిలిచి
యుండు సంస్థులయొద్దకు నొక్కచరుcడు
పలుదేశంబులసంగc గొందఱను దఱుచు
నలయు విభునకు నవ్వార్తc దెలుపుటకును ॥ 88

వ॥ ఇట్లు దేశవార్తలరయం దిరిగెడివారు, సంచారులు. తీక్ష్ణులు,
ప్రవ్రజితులు శస్త్రిలు, రసదులు, నన బరగుచుండుదురు.
తత్ప్రకారం బెట్లన్నను 89

సంచారిగూఢచారలక్షణము

సీ॥ అద్దcబెట్టుచు నూళ్ళయందు గ్రాసముc జెంది
తీక్ష్ణులు జోగులై తిరుగుచుంద్రు
ప్రవ్రజితులపేరc బరగెడిచరులు స
న్యాసివేషముల నంది యుంద్రు
శస్త్రవైద్యముc జేసి చరియింపుచుందు రొండె
అఖిలభూముల శస్త్రి లనెడివారు
రసవైద్యములు చేసి రసికులై తగు చుంద్రు
రసదులపేరింటc బొసcగు వారి

పసపుల్ సొమ్ములు విరు లొసంగెడివారు
కలపముల్ గూరిచి యలఁదువారు
సింగారములు సేయు సంగడికాండ్రును
నాపితీర్థమువారు సామువారు

గీ॥ నాదియగువారి శత్రులయందు నిలిపి
యింగితాదుల నితరు లెఱుంగనీక
దాను తెలియుచు రసమిడఁ జేయవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 97

చం॥ ఇసుపడ నింగితాకృతుల భాషల నన్యు లెఱుంగకుండ నే
ర్పున ముఖబంధుకట్టినలిపుల్గల కమ్మలచేత శత్రువ
ర్తనముల నొండొరుల్ గడుఁ దిరంబగురీతి నెఱింగి వేగవా
రసుద్యగఁ జెల్వుగాఁ దగు ధరాధిపవర్యున కాప్తులై తగన్ ॥

చం॥ రవికిరణంబు లెల్లెడల రాజిలి నీరముఁ బీల్చుకైవడిన్
భువిఁ గల వార్త లెల్లఁ దమబుద్ధిబలంబున సంగ్రహింపుచున్
వివరముతో రహస్యగతి వేగులవారు చరింపఁగాఁ దగున్
వివిధములైన వేషములు విద్యలు శిల్పములుం దొసంగఁగన్ ॥

కం॥ ఏరీతి నరులరాజుకై
వైరులఁ దా నాక్రమించువారు నటుల నే
వేరె యొనర్చు నుపాయము
చారగతిం దెలియవలయు ధరణీపతికిన్ ॥ 100

శా॥ లక్ష్మీసంయుతనీతివిక్రమకళాలంకార లంకారణా
సూక్ష్మప్రాభవ రామభద్రనుగుణస్తోత్రోల్లసన్మంత్ర సం
త్ర క్ష్మారక్షణదక్ష దక్షవిమతప్రఖ్యాతశౌర్యక్రియా
పక్షప్రస్తుతవార చారపరజాలజ్ఞాతవార్తోజ్జ్వలా ! ॥ 101

కం॥ శ్రీకర్ణాటాధిపప
త్రాకలితసమీరచామరాదినృపతి
ప్రాస్తకల్పవరహరాంకా,
శ్రీకరమహోహనీయమహాపడితమకరాంకా, ॥ 102

తరళము॥ వినయసుహార, ఘనయచార విదిత ధీరమంతపే
వినుతిహార కీర్తిపూర విజిత తారకాచర
వ్యసనదూర, మదిని ఘోరవైరి వీరశౌర్య దే
లన గభీర గుణవిహార లలితశూర సేవితా॥ 103

గద్యము॥ ఇది శ్రీమదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భార
ద్వాజసగోత్ర జక్కరాజు ఎల్లనామాత్యపుత్ర సుకవిజన విధే
శ్రీరామకృష్ణ భక్తివైభవ నామధేయ వెంకటనామధేయ ప్రణీతం
బైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు మంత్ర
ప్రశంసనంబును, మాతచారస్వభావంబు నున్నది పంచమాశ్వాసము

# ఆంధ్ర కౌముంద శతకము

## ప్రస్తావనము

కం॥ శ్రీదశరథ నృపనందన
పాదాబ్జస్మరణకరణపటుమానస స
మ్మోదితసజ్జనవిదితన
యాదిక కౌండ్రాజువెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

## ఉత్సాహ ప్రశంసా ప్రకరణము

ఉ॥ శ్రీరమణీయుఁడై నృపతిశేఖరుఁ డన్నిట బుద్ధిమంతుఁడై
చారులచర్యచే నెపుడు శత్రులబల్మి యెఱింగి యెంతయుఁ
గౌరవ మెంచ దూతలముఖంబునఁ గార్యము గానిపించుచున్
వైరుల భేదపెట్టుచు నవారితలీలల దండి బోఁ డగున్ ॥ 3

కం॥ సమకొను ప్రయత్నమును స
త్త్వము చెందుచు సూక్ష్మధారఁ దగ నిల్కడయై
యమరినమతి ఫలసిద్ధిం
గ్రమమునఁ గను నరణి యగ్నిఁ గనుచందమునన్ ॥ 4

ఉ॥ జేసరుడాలఁ గుందనముఁ జెందినమాడ్కి నధిష్ఠించినన్
వేగమె వెన్నవుట్టుసరణిన్ వరబుద్ధిసమేతయత్నసం
యోగముగల్గి నిల్కడల నొందుచు నుండెడు నట్టి పంది యు
ద్యోగముచేత నెల్లపుడు నొందు ఫలంబులు నిశ్చయంబుగన్ ॥

మ॥ తలఁపన్ సంపద నెల్ల భర్తయును కాంతింబోలె వ్యాజాని ని
చ్చలుఁ దాఁ బౌరుషయుక్తుఁడై యనుభవింపం గోరి యత్నంబు పే
ర్చలిఁ జెందం దగు నిట్లుగాక మఱి యుత్సాహంబుతోఁ బాయు పా
పల దెవ్వేళ నపుంసకుం బబలె నంపంగా మహీభర్తపా॥ 12

కం॥ అందంద భర్తయై తగు
పొందిగ మనఁ గూడునట్లు మఱి సిరి పొగఁ బో
యెందు నల సింహవృత్తిన్
ముందల వట్టీడ్చి తెచ్చి ముదమున నెందున్॥ 13

చం॥ ధళధళమంచు మించులను దార్కొను సారకిరీటరత్నసం
క్తులఁ దులలేని చిత్రములతోఁ దగువైరిశిరంబులందు ని
చ్చలుఁ జలమెచ్చఁ బాద మవిషాదముగా నిడనుండెనేని కే
వలపలమానమానసుఁ డవశ్యము వాఁ శుభ మంచె చెప్పఁగన్॥ 14

కం॥ పనగల యుద్యోగము వే
నెనగొలిపెను చిత్తమెడిమెయుఁ గాంచె ని
ష్వనుమతిఁ బరులను దరువుల
వెన గడవఁ నృపతి కెంయు విభవము గలదే॥ 15

చం॥ చెనకినవైరిపైఁ జికిలిచేసిన వాసిలుపెద్దకత్తి దూ
సిన జనియించు చాయలు విచిత్రములై మదహస్తిహస్త భా
లనకరదండయుగ్మమున లావునఁ బట్టినఁ జిక్కఁగాక మిం
చిన ఘనరాజ్యలక్ష్మి దనచేతికి నూఱక చిక్కఁ దక్కనే॥ 16

ఉ॥ ఉన్నతమై చెలంగు పద మొందఁ దలంచినయట్టివాఁడు దా
నున్నతమై చెలంగు పదమొందుచునుండును, గాక నీచమై
యున్న పదంబుఁ గోరుకొనుచుండెడినీచుఁడు చెందు నీచమై
యున్నపదంబుఁ దాఁ బడుట నొందెడు శంకదొలంక నెల్లచోన్॥

మ॥ వనకంబెన్ బొదవైనయేనుఁగులమీఁదన్ విక్రమంబొప్పఁ జెం
గు సింగంబు పదంబుఁ బెట్టుగతి రాజాగ్రేసరుండెల్లడోఁ
దన యుత్సాహముచేత విక్రమముచే నిర్మింప సత్యున్నతిన్
ఘనమైనట్టిపదంబుఁ గైకొను ధరాకాంతుల్ నుతుల్ సేయఁగన్॥

కం॥ భయమొదలిన పా మొరులకు
భయముగఁ దనపడగఁ జూపు పాముఁ బలియున్
భయమునఁ బొరయనివాఁడై
నయగతిఁ దేజంబుఁ జూప నాయం బెందున్॥ 19

వ॥ ఇది యుత్సాహ ప్రకరణం బింక స్వామ్యాది సప్తాంగంబులకుఁ
గల ప్రయోజనంబులును. వ్యసనంబులును గ్రమంబున
వివరించెద నందు రాజప్రయోజన మెట్లనిన. 20

ప్రకృతిధర్మ ప్రకరణము — రాజచర్య

సీ॥ విద్యలన్నియు జెప్ప విని యర్థము లెఱింగి
వర్ణాశ్రమంబుల వరుసఁ బ్రోచి
శస్త్రశాస్త్రంబులచందముల్ గనుఁగొని
యనిసేయునేర్పుల నభ్యసించి
యలవమై నెపుడు వాహ్యాళి వెళ్ళగ నోపి
కార్యపద్ధతుల సంగతులు దెలిసి
రథములఁ గరులఁ జోరగ నేర్చి యెంతయు
బాహుయుద్ధమురీతి పదిలపఱచి

ఆ॥వె॥ మాయలెఱిఁగి పరుల మనసులు గనుఁగొని
వైద్యుల పరీక్షఁ గనఁగఁ జాలి
సకలజనులు మెచ్చ జయపెట్ట మెలఁగుట
రాజచర్యలివి ధరాతలమున॥ 21

సీ॥ మంచివారికినెల్ల మంచివాఁడగుటయు
దూర్తుల యెడఁ గడు ధూర్తుఁడగుటయు
సామదానంబులచందంబు భేదంబు
దండం బుపేక్షయుఁ దగ నెఱుగుట
మంత్రవిచారంబు మఱవక సేయుట
మంత్రమార్గమున సమ్మతి మెలఁగుట
మంత్రంబు రక్షించి మంత్రస్థిరుం డౌట
దుష్టజనంబుఁ బోఁ దోలుటయును

గీ॥ మఱియు దళవాయు లధికార్లు మంత్రివరు ల
మాత్యులుఁ బురోహితాదులు నిత్యలీల
మెలఁగఁగతు లన్నియును లెస్స దెలియుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 22

సీ॥ అరసి యమాత్యాదు లైనట్టి సప్తాంగ
మందలివ్యసనంబు లడఁచుటయును
కోపమందినవారి కోపంబు మాన్పుట
గురువు చెప్పినబుద్ధిఁ దిరుగుటయును
పూజార్హులగువారిఁ బూజింప నేర్చుట
ధర్మాసనము వెట్టి తప్పకుంట
రాజ్యబాధకులను బ్రహరించుటయు బంట్లు
జీతముల్ చెందుట చెందకుంట

గీ॥ చేసినవి సేయనివి పరీక్షించి యుంట
యెపుడు పేదరికంబున నెనయువారిఁ
గలిమిగలయట్టివారిని దెలియుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 23

సీ॥ మద్యమోహాసీనమానవేశుల మార్గ
మరసి వారల సంధియందుటయును
వచ్చువారిని బోవువారి నెఱుంగుట
హితులఁ గూర్చుట వైరితతి నడఁచుట
యాంత్ర విద్దల లెన్న యరసి రక్షించుట
నలుదిక్కులకును దూతలఁ బనుచుట
తనకు జీవనమైతగు గనుల్ పనులును
గరులను గృషిలాది గాఁగఁ గల్గ
గీ॥ నట్టి పన్నియుఁ జేకూర్చి యలరుటయును
శిష్టులగునట్టివారలఁ బ్రోచుటయును
మంచివారలఁ జేపట్టి మించుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 24

సీ॥ సకలజంతువుల హింసలు సేయకుండుట
యెందు నధర్మంబుఁ జెందమియును
మంచికార్యము లొనరించగాఁ బూనుట
దుష్టవాక్యములెల్లఁ ద్రోచియుంట
యియ్యంగఁ దగుచోట నియ్యంగ నేర్చుట
పుచ్చుకోఁ దగుచోటఁ బుచ్చుకొనుట
దండింపఁ దగనిచో దండింపకుండుట
దండార్హులగువారిఁ జెండుటయును
గీ॥ దెలియఁ దగినవి తెలియుట, తెలియఁదగని
యర్థములు విడుచుటయు, నిరర్థకములు
మాను టర్థంబుగలయవి పూనుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 25

సీ॥ అరిఁ గోర్ల నెపుడు న్యాయంబుగాఁ గొనుటయు
నెఱిఁగి న్యాయంబుగా నిచ్చుటయును
పెన్ప్రధానజనంబు ఘనముగాఁ బ్రోచుట
విడువగాఁ దగువారి విడుచుటయును
వైరంబు లడఁగించి వర్తించుటయు బంట్ల
తోడి విరుద్ధంబుఁ ద్రోయుటెందు
నెఱుఁగకుండిన యర్థ మెఱుఁగఁగా నేర్చుట
యెఱిఁగి యర్థము నిశ్చయించుటయును

గీ॥ సకలకార్యంబులందును జతురుఁ డగుచుఁ
బని సేయుచు నుండుట, బూనినట్టి
పనులఁ గడవెళ్ళగాఁ జేసి పరగుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 26

సీ॥ నీతి మించఁగఁ జెందనిది చెందఁగోరుట
చెందిన దభివృద్ధిచేసికొనుట
యభివృద్ధిచెందినయర్థంబు శాస్త్రోక్త
మగురీతి సత్పాత్రమందు నిడుట
మఱియు నధర్మముల్ మాన్పుట యనునీతి
విడువ కెవ్వేళల నడచు టెందు
నుపకారయోగ్యులై యుండెడువారికి
నుపకారములు సేయుచుండుటయును

గీ॥ ధర్మమెప్పుడు ధనముగా దాఁచికొనుట
యెంచఁదగుఁ గీర్తి మించి వర్తించుటయును
దైవమును బ్రాపు దాపుగాఁ దలఁచికొనుట
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 27

వ॥ అమాత్యప్రయోజనము. 28

## మంత్రి చర్య

సీ॥ ఆదాయములు గల్గ హానువుఁ గల్పించుట
యెఱిఁగి వెచ్చంబు సేయించుటయును
పైకొని పగవారి రాకుండఁ జేయుట
క్షితిపతి నెపుడుఁ బోషించుటయును
పంచసేతియును మంత్రంబు నెఱుఁగుట
యెఱిఁగి మంత్రఫలంబు నెనయుటయును
వ్యసనముల్ రాకుండ వర్తింప నేర్పుట
లెస్సగా భూమిఁ గాలించుటయును

గీ॥ పండుట ఫలంబు గలుగఁ దా మెలఁగి చెలఁగు
టాదిగాఁ గల్గియుండెడునట్టి వెల్ల
మంత్రిజనములపనులండ్రు మహిఁ దలంప
నెట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు॥ 29

వ॥ రాష్ట్ర ప్రయోజనము. 30

## రాష్ట్ర చర్య

కం॥ బలమును భండారము ధన
ములు వాహనములును ధాన్యములు దృణకాష్టం
బులు మొదలగువస్తుతతుల్
గలిగించుట రాష్ట్రమునకుఁ గల పను లరయన్॥ 31

వ॥ దుర్గప్రయోజనము. 32

## దుర్గచర్య

సీ॥ ఆపద తఱిఁ బ్రజ కాశ్రయంబగుటయు
భండారమున కున్కిపట్టగుటయు

సఖిలదేశంబులయందు నుండెడివార
చేయెడ నిలుకడ నెసయుటయును
బరులకుఁ బోట్లాట దాగుగాకుండుట
ఘనమైనవిజయంబు గనఁగలుగుట
శత్రుల మిత్రుల సమకూర్చఁ గలుగుట
బలముల రక్షించఁ గలుగుటయును

గీ॥ గడిదొరలచేత మఱి పాలెగాండ్రచేతఁ
బీడఁ బొరయక యెందును బెంపుఁగనుట
మొదలుగాఁగల్గు నివి దుర్గమునకు బనులు
నృపతి యీమార్గముల నెల్ల నెఱుఁగవలయు ॥ 33

ఒ॥ బలప్రయోజనము. 34

బలచర్య

సీ॥ విమతులఁ జెండాడి విజయంబుఁ గనుటయు
మిత్రులఁజేకూర్చి మెలఁగుటయును
జగతి నెంతేనియు సాధింపఁగలుగుట
ధనముల నార్జించి తనరుటయును
దూరకార్యముల నెందును వేగచేయుట
చెందినదాని రక్షించుకొనుట
నిజబలతతుల నెన్నికమీఱఁ గూర్చుట
పరచక్రములఁ గీడుపఱచకుండు

గీ॥ టాదిగాఁగల్గుచుండెడు నట్టి వెల్ల
ప్రాజ్ఞులగువారు బలములపనులటందు
రిట్టి మార్గంబు లెల్లఁ దా నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 36

వ॥ మిత్రప్రయోజనము. 36

సుహృచ్చర్య

సీ॥ పగవారలను మట్టుపడియుండఁ జేయుట
మంచిమిత్రులఁ బ్రబలించుటయును
భండారములచేత బలములచేతను
క్షితిచేతఁ బ్రాణంబుచేతనైన
నిండు నుపహారముచే చాలఁ జేయుట
మిగులనెయ్యంబుతో మించుటయును
గణుతింపఁ బ్రత్యుపకారంబుఁ గోరక
మంచికార్యములు సాధించుకొనుట

గీ॥ యాపదలయందు మిగుల సహాయుఁడగుట
సంపదలు చెందియుండిన సంతసిలుట
యరయ మిత్రుని పనులంట్రు ధరణినాథుఁ
డిట్టి రాజ్యాంగముల పనులెఱుఁగవలయు ॥ 37

వ॥ వ్యసనములకు. 38

ప్రకృతి వ్యసనములు

ఆ॥వె॥ ఎందుచేత శుభము లెప్పుడు చెడిపోవు
నదియ తలఁప వ్యసన మనఁగఁ బరగు
వ్యసనియైనవాఁడు వెస నధోగతిఁ బడు
నటులఁగాన వ్యసన మడఁప వలయు ॥ 39

కం॥ దైవంబును మానుషమును
దైవము మానుషము రెండు నగుటచేనిం
భావితమగు వ్యసనము తా
ఘావరుఁ డిదిమాన్చి దండుపోవఁగ వలయున్ ॥ 40

కం॥ జలమును చెవులును మారియు
నల దుర్భిక్షంబు చిచ్చు ననునైదు తెఱం
గుల వెలయు నెందు దైవిక
ములై నవ్యసనంబు లితరముం మానుషముల్ ॥ 41

కం॥ పౌరుషమున శాంతులచే
సారె విజ్ఞుఁడు దైవికవ్యసన ముడుపఁ దగున్
పౌరుషముచేత నీతివి
చారముచే మానుషవ్యసన ముడుపఁదగున్ ॥ 42

వ॥ రాజవ్యసనము. 43

కం॥ అతినిష్ఠురమగుమాటయు
నతిదండము వేఁట పాన మతివయు జూదం
బతిఘనమగుదుర్వ్యయమును
క్షితి నివి వ్యసనంబు లండ్రు క్షితిపతి కెందున్ ॥ 44

గీ॥ నిరత ముద్యోగవంతుఁడై నీతి నలరు
రాజు రాజ్యాంగముల నెల్లఁ బ్రబలఁజేయు
నటులఁగాకెందు వ్యసనార్తుఁడయ్యె నేని
తనదు రాజ్యాంగములనెల్ల తలఁకఁ జేయు ॥ 45

కం॥ అలధర్మార్థంబుల నా
కులుఁడగుచో మనసు దొట్రుకొని చెదరినచో
నిలతేనికి సన్మ్రంతులు
దెలుపఁగఁదగు రాజచర్య ధీరత చెందన్ ॥ 46

వ॥ మంత్రివ్యసనము. 47

కం॥ అలసత జాడ్యము గర్వము
గలహము దెచ్చుట ప్రమాదగతి యుద్ధతియున్
బలువగు స ప్తవ్యసనం
బులు మంత్రుల కెంచు వ్యసనములు ధరలోనన్ ॥ 48

కం॥ తనమంత్రిజనము వ్యసనము
గనినయెడ స్వామిడు శ క్తిఁ గలిగినవాఁడు
య్యును ఱెక్కలు విఱిగిన పులుఁ
గనగాఁ బొడవై నపదవి నందకయుండున్ ॥ 49

వ॥ భండారవ్యసనము. 50

ఉ॥ మారమునందె యుండుటయు దొంగలచేఁ బడిపోవు టెంతయుం
దీరఁగ వెచ్చమౌట చెడదింటయుఁ బెక్కగుచోట్లనుస్కి సం
డారగగూడబెట్టమి యనాదర భావముతోడ నుస్కి భం
డారమునందునుండు వ్యసనమ్ములగున్ ధరణీ తలంబునన్ ॥ 51

కం॥ వసుధన్ భండారమునకు
వ్యసనంబులు చెందెనేని యందగు వసులుం
బొసఁగవు గన భండారము
వ్యసనము మాన్చంగవలె నవశ్యము పతికిన్ ॥ 52

కం॥ ధరభండారమె మూలము
నరపతి కని నీతిపరులనంగా వినుటన్
దొర యెప్పుడు భండారము
గరిమ మెయిం బ్రబలుచుండగాఁ జేయఁదగున్ ॥ 53

వ॥ రాష్ట్రవ్యసనము. 54

చం॥ ఎలుకలు చిల్కలు న్మిడుత లెచ్చగువానయు వానలేమి దొం
గలు ప్రతిమూకలుం జనవు గల్గినవారల బాధ శత్రుమూఁ

విషమమూఁకలోఁన నెంతయు శత్రుబలండిన
సదరు నంతశ్శల్య మనుబలంబు
నన్యోన్య కలహంబు నంది యైక్యముగాని
భిన్నగర్భంబను పేరిబలము

గీ॥ నొక్కరి ప్రదేశమ వ్వల నుండి చేర
నసువుగానక యుండిన నపసృతంబు
వ్యసనమును జెంది ముడుఁగుచున్నట్టి కతనఁ
బతికినప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 63

సీ॥ పిఱికిసంతంబునఁ బెగడెడుదళవాయి
నొనగూడుఁబరిమృష్టమనుబలంబు
విపత్తిసైన్యముగూడి విడిసియుండుటఁజేసి
మించి రానేరని మిశ్రబలము
మునుశత్రుల సమీపములనుండి యేతెంచు
నుపనివిష్టంబన నొప్పుబలము
తరతరంబును గొల్చి తగు ప్రాఁతమూఁకలై
శూరత గల్గని శూన్యబలము

గీ॥ నెడరిమిత్రసహాయార్థమనిపినట్టి
మిత్రవిక్షిప్తమని మొనమేటి భటులు
చాలఁగూలినఁ బ్రహతాగ్రజనబలంబుఁ
బతికి నప్పటికనిసేయఁ బనికిరాదు ॥ 64

సీ॥ అధిపులతోఁ బాసియాధారమెడలిన
యస్వామిసంహిత మనెడి బలము
నధిపులు గూలిన యప్పు డొండొరులకుఁ
గూటమొందని భిన్నకూటబలము

వెనుక శత్రులచేత వెతఁజెందు దుష్పార్ష్ణి
గ్రాహము పేరఁగలబలంబు
గడుదవ్వుచో నెచ్చరికెకాఁడెడలిన
యటు ముందుఁ గానని యంధబలము

గీ॥ ధాన్యసంప్రాప్తి చుట్టముల్ దనకు రాక
జడియువిచ్చిన్నవీవధాసారబలము
వ్యసనములయందె మునుఁగుచు న్నట్టికతనఁ
బతికి నప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 65

వ॥ ఇంక వ్యసనంబులు పరిహరించి యనికిం బనికివచ్చు బలంబు
లెవ్వియనిన. 66

బలవ్యసన పరిహార విధానము

సీ॥ రిపుబు మార్గము గట్ట నుపరుద్ధ మది పెర
త్రోవ నేతెంచిన దుర యొనర్చు
బహుమాన మొందని బలమమానిత మగు
నది యిచ్చి మన్నించ నని యొనర్చు
నిలుపఁగాఁ దావులేనిది శూన్యమూలమౌ
నది తావుగల్పించ నని యొనర్చు
నభృతంబు జీతంబు నందకుండినబలం
బదిజీత మిచ్చిన నని యొనర్చు

గీ॥ నలసి యున్నఁ బరిశ్రాంత మనఁగ బరగు
నలయికలు దీర్చనదియును నని యొనర్చు
నిట్టిబలముల వ్యసనంబు లిటుల మాన్పఁ
బనికి వచ్చును మనుజ భూపాలునకును ॥ 67

సీ॥ అడిగిన సీకున్న నాశ వేవేత(జెంది
నాశావిని ర్వేదియనెడి సైన్య
మది యడిగిన దెల్ల నప్పు డొసంగిన
నది బలంబుల(గూర్చి యని యొనర్చు
మాఖ్యలతో(గూడ మాష్యయుక్త మటంట్రు
తద్దూష్యులగువారిఁ దలఁగ ననిచి
యైన నాప్తుల మూలులగువారితోఁ గూర్చి
యనిక(బంచిననైన నని యొనర్చు
గీ॥ నధికమగునేర్పు లీరీతి నాత్మనెఱింగి
తనకు విజయంబు చేకూడఁ దలఁచెనేని
యిటుల బలముల వ్యసనంబు లెల్లమాన్పఁ
బనికివచ్చును మగుడి భూపాలుఁడరయ॥ 68

కం॥ బలముల వ్యసనము లీగతి
నలవునఁ దా మాన్పఁడేని యందఱు బహుళా
గలుగఁగ నేరవు గావున
బలముల వ్యసనములు మాన్చు పతి జయమందుఁ॥ 69

వ॥ ఇంక మిత్ర వ్యసనము. 70

కం॥ ఇల సప్తవ్యసనంబుల
వలనం జనియించునట్టి వ్యసనంబులు వై
రులచే నొచ్చుట దైవము
వలనఁ జెడు టివ్వి మిత్రవ్యసనము లరయఁ॥ 71

కం॥ మిత్రుఁడు వ్యసనము నందిన
మిత్రుఁడు చేకూర్చుపనులు మిగులఁగఁ జెడుఁ దా
న్మిత్రుని వ్యసనము మాన్చిన
ధాత్రీపతి యెట్టివేళఁ దా జయమందుఁ॥ 72

కం॥ కావున నమాత్యమతమున
సేవలసెను మెలఁగి శాస్త్రదృష్టి వెలయఁగా
దా విడువవలయు వ్యసనము
లావల ధర్మార్థహాని యడరక యుండన్ ॥ 79

## సప్తవ్యసనములు

చం॥ పలుకుల వెట్టి యర్థములు పాఱగవైచుట యెక్కు డాజ్ఞనాఁ
గలయవి క్రోధజంబులయి కన్పడుచుండు ధరాతలంబునన్
వెలఁదియు మద్యపానమును వేఁటయు జూదముఁ గామజంబులై
నలువు దలిర్చు నిట్టి వ్యసనంబులు భూపతి మానఁగాఁదగున్ ॥

వ॥ అది యెట్లనినను దత్ప్రకారంబు గ్రహించున వివరించెద వాక్పారుష్యమునకు. 81

కం॥ వెఱపొనఁగి నిరర్థకమై
కఱకరిగలపలుకు బలుకగా దెవ్వరితో
మఱి పగఱను మృదువాక్యమె
మఱవక దనవారిఁజేసి మనఁగా వలయున్ ॥ 82

కం॥ కారణములేకయే వా
క్పారుష్యము వెలయుఁగ్రోధగతిఁ బలికెడు నా
క్రూరునకు వెఱచులోకం
బారయ మిణుఁగుర్లు చల్లు నగ్నింబోలెన్ ॥ 83

కం॥ కఱగరి బలుకును గైదువ
మెఱయుచుఁ బరమర్మభేదమే చూపినచో
గుఱుతగుఁ బ్రతాపవంతుఁడు
మఱిమఱియును దెరలికెరలి మహిఁ బగఱయనున్ ॥ 84

కం॥ ఇల జనులకుఁ బరుసనగాఁ
బలుకుచు వెఱపింపవలదు పతి తియ్యనిప
ల్కులె పలుకవలయు నటులం
బలికినచోఁ జేదనైనఁ బ్రజ సేవించున్ ॥ 85

కం॥ జగతిన్ దుర్జనసాధక
మగు నాజ్ఞయె దండమనఁగ నగు దండంబున్
దగినయెడఁ జేయఁగాఁ దగుఁ
దగుదండము సేయఁ బతిని ధర నుతియించున్ ॥ 86

మ॥ తెలియ న్వ్యక్కసమైన యాజ్ఞగల ధాత్రీపాలుఁ డెంతయుం బ్రజన్
దలఁకంజేయుఁ, దలంకుచుండు ప్రజ సంతాపంబుతో వైరమం
గలయుం, దత్ప్రజఁ గూడమించునరి సంఘం బంటువేరిన్ జయం
బలయుం గావున భూప్రజం దలఁకఁ జేయంగాదు భూపాలునిన్ ॥

కం॥ ప్రజలను బాలించిన భూ
భుజుఁడు కడుం బ్రబలుచుండు భువి నెల్లపుడున్
బ్రజలు చెడఁ బతియుఁ జెడు నా
ప్రజలు కడుం బ్రబలఁ బతియుఁ బ్రబలుచు నుండున్ ॥ 88

కం॥ ఎంతటి యపరాధుల ప్రా
ణాంతకమగు నాజ్ఞసేయు టనుచితమగు భూ
కాంతుఁడు రాజ్యముఁ జెఱచిన
హంతనె దండింపఁదగు నయస్థితి మెఱయన్ ॥ 89

వ॥ అర్థదూషణము. 90

కం॥ చెలుపంగఁ దగినవారలఁ
జెఱిపెదనని కినుకఁ బ్రియముచేసిన నది యా
ధర నర్థదూషణం బనఁ
బరగున్ నీతిజ్ఞులైన ప్రాజ్ఞులచేతన్ ॥ 91

కం॥ కారణముదేక కోపము
పేరినగల ధనము వెచ్చపెట్టుచు కొఱగా
దారయు నాత్మ హితంబుల
నేరుపుతోఁ గోరునట్టి నృపతికి నెంచున్ ॥ 92

వ॥ మృగయావ్యసనము. 93

సీ॥ వాహాన్వం బెక్కుచో వచ్చిన బడలిక
వాహనంబులఁ దోలి వడఁబడుటయు
వాహనంబులు దనవైపున రాక యొం
డొకదిక్కుఁజేర్చఁ జేటొదవుటెంచు
నాఁకట దప్పిచే నలయుట ప్రజలకు
నన్నపానాదిక మమరమియును
జలిగాలి యెండచేఁ గలిగినపీడలు
ప్రతియానములచేతఁ బరగుపీడ

గీ॥ కనవుచే తెల్లుచే వెండి యిసుకచేతఁ
జెట్లచే గట్లచే ముండ్ల పట్లచేత
వేళ్ళచే నీళ్ళచే నాటవికులచేత
వెలయుపీడలు వ్యసనముల్ వేఁటలందు ॥ 94

కం॥ పుట్టల మిట్టల గుట్టల
పట్టుల మఱి మోటచెట్లపట్టున నెపుడున్
బెట్టుకొను వెతలు వేఁటన్
బుట్టెడు వ్యసనంబు లంద్రు బుధ లెచ్చోటన్ ॥ 95

వ॥ మఱియును. 96

సీ॥ కానల నదులను గట్టుల గుహలందుఁ
బొదలచెంతల దక్కి పొంచియుండి
కేసుకతోఁ బాళెగాండ్లను వోడి దొరలను
దను గడంగించినఁ దగులువడుట
యెంతయుఁ గినుకతో నెదస్సియుండెడుఁ దన
బలముచే దాయాదకులముచేతఁ
ద్రోవలఁ గడు మోసపోవుట మఱియును
ద్రోవల భ్రమయుచుఁ దొట్రువడుట
గీ॥ యాది యగుదోషములు వేఁటలందు నెపుడుఁ
బాడము గావున నెప్పుడుఁ బుధమితోస
వేఁటలాడెడితపకంబు విడువవలయు
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 98

చం॥ ఎలుగులు సింగముల్ పులులు నేనుఁగులుం బెనుపాము లాదిగాఁ
గలిగినక్రూరజంతువులు గ్రమ్మఱ భయమ్ములు మీఱుఁ గావుచి
చ్చలువడిఁ జుట్టికొంటయును జూపుల దిగ్భ్రమ మాపహిల్లఁ దా
నలఁగుట వేఁటయందు వ్యసనంబులు రాజున కెంచిచూడఁగన్ ॥

వ॥ వేఁటయందు షడ్గుణములు. 99

చం॥ నిలుకడ గల్గులక్ష్యములు నిల్కడలేక చలించులక్ష్యముల్
బలువిడినేయు, టామము కఫంబును గ్రొవ్వు నడంగిపోవుటల్
మెలఁగెడు వేళలన్ శ్రమము మించకయుండుట, జంతుజాతికిన్
గల భయ రోషముల్ దెలియఁగల్గుట, వేఁటగుణంబులెన్నఁగన్॥

వ॥ ఇట్లయ్యును. 101

కం॥ ఇలఁ బ్రాణహారకములై
బలసినదోషములు పెక్కు ప్రాప్తించుటచేఁ
దలఁప మహావ్యసనంబై
పొలుపొందుం గాన వేఁట పోఁదగ దెందున్ ॥ 102

వ॥ అయినను మఱి యొక్కతెఱంగైన సాధన మెవ్వైన యుచిత
క్రియలవేళనే వేఁటయందలి మంచి గుణంబులు గలుగుటకు
నుపాయంబులు గలవు గావునఁ దత్ప్రకారంబు వివరించెద. 103

సీ॥ వేఁటాడఁగా నిచ్చ వేడుకకుఁ గల్గినా
దనపురంబునకుఁ బ్రాంతమునఁగల్గు
మలచెంతనైన నేఱులచెంతనైనను
దగి మృగంబుల నెందు దాఁటరాని
యగడితఁజుట్టిరా ననువొంది రమ్యమై
పొదలు ముంతులు గల్గు పొదలు లతలు
విషకారణములైన వృక్షబలములేక
జలము బచ్చికబైళ్ళు చాలఁగల్గి

గీ॥ యర్ధయోజన పరిమితంబైన వెళపు
నిడుపు గల్గుచుఁ దగునట్టి యడవి యొకటి
యాప్తతతిచేత నిర్మింప నర్హ్యమంద్రు
వేఁట లాడెడుకొఱకు భూవిభున కెందు ॥ 104

సీ॥ కప్పుమబ్బుల యొప్పుఁ గప్పుచాయలు గల్గి
పలుచనై కాయలుఁ బండ్లు గల్గి
ఘనగుల కొల్పెడి తావి పూవుగుత్తులు గల్గి
నణుతు పేరెఱుగు మ్రాఁకులునుగల్గి

భృంగసంగీత భంగీతతులు గల్గి
శారికా కీరికా సమితిగల్గి
హారిణీ కలభజాల కరిణీకులము గల్గి
వల్లీమతల్లికావళులు గల్గి

గీ॥ చాల కోఁతులులేక మొసళ్ళులేక
శోభితములైన కొలఁకుల చోట్లు గల్గి
మిగులఁ జెలఁగెడు వనము నిర్మింపఁజేయ
వలయు నాప్తులచేత భూవల్లభుండు ॥ 105

సీ॥ పోవఁగాఁ గొట్టిన పుట్టలు మిట్టలు
శిలలు మొద్దులు ముండ్లచెట్లు గల్గి
ఎండారఁ బూన్చిన నెఱియలు బొఱియలు
గుంటలు గోదముల్ గొబలు గల్గి
పరిఖవెంటనెయుంటి పలుదెఱంగుల తీవ
లల్లిబిల్లిగ నిండ నల్లికొనిన
రాజిలంబగు వనరాజిచేఁ జుట్టిరాఁ
జెలువొంది వెలిని క్రమాఁకులును లేక

గీ॥ మిగుల వెడలుపు చదురమై మెఱయునట్టి
భూమియును గల్గి తన శత్రు భూపతులకుఁ
జేరఁగా రాక రమ్యమై చెలఁగు వనము
బాగుసేయించవలయు భూపాలుఁ డెపుడు ॥ 106

వ॥ మఱియు నాటవికతతుల మనంబు తెలియంగంజాలి తనకు నాప్తులుం గ్లేశాయాస సహిష్ణువులైన జనంబులచేతఁ దద్వనరక్షణంబు సేయింపుచునుండెడి మృగయాధ్యక్షుండైన యతండు వివిధ జాతుల మృగంబులం బట్టితెప్పించి యందు దుష్టమృగంబులైన

వానికి గోళ్ళను గోలలను గొప్మలనుం గొట్టించి యంపు పిడి
పించఁజేయ వలయు నంత. 107

కం॥ ఇతరంబగు పని మఱపక
చతురత లివగల్గి యాప్తజనములతోడన్
బతి ప్రొద్దున వేఁటాడగ
నతి సన్నాహమున వనికి నరుగఁగవలయున్ ॥ 108

కం॥ జనపతి వేఁటాడగఁ ద
ద్వనసీమనుజెందు నట్టితఱి నుండంగాఁ
జను నాప్తబలము ప్రాంతం
బునఁ గడు నాయత్తపాటు పొదలుచునుండన్ ॥ 109

కం॥ అడవుల వేఁటాడంగాఁ
దొడరెడి సద్గుణములెల్ల దొరకుం దొరకున్
బుడమిం గల్పితవనముల
యెడలనె క్రీడించు నిచ్ఛ యెసఁగినచోటన్ ॥ 110

ఆ॥వె॥ వేఁటయందు నిట్టి విధము మంచిది యని
పలుకుదురు ధరిత్రిఁ బ్రాజ్ఞులెల్ల
నటులఁగాక వనికి నవనీశ్వరుండు బో
బోయరీతి వేఁట బోవరాదు ॥ 111

వ॥ జూదమునకు. 112

సీ॥ ఎంత ధనంబైన నిసుమంత సేపులో
పల నాశమౌటయుఁ బరుసదనముఁ
గోప మందుటయుఁ బల్కులచేత జగడంబు
నాయుధంబులచేత నగు కలహము

చెప్పఁబడుట ధర్మమున్ చెడుటయుఁ
జేయంగఁ దగుపనుల్ సేయలేమి
యతిరోష మందుట యార్యుల విడచుట
దుర్జనసంగతి దొరకుటయును

గీ॥ జేటునకుఁ గారణంబులు చేకురుటయు
వైరముం జెందుటయు సిగ్గు వదలుటయును
మొదలుగా గల్గు బహుదోషములను జెందు
హాళి జూదంబు లాడెడి యాతతాయి॥ 113

సీ॥ కల యర్థములమీఁదఁ గాంక్షలు లేకుండు
టర్థంబు లేనిచో నాశపడుట
సంతోషమును మనస్తాపంబుఁ జలమును
గడుఁ బ్రతిక్షణమందుఁ గలుగుటయును
జలకంబు మొదలుగాఁ గలిగిన దేహర
క్షణములయందు భోగములయందు
నాదర మించుకయైన లేకుండుట
మెలఁగకుండుటచేతఁ గలిగినట్టి

గీ॥ దుర్బలత్వంబుచేఁ జాలఁ దూలుటయును
మంచి శాస్త్రార్థముల నుపేక్షించుటయును
మొదలుగాఁ గల్గు బహు దోషములను జెందు
హాళి జూదంబు లాడెడి యాతతాయి॥ 114

కం॥ మలమూత్ర నిరోధంబులఁ
గల పీడలు దప్పికొనుటఁ గల పీడలు నాఁ
కలిఁ గొనుటవలనఁ బొడమెడి
యలమటలుం జూదమాడు నతనికిఁ జెందుᳲ॥ 115

సీ॥ నలుఁడేల కోల్పడి కులకాంత నడవిలో
పల డించి తా నడబాల యయ్యె
ధర్మజుం డాలిని ధర నోడి యిలనెల్ల
విడచి కంకుండన విరటుఁ గొల్చె
దంతవక్త్రుండును దా బలభద్రువే
గుఱుతుగా బండ్లూడఁగొట్టఁ బడియెఁ
గుండినపుర మేలుచుండురుక్మవిభుండు
జయము పోనాడి నాశనముఁ జెందె

గీ॥ జూద మాడియె కాదె యీ జూదమెంత
వాని నైనను భ్రమయించు వాసి చెఱచు
జూదము సకలగుణములఁ జూరలాడు
జూద మెంతటివానికిఁ గాదు ధరను ॥ 116

కం॥ జూద మనర్థముఁ దెచ్చుం
జూదంబున భేద మందుఁ జుట్టఱికంబుల్
జూదమున నెయ్య ముడుగుల్
జూదమె పో కాని దెంచి చూడఁగఁ బతికిల్ ॥ 117

వ॥ స్త్రీవ్యసనానకు. 118

సీ॥ కార్యకాలంబులు గడచిపోవుటయును
నర్థంబు ధర్మంబు నలఁచిచెడుట
యెవ్వేళ నిలువెళ్ళ నెఱుఁగని కతన న,
జ్జనులు మంత్రిజనంబు గినియుటయును
ధరణిపైఁ బక్షపాతంబునఁ జేయఁగా
దాని కార్యంబైనఁ బూనుటయును
దాల్మి లేకుండు టెంతయుఁ గోపమందుట
వైరంబు సాహసవర్తనంబు

ఆ॥వె॥ లావరిగాఁగఁ గల్గుసత్త్వి రోగము తెల్లి
వెండివలెను నెప్పుడుఁ గనుచుండు
నటులఁగాన నది మహారోగము తగు
విధముఁ దీనిఁ దెలిసి విడువవలయు ॥ 119

కం॥ వెలుపల మోమున మాటు
కలవడి వేగిరముచెందు సన్మిత్రులకుం
గల కోర్కెల్ల జిహ్వన
ముంతోఁ దంగూడ నాటు పుర గనకున్వె ॥ 120

వ॥ పానమునకు. 121

సీ॥ తెలివిలేకుండుట యుసూలు బిగుసుట
తిక్కలయును గోక కట్టుమయును
గల్లలాడుట బంధుగరిమ బోనాడుట
తలఁపు భ్రష్టయు మతి తలఁగుటయును
బుసిలేనితటి వెతఁబడుట నవ్వుటయును
ప్రాణబాధయును సంద్రయును గనుట
సత్పురుషులతోడి సంగతి వదలుట
దుర్జనసంగతి దొరకుటయును
గీ॥ గడగడ వడంకుటయు జారిపడుట కడు న
నర్థ మొందుట స్త్రీగోష్ఠి యధికమగుట
యాదియగు దుర్గుణంబుల నందుచుండు
మద్యపానంబుఁ దగిలిన మానవుండు ॥ 122

కం॥ పానవ్యసనముఁ జెందిన
మానవుఁ డెచ్చోటనైన మదమున మెలఁగున్
బానమదంబున నెచ్చో
నైన బహిష్కార మొంది యధముఁడఁ జెందున్ ॥ 123

కం॥ భృగునందనుఁడను యోగీశ్వరుఁ
డగణితమతిశాలి షడ్గుణైశ్వర్యయుతుం
డగు శుక్రుఁడుఁ దానముచేఁ
బగి మదమున శిష్యవరుని యెండిగఁ ద్రావెన్ ॥ 124

కం॥ కులమును బలమును వేదం
బులు శాస్త్రంబులును శీలమును సంపదయుం
గలవారైనను దానం
బలవడుటనె చెడరె యాదవాంధకవృష్ణుల్ ॥ 125

కం॥ సిరిఁ బొలఁగఁజేయు వ్యసనము
లరయంగా నేడు తెఱఁగులై యది యెపుడున్
ధర నిది యొక్కటియె నరుఁ
జెఱుమన్మతి యిన్నిగూడఁ జెఱుచుట యుడుపే ॥ 126

కం॥ మగువల నెంతయుఁ దగిలిసఁ
దగురీతుల మద్యపాన తత్పరుఁడైనన్
దగు కొంత వేఁట జూదము
మిగులం గెడౌట విడచి మెలఁగఁగవలయున్ ॥ 127

చ॥ పలఁపఁగ మిక్కిలిన్ విషయతత్పరతన్ గలిగించు సెప్పగా
నిలవదు వేదశాస్త్రముల నన్నిటి జారఁగఁజేయు సద్గుణం
బులను మహత్త్వముం జెఱుచు బుద్ధియుఁ బెద్దలిసంబు సంపదన్
జలనము నందఁజేయును వెసన్ వ్యసనంబులు దాఁట శక్యమే ॥

కం॥ వ్యసనములు గలుగు నరపతి
పసుదం బసదొఱఁగు వైరివర్గముచేతన్
వ్యసనములులేని నరపతి
యసదృశగతి మెలఁగి గెలుచు నరిసంఘములన్ ॥ 129

మ॥ ఇదియిది దీనికిం దగు రచించు నటంచును గొర్కె మీఱఁగా
మదిఁ దలపోసి తాఁ బ్రకృతి మండలి సత్క్రియతోడఁ గూర్చి స
మ్మదమున నీతి రీతులను మానవనాథుఁడు దా మెలంగినన్
వదలని గౌరవంబునఁ ద్రివర్గముఁ జెందుఁ బ్రతాపశాలియై ॥ 130

చ॥ అనుపమదాన దానయుతహస్తిలసద్బలవాహనప్రభా
లసదటుసార సారసవిలాసవిలోకన లోకనవ్యస
ద్వసుత విహార హారరుచివిశ్రుతకీర్తినివాస వాసవా
ద్యసుమనమోజ్ఞభోగ విభవానిశ బంధురబంధురక్షకా ॥ 131

క॥ దీప్తోత్సాహ మహోజ్జ్వల
సప్తాంగ గుణాగుణజ్ఞ సకలదిగంత
వ్యాప్తప్రతాప వరజల
జాప్తాన్వయరామనామనాసక్తమతీ ॥ 132

కవిరాజవిరాజితము ॥

పటుల తురంగమ సంక్రమణక్రమ సైన్య విరాజితసారసమో
ద్భటపటహప్రతి ధింధిమదంధిమ దాటణనిస్వన దారితదు
త్ఫుట మదశాత్రవ భూప ప్రతాపజ భూరివిభాసురభూధరత
స్ఫుటవలయాచల భూసుతసద్గుణభూషణ నిత్యవిభుత్వయుతా ॥

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సాహిత్యసారస్వత
భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన
విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవనాగధేయ వేంకటనామధేయ
ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు
ఉత్సాహ ప్రభుశక్తియు సప్తాంగప్రయోజనంబులుఁ దద్వ్యస
నంబులు నన్నది షష్ఠాశ్వాసము 134

---

# ఆంధ్ర కామందకము

## సప్తమాశ్వాసము

కం॥ శ్రీమదహోబల నృహరి
స్వామిపునఃస్థాపనప్రశస్తజయాంకా
రామపదభక్తి వరవి
ద్యామహితాంధ్రరాజ వెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### యాత్రాభియోక్తృ ప్రదర్శన ప్రకరణము

కం॥ వ్యసనము విడిచి త్రిశక్తుల
బొసఁగి జయాకాంక్షియైన భూపతి దనకుం
బసగలతఱిఁ గదలఁగఁదగు
వ్యసనంబులు నొందినట్టి వైరులమీఁదన్ ॥ 3

చం॥ వ్యసనము గల్గియుండురిపువర్గముమీఁదను దండు పోవఁగాఁ
బొసఁగునటంచుఁ బల్కుదురు పూర్వులు నిట్టిమతంబెకాదు త
ద్వ్యసనము లేకయుండు రిపువర్గముమీఁదటనైనఁ బోవ వె
వ్యసనముగురీతి దండు చనఁగాఁదగుఁ దాను సమృద్ధుఁడైనచోన్ ॥

కం॥ ఇలఱేఁడు శత్రు గెలువం
గలచేవలనైన శత్రుగణముల రాజ్యం
బుల బలిమిఁ జెఱుపనోపం
గలచేవలనైన దండు గదలఁగవలయున్ ॥ 5

ఉ॥ వైరులు పండి పుంజగలపట్టున వైరులసేమముఁ జెటన్
మారుమబుంబు దంము చనఁవొల్పగు నిగతి నందువెసు దున్
వైరుల మారిఁబట్టి పరిపంథుల జీవనముల్ హరించినన్
సారబలంబుఁ దనరి శత్రుల గెల్చును నిర్భయస్థితిన్ ॥ 6

చం॥ వెనుకటివైపులం దనము వెన్కనురాఁ గడు దిట్టపెట్టి వెం
బడఁ బలిపర్యటం బెలిసి ముందరఁగల్గుభయప్రదేశమున్
గనుమలు తెన్నుగా నెఱిఁగి కంటకశుద్ధి యొనర్చి రాజుదా
నెనయఁగ మార్గమందుఁ బతి యాత్ర సనందగు నప్రమత్తుఁడై ॥

చం॥ సుమముగ నొప్పి గంటలను జాలఁగ దిట్టలునైనచోట్ల నె
య్యముగలవేళ మున్నుగఁ బ్రయాణమువోవుట యొప్పు వైభవ
క్రమములయందుఁ దానెఱుఁక గల్గుచు నాట్టుఁడుగాక యన్నపా
నముల సమృద్ధిఁ జెంది జనసంఘ దండు నడంగఁ జెప్పగన్ ॥

చం॥ జలము పసంబునుం గలుగు చాయనె వేసవి వైరిమీఁదఁ బో
వలయు మదేభముల్ జలమువల్లఘటిల్లెడు సౌఖ్యమొందఁగా
జలములు లేకయుండినను సామజపంక్తులకెల్ల వేసవిం
గలుగుచునుండుఁ గష్టములు గాటపుటెండలఁ జుట్టువెట్టచేన్ ॥

కం॥ ఒక్కయెడ నిలుచునప్పుడు
గక్కసమగు వెట్టనొంచుఁ గరి బృందములన్
మిక్కిలిఁ బ్రయాణముల నెడి
వెక్కసమై నొంపనున్నె వేసవివేళన్ ॥ 10

కం॥ నీరములు లేని వేసవి
సారెకు దురవస్థఁ జెందు జంతువు లెల్లన్
వారణపంక్తుల కైనం
దీరనితాపముల నపుడె దేహము లెండున్ ॥ 11

ఉ॥ ఘుమ్మను పంచవాసనలు గ్రమ్ముమదమ్ములు గల్గి కొమ్ములం
జిమ్ముట నుగ్గునూపములు చేసినగట్టులు గల్గి మీఱి కా
ర్గ్రిమ్ముచుఁ గప్పు మబ్బుగమికప్పులయొప్పులు గల్గుదంతి సం
ఘమ్ములయందెకా ధరణికాంతులరాజ్యభరంబు నిల్చుటల్ ॥ 12

మ॥ అవిచూడన్ నడగొండలో యనఁగ నీలాభ్రంబులో నాఁగ గ
ట్లవియం గొమ్ములఁ జిమ్మనార్చి మదధారాసారతం బేర్చి గా
త్రవులం గోరువులాడనేర్చి తగు నుద్యద్భద్ర నాగేంద్రముల్
ఘవి రాజ్యాస్పదహేతువైనవి గదా భూపాలకశ్రేణికిన్ ॥ 13

ఉ॥ హారతపోటునేర్పు సముజ్జోకయుఁ గల్గిన మావటీఁడు పెం
పారఁగ నెక్కి యుక్కసఁగి యాయితపాటున మీఱు వారణం
బేరణమందునైన జవమెచ్చినవాజుల నాఱువేలఁ దా
ధీరత మించఁ ద్రుంచు వినుతింపు సుదంచితసాహసంబునన్ ॥

కం॥ జలముల నడవుల నప్పుల
బలుదిన్నెల సమములైన పట్టుల వడిఁ గో
టలును గడపు వడియేనుం
గులు గలిగిన దొరకు దొరకుఁ గోరిన జయముల్ ॥ 15

కం॥ ఏతెరువు నీళ్ళు గలయది
యేతెరువు పరభయంబు లెసఁగక తగుఁ దా
నాతెరువునఁ జనవలయున్
భూతలపతి బలము శ్రమముఁ బొందకయుండన్ ॥ 16

## దండయాత్రా విధానము

సీ॥ అధిపతి దండెత్తునట్టిచో క్షుద్రశ
త్రుండును వెనుక శత్రువుల రేఁచు
నదియ రంధ్రము గాన నహితులౌవారెల్లఁ
గడు ఘనంబుగఁజేయఁ గడఁగుచుండుఁ

ఎతికె ముందఱవచ్చుఫలమున కంచెను
వెనుక శత్రులపోరె ఘనము దెలియ
యిదిగాక కాననియర్థంబుకొఱకునై
చేకొన్నయర్థంబు వెఱుపరాదు

గీ॥ తానఁ దనబల్మి వైరుల ఘనతఁదెలిసి
వెనుక శత్రుల పగమాన్పి విమతుమీఁద
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 17

సీ॥ తనకుఁ బిఱుంద శాత్రవుఁడున్నచోఁ దన
కతఁడు నులోఁగక యరిగెనేని
వెనుకటి శత్రువు వేగ భేదముచెంది
యలమట నొందించు నటులఁ గానఁ
దనకుఁ బిఱుంద ముందఱఁగల్గు శత్రుల
నడఁపగా నోపినయట్టి శక్తి
కలుగు వేళలను విక్రమయుక్తిచే మించి
ఘనములౌ ఫలములు గలుగనెంచి

గీ॥ తనకు నెలవైనపట్టణంబునకు రక్ష
యమ్మ గావింపఁదగినబలమ్ము నుంచి
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 18

సీ॥ అరయంగ నిఱువదియగు సంఖ్యఁ దనరుచున్
గలుగు చేరువయ వర్గంబటండ్రు
ధారుణీస్థలి నిట్టిచేరువ కొక్కొక్క
ఘనుఁడైన చేరువకానిఁ గూర్చి

పెక్కు వేరువలును వెక్కు వేరువకాండ్లు
గఱిగిన తన యాప్తబలము నేర్చి
జన పట్టణముఁగాప నొనరింపఁగాఁ దగు
నిటుల సేవకాండ్ర నేర్పరింపఁ

గీ॥ బయల కెందు నభేద్యులై పరగుచుండ్రు
గాన నీరీతి నొనరించి ఘనత మించి
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం వెఱింగిననృపవరుండు ॥ 19

సీ॥ తనకు సహాయమౌ దైవంబుచేత న
ద్వ్యక్తిఁడై దండెత్తుచుండు రాజు
ముందరికి నపథ్యమును బను కార్యంబు
వెనుకశత్రుని రాక మొనయు నం
యొక్కవేళనె కల్గియుండిన బదరు
దళవాయినైనను దనయునైనఁ
దన బలంబులలోనఁ దగినట్టి నాలవ
పాలైన మూఁడవ పాలునైన

గీ॥ బలము నొనఁగూర్చి ముందరి పగఱమీఁద
మునుపుగా నంపి తా నిల్చివెనుక పగఱ
నుడుగఁగాఁజేసి కదలుట యొప్పునండ్రు
దండయాత్రావిధిజ్ఞు లీధరణిలోన ॥ 20

## కోపద్వైవిధ్యము

వ॥ మఱియు నాంతరకోపంబును బాహ్యకోపం బనఁగ రెండు తెఱంగుల కోపంబులు గలవు. వానియందు నాంతరకోపంబ యధికంబగు నటులైనను నయ్యిరుతెఱంగులవారి కోపంబులు వారించి

మఱి యభీష్టంబుల నొసర్చి వారిం దనవెంటఁ గొనిపోయి యని
పలుకుచు నీ యిరువదెలుంగులవారి కోపంబు పెట్టినను. 21

సీ॥ హితమంత్రిహిత పురోహిత నిజవంశజ
సేనాధిపతులు ప్రధానజనము
లంత్రి ధారుణి వీరలందు నొక్కనికోప
మైన నాంతరకోప మనఁగఁబరగు
గడిఁగాచువారలు సచివులకడ నుండు
ప్రజలును మఱియెంచ బాహ్యజనము
లరయంగ వీరలయందులో నొక్కని
కోపమైనను బాహ్యకోప మగును

గీ॥ తనకు నాప్తులు చతురులై తగినయట్టి
మంత్రిజనములచేతను మనుజవిభుఁడు
తెలియఁదగు నిట్టికోపముల్ తేటపడఁగ
మించి వారల శాంతిఁ బొందించుకొనుటకు ॥ 22

గీ॥ ఎట్టిరీతినిఁ దప్తులై యెడసి పగఱఁ
గూడుకొనిపోవ రటులఁ దత్కోపమడఁప
నమరు సామాదులగు నుపాయములనైనఁ
గట్టుకొని వారి విరిపోటు పెట్టియైన ॥ 23

కం॥ హయములును భటులు చన్నట
క్షయమగు దవసంబు పసిఁడి కడు వ్యయమైనన్
వ్యయమగు నిటులన్ క్షయమును
వ్యయమగు పయనంబు మానవలయుం బతికిన్ ॥ 24

కం॥ పలముఁ జావశ్యము దనకుం
గలయది వేఁ జేతి కిచ్చుగతి వేగమె కా
గలయది వ్యయప్రయాసము
గలిగినయదియైన దండు గదలఁగవలయున్ ॥ 25

కం॥ ఏనుఁగులకు గుఱ్ఱములకు
మానుసులకు నొప్పిదాఁకి మఱి ఫలసిద్ధిం
గానక నొగిలెడు బనికిం
దా నెందును దండుపోవఁ దగ దధిపతికిన్ ॥ 26

కార్య వ్యసనంబులు

మ॥ తనకున్ శక్యముగాని వస్తువులమీఁదన్ యత్నముల్ సేయుటల్
దనకున్ శక్యములైన వస్తువులమీఁదన్ యత్నముల్ మానుటల్
దనకున్ శక్యములైన వస్తువుల వేళన్ గోరుటల్ మూఁటి నెం
దును గార్యవ్యసనంబులండ్రు నయవేదుల్ మేదినీమండలిన్ ॥

సీ॥ ఓర్పును గరుణయు నోర్పులేకుండుట
దాక్షిణ్యమును గ్రూరతయు భయమ్ము
డంబును సిగ్గు దుష్టత్వంబు దైన్యంబు
నతిధార్మికత్వ మహంకృతియును
దేశజాతిఁ బుట్టిన జనులఁ గాదనుటయుఁ
జంపుటయు నుపేక్ష సలుపుటయును
బలువగు నెండకుఁ జలికిఁ దా నోర్వక
యుండుట వానకు నోర్వలేమి

గీ॥ యివియవేళలఁ జేసిన నెందుఁగార్య
సిద్ధులకు నెల్ల విఘ్నముల్ సేయుచుండు
ననుచు నీతిరహస్యజ్ఞు లండ్రుగాన
వీని ననుచితవేళల విడువవలయు ॥ 28

సప్తవిధ పక్ష లక్షణము

వ॥ మఱియు మైత్రులును, నిజులును, సంబంధులును, భృత్యులును,
నాశ్రితులును, గృహీతులును, గార్యజులు ననెడు నేడు దెఱంగుల
వార లే పక్షంబునం బరంగుచుండుదు రిట్టి పక్షంబునంగ సహాయు
లనం బరగుచుండు నిట్టి సహాయు లెట్టివారనిన. 29

సీ॥ తన తల్లిదండ్రుల యనుగుసంబంధులె మైత్రు,
లెనసిన ప్రాంతవారెల్ల నిజులు,
వరవి వియ్యంపులె సంబంధులనుచుండ్రు
భృతికిఁ గొల్చెడువారె భృత్యు లరయ
నాత్మరక్షణమున నాశ్రయించినవార
లాశ్రితు లుపచార మందియుండు
వారు గృహీతులు వసుధఁ గార్యార్థులై
యనువొందువారె కార్యజులు దలఁప

గీ॥ నిటుల నేడుదెఱఁగులౌ నిట్టివారి
పక్షము లటండ్రు ప్రాజ్ఞులై పరగువార
లిందు రాగాపరాగంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 30

వ॥ ఇట్టి సహాయు లనురాగిసహాయులు నపవృత్తసహాయులు నన
రెండు తెఱంగులై యుండుదు రందు ననురాగంబుగల సహాయు
లెట్టివారనిన. 31

అనురాగి సహాయలక్షణము

చం॥ అనిశముఁ జేరికొల్చి సుగుణావళిఁ గీర్తనసేసి సంచలన్
వినక తదర్థమై తనరు విశ్రుతయత్నము పల్కు శౌర్యముం
గని కనుపట్టు దోషములఁ గప్పుచు నుండుట యెంచి నెంచఁగా
ననువగు నెయ్యముల్ గలుగునట్టి సహాయునిచిహ్న మిమ్మహిన్॥

వ॥ సద్వృత్త సహాయుం డెట్టివాడనిన. 33

సద్వృత్త సహాయలక్షణము

చం॥ కులమున మించి మోహమునఁ గూడక దైన్యమురేక విద్యలన్
బలమును సత్యమున్ గలిగి పాటిలు లోభము డించి బుద్ధిపే
సులుచు మేలెఱింగి వినయంబు వహించినయట్టిమిత్రుఁడే
ఫలన నుతింప మంచి తగువర్తనమొందిన పక్షమై చను ॥ 34

ఆత్మగుణముల సుద్యోగాదుల శ్రేష్ఠం

గీ॥ త్యాగ ముద్యోగమును ధీరతయును బుద్ధి
నిజము మర్యాద సిగ్గు నింద్రియజయంబుఁ
బ్రౌఢియును గారవం బనురాగ మోర్పు
బలము నన ముఖ్యగుణములు పార్థివునకు ॥ 35

శక్తిత్రయ స్వరూపము

సీ॥ సారమౌ నీతిప్రచారం బెఱుంగుట
జగతిలోపల మంత్రశక్తియందు
రాత్మసంపదతోడ నలరినబలము కో
శంబు నెంచఁగఁ బ్రభుశక్తియండ్రు
ఘనమైనయట్టి విక్రమమును బుద్ధియు
సత్త్వంబు నుత్సాహశక్తియండ్రు
నీతిమంతులుగాన నృపవరుం డెల్లచో
నిట్టి త్రిశక్తుల నెనయవలయు
గీ॥ నిటులు శక్తిత్రయంబుచే నెనసి యెపుడు
నేర్పుతోడుత వర్తింప నేరకున్న
మించు శత్రుల నెటుల జయించనేర్చుఁ
జెలఁగి సంపద నేరీతిఁ జెందనేర్చు ॥ 36

సీ॥ వ్యసనమందిన దైన్య మందకుండుటయును
ఘనమైన శౌర్యంబుఁ గలుగుటయును
దక్షతయును శీఘ్రతయు మహోత్సాహ సం
పదయుండు జగతిలోఁ బ్రాజ్ఞులెల్లఁ
బుట్టగాఁ బుట్టిన బుద్ధియు శాస్త్రంబు
దెలియుటకతమునఁ గలుగుబుద్ధి
పెద్దలసంగతిఁ బెనుపొందుబుద్ధియుఁ
గడు విచారింపఁగాఁ గలుగుబుద్ధి

ఆ॥వె॥ జ్ఞానరూపమంత్రిసంపద యనఁదగు
నిట్టి రీతులెల్ల నెఱుఁగనేర్చి
తనదు రిపులమీఁద దండు పోవఁగఁదగు
నీతి నెఱిఁగినట్టినృపవరుండు ॥ 37

మ॥ అల యుత్సాహము శౌర్య మందుటయుఁ గా
ర్యం బూనుటల్ సేయుటల్
బలువా నిల్కడ పౌరుషంబు మునిముం
బ్రాపించు టారోగ్య ముం
దలపెల్లన్ ఫలసిద్ధిచేఁ దగుటయున్
దైవానుకూల్యం బగున్
దెలివిన్ భూపతి యిట్టివేళల ధరి
త్రిం దండుపోవం దగున్ ॥ 38

కం॥ జనపతి తన భండారం
బనుపమగతి వెంటరా సహాయామలదే
సనువొంది గెలుచుటకున్నై
చనఁదగు బలాదిహీనశత్రుపుమీఁదన్ ॥ 39

క౦॥ ఈరీతి నీతియుతుఁడై
ధారుణిఁ బరుఁడు వండు పోయినయేనిన్
సారోదారతఁ బారా
వారావృతమైన ధరణివలయం బేలున్ ॥ 40

దండయాత్రాకాల దేశాదులు

చ॥ జలములు మట్టుగల్గుటటి సామజపంక్తికి దండు పోఁడగున్
జలములు మట్టులేనియటి సైంధవరాజికి దండుపోఁదగున్
వెలువని జక్కు మంచుఁ గడువెట్టయు లేక వెలంగ నాడునం
గలయుఁగ సర్వసైన్యములు గైకొని భూపతి దండుపోఁడగున్॥

గీ॥ గూబ రాతిరిఁ గాకులఁ గొట్టి నొంచు
గాకి పగలైన గూబల గడిమిఁ జించుఁ
గాన వేళ విచారించి కదలవలయుఁ
గాల మెఱుఁగుచుఁ గదలినఁ గలుగు జయము ॥ 42

ఆ॥వె॥ కుక్కచేత మొసలి చిక్కును దరియందుఁ
గుక్క మొసలిచేతఁ జిక్కు నీట
నటులఁగానఁ దనకు ననువైన చోటొంది
వెలయు రాజు కార్యసిద్ధిఁ జెందు ॥ 43

సీ॥ సమములై పసుపట్టు చమరపునేలల
నశ్వముల్ మున్నుగా నరుగవలయు
మిట్టలు గుట్టలు గట్టులు నైనచో
నేనుఁగుల్ మున్నుగా నేఁగవలయుఁ
బొదలును ద్రూఁకులఁ బొదలెడిచోటులఁ
గాల్బలి మున్నుగాఁ గదలవలయు
జలములు లోఁతుగాఁ గలిగినచోటులఁ
బగిస యోడలమీఁద దాఁటవలయుఁ

గీ॥ జవురములు మిట్ట గుంటలు జలముఁ బొలము
గలుగు నటువంటి నేలల బలము డిందు
నెందుచే మంచి చనఁదగు నందుచేతఁ
బోవఁదగు దండయాత్ర మహీవిభుండు ॥ 44

చం॥ జనపతి వానకాలమునఁ జాలఁగ మిట్టలమించు త్రోవలన్
బనుపడ వేసవిన్ సలిలమార్గమునం జని నొవ్వ నెండఁ ద
క్కినయెడ మిశ్రభూములను గేవల దుర్ఘటమైన మార్గముల్
గనుగొని యాత్మసేనకు సుఖంబగు రీతుల దండువోవలెన్ ॥

కం॥ జలములు కడుఁ గల త్రోవన్
జలములు లేనట్టి త్రోవఁ జనుట సుఖగతిన్
నెలవరులఁ గూడి చనఁదగు
గలయం గట్టియలుఁ గావు గలిగిన త్రోవన్ ॥ 46

మ॥ తన చుట్టంబుల మీఁద రాకడలచే ధాన్యాదిక ప్రాప్తిచే
ననువై నీళ్ళఁ జెలంగి నమ్మికల లోనై యుండు సన్మార్గ భా
జనముల్ గల్గిన త్రోవఁ బోవఁదగు నెంచం దీసుఁడై భంగమున్
గని వీఁకల్ చెడి వచ్చు త్రోవఁ జనఁగాఁ గాదెందు భూభర్తలన్॥

చం॥ తెలియక దూరమైన రిపుదేశము వేగిరపాటు మీఱఁగాఁ
జలమునఁ జొచ్చిపోవు దొర సంగరరంగమునందు వైరిభూ
తలపతి ఖడ్గధారల విదారితుఁడై బహు రక్తధారలం
గలగొని పొక్కియుక్కు చెడి గ్రక్కున సూరకె చిక్కి ప్రుక్కఁడే॥

వ॥ ఇట్లుపాయంబులఁ జెందని యపాయంబులం బయసంబులు
గదలివచ్చి సైన్యంబులు విడియింపందగు నచట మఱియును. 49

చం॥ అరులకుఁ జాలరానియటు లాత్మబలంబుల నిల్పి రక్షణం
బరయుచు నీతిరీతిఁ దగి యాప్తులు శూరులునైన యోధులన్

ప్పరికెలఁ జుట్టియుండగ నిశాసమయంబుల యోగినిద్రలం
బొరయుచు నుండగాఁ బగను భూపతియెందును జాగరూకుఁడై॥

చం॥ కలయఁగఁ జాలి రొప్పు కరిఘంటలగల్లు ఘణంఘణ ధ్వనుల్
మెలఁకువఁజెంది గుఱ్ఱముల మించిన హేషిత హుంకృతిధ్వనుల్
నిలుపఁడఁగాంచు యోధతతి నిశ్చలవాక్య డిమండిమ ధ్వనుల్
నెలకొని వీనులంటఁ బతి నిద్దురనందున మేల్కొవై పగన్॥

కం॥ ఎదురతఁడి నప్పుడప్పటి
కెది యెవ్వఁడు మేలుకన్న యతఁడని పతి దా
నెదియుఁడయి యాదరింపుచుఁ
బదిలంబని యెచ్చరించి పలుకఁగవలయున్॥ 52

సీ॥ అంత. 53

దండయాత్రా సమయముల రాజవై ఖరి

చం॥ తెలతెల వేగలేచి నరదేవశిఖామణి నాపతీర్థమై
కల కులదైవముం గొలిచి ఘుమ్మను కస్తురి తావి రీవితోఁ
బలుకుచుఁబక్కన న్మినుకు దార్కొను రత్న విభూష జాలితోఁ
గొలువుకు వచ్చుటొప్పు నిరుగోవులగట్టిన వారహోయునన్॥

సీ॥ శ్రీమంతులై మించు సామంతు లొకవంక
సుచితమంత్రులు మంత్రు లొక్కవంక
హితచర్యులగు పురోహితవర్యు లొకవంక
నుదిత సత్యు లమాత్యు లొక్కవంక
ఫలదాయులైనట్టి దళవాయు లొకవంక
నుక్కు నిక్కిన శూరు లొక్కవంక
బఢికారుల జయించు నధికారు లొకవంక
సుచిత మిత్రుల మిత్రు లొక్కవంక

వలయుం జీతముకంటె నెక్కుడుగ నిర్వ్యాజంబుగా నియ్యఁగా
వలయుం బ్రాణము లిత్తు రీ విహితమౌ వాక్యంబువేలఁ ఘటుల్॥

ఉ॥ కటుల రథంబులందుఁ దురగంబులయం దలయోధలందుఁ దా
నరుగఁగ నేర్చి వింట నెరయం జతురత్వముఁ జెంది కార్యముల్
నిరతము నభ్యసింపఁదగు నేర్పున నీగతి నభ్యసింప దు
ష్కరమగు కార్యమైనను సుఖంబునఁ జెందు నరేంద్రుఁడున్నతిన్॥

సు॥ కదు సన్నాహముగల్గుసేన లిరువంకం గొల్వ సన్నాహముం
బొదవుంగల్గు గజంబునెక్కి రిపులొ ఘావాలకు ల్వంప వెం
బడి నేతెంచిన మాతతో భటతతుల్ పై మాటుగానుండ నె
క్కుడు నేర్పొందెడు మంచివాక్యముల పెక్కుర్మిఁబోవందగున్

గీ॥ బుద్ధివే గుణములచేతఁ బొదలు గూఢ
చారిజనములచే మాతజనముచేత
వైరిచర్యలు దెలిసి పోవలయు వారు
సేనిపతి యొంచుచు గన్నులు లేనివాఁడు॥ 63

ఉ॥ ఘనత దలిర్ప శత్రు గడిఁగాచుదొరం దన మిత్రుఁజేసికోఁ
జనునపు డించుకించుక యొసంగుచు నాకలు వాలఁజూపియై
నను మఱి చేరమాడునెడ న్యాయముదప్పక వైరి ఘాములం
బనుపడి వచ్చునెల్ల పరిపాలన మొప్పఁగ మెల్పఁగాఁదగున్॥

చం॥ అనుపగుమాతఁ బంపి తనయందినకార్యము సంధిచేతఁ జ
య్యన నొనరింపఁగావలయు న ట్లొనరించిన సంధిగానిచో
దనరుచుఁ గార్యభేదమగు దాన నభేదముచెంది వారిలోఁ
గినుకలు బుట్టుచుండు నది కేవలముం బతికిన్ శుభంబగున్॥

చం॥ అడవులయందు దుర్గములయందు వసించినవారిఁ ద్రోవలుం
గడులును గాచువారల ఘనంబగుసామముచేత నీగిచే

కం॥ ఈరీతిఁ బగఱమీఁదట
నారూఢిన్ దండువెడలి యల నీతివిధిన్
ఘోరమతుఁడు వర్తించిన
వైరిసమూహముల గెలిచి వర్తిలునెందున్ ॥ 72

## స్కంధావార నివేశనప్రకరణము

కం॥ బలిమిం బనయరిపురివెం
తలకుం జని విడియఁదగినతావున విడియన్
వలయును బాళెముదిగునే
ర్పులుగలిగిన రాజు శత్రుభూపతులధరన్ ॥ 73

సీ॥ నాల్గువాకిళ్ళచే నలువొంది చౌకమై
ఘనముసు కొంచెంబుఁగాక పనవి
యగడితలనుకోట నట్టళ్ళఁ జెలువొంది
విపులౌ వీథుల వినుతికెక్కి
యర్ధచంద్రునిరీతి నైనను మఱియును
జతురస్రమైయుండు సరణినైన
విడివిగానైనను గడు వ్రుపుగనైన
నాలోనఁ గల భూమియను వెఱింగి

గీ॥ విమతపురిచెంతఁ బాళెంబు విడియుచోట
మించు *నౌకయగారంబు నిర్మించవలయు
సాధువులు మెచ్చ నచట నెచ్చరికె తెచ్చ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 74

సీ॥ కోటలో బలము దాకొన విడియించుచోఁ
గోటకు జలమున్న చోటునకును
గలుగనుండెన వీధి కొలగోల మాత్రంబు
విడిచి యచ్చట బైలుపడక నిండి

* నౌక్యయరాబు.

కోనినుండి పాలమించినపార్శ్వములు గల్గి
రక్షితం బగుచును గక్షపుటము
నొప్పను మూలలై యట సూర్యసోమవీ
థులు విరువులుగాఁగ నలరఁజేసి

గీ॥ వాస్తుశాస్త్రక్రమంబుల వైపు దెలిసి
విమతుపురిచెంతఁ బాళెంబు విడియుచోట
నిట్లు బలముల విడియించ నెఱుఁగవలయు
నతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 75

కం॥ పాళెమునడుచక్కి మహా
మూలబలము మట్టుఁగలిగి ముందఱ నడుమన్
మేలిమియగుభండారము
చాలఁగలుగ నగ రొనర్పఁ జను నెచ్చోటన్ ॥ 76

కం॥ ఇలఁజేఁడు నగరిచుట్టును
బలియించఁగవలయుఁ బ్రాఁతప్రజఁ గై జీత
మ్ములఁగూటము మిత్రబల
మ్ముల శత్రుబలంబు నడవిమూఁకను వరుసన్ ॥ 77

వ॥ తత్క్రమంబు. 78

సీ॥ నరనాథమణి తననగరికిఁ జుట్టును
మునుమున్నుగాఁ బ్రాఁతమూఁక నిల్పి
యాతరువాతఁ గై జీతంబు విడిపించి
యాకడఁ గూటపుమూఁక నిల్పి
యావల మిత్రసైన్యంబుల విడియించి
దానియవ్వల శత్రుసేన నిల్పి
యందున కవ్వల నడవిమూఁకల నిల్పి
యావల జీతంబు లంది కొల్చి

గీ॥ తొలుతఁ బనులకువచ్చి యాప్తులను గ్రహరి
లగుచుఁ గుక్కలు గలిగినయట్టి వేఁట
కాండ్రు చుట్టును విడియింపఁగా వలయును
గ్రహము దప్పక నీతివిక్రమము మెఱసి ॥ 79

రాజాభిరక్షణకై సైన్యావసానము

ఆ॥వె॥ అధిప నగరిచేరువందు నుండఁగఁదగు
నాప్తరక్షితంబు లగుచుఁ దనరి
పేరు గలిగినట్టి పెద్దయేనుంగులు
నధిక జవముగల్గునశ్వములును ॥ 80

కం॥ అంతఃపురపరిచారకు
లెంతయుఁ దమి విచ్చుఁగత్తు లేమఱక మహీ
కాంతుని గావఁగవలయును
సంతతమును జాలిరొప్పు సన్నాహమునన్ ॥ 81

కం॥ మేటియగు నాప్తుఁ డెక్కిన
పోటేనుఁగు జవము కలిమిఁ బొలిచిన హయముం
బాటించి నగరివాకిటి
చోటనె యెపు డుండవలయు జోక చెలంగన్ ॥ 82

కం॥ దళవాయి మున్నుగాఁగల
బలమం దొక కొంత యేరుపడి యత్నముతో
వెలుపటఁ జుట్టును దిరుగన్
వలయును రేలందుఁ గడు నవారితశక్తిన్ ॥ 83

కం॥ వేగము బలమును గలిగిన
వేగులవా రెల్లవేళ విమతులచర్యల్
బాగుగఁ దెలియుచుఁ దా మతి
వేగమె రాఁబోవవలయు విభునకుఁ దెలుపన్ ॥ 84

చం॥ ఎకిమిసి కోటిత్రోవ్విరులపెండలు గట్టినతోరణంబులుం
బెనుపుగ వంచసంబులును వాదము లాదిగఁగల్గ యంత్రముల్
ఎసఁగఁగ వెక్కెముల్ గలుగు ద్వారము లాప్తులఁ గాపఁజేయఁగా
వలయు నృపాలశేఖరుఁ డవారితపూరితకీర్తిసాంద్రుఁడై ॥ 85

జాగ్రదవస్థిత్యావశ్యకత

కం॥ పోవుచు వచ్చుచు వాకిటి
కావలివారలకు దెలుపఁగా సకలజనుల్
పోవలయు వైరిమాటలు
భావిఘనమతినె యుండి పోవన్ వలయున్ ॥ 86

గీ॥ రిత్తకోలాహలంబులు రిత్తహాస్య
ములును జూదంబులును బానములును మాని
సవరణల మించి యుత్సాహసహితు లగుచు
బలము లెవ్వేళఁ గనుగల్గి పరగవలయు ॥ 87

కం॥ తనకోటకు వెలుపలి దెసఁ
జనబలము చరించుభూమిఁ బడవక వైరుల్
మొనసి చరియించుభూములె
జనపతి చరియింపవలయుఁ జతురుం డగుచున్ ॥ 88

వ॥ అది యెట్లన్నను. 89

కంటకాదిభూమాషణము

కం॥ ఒక్కొక యెడఁబడు పొంతర
నొక్కయెడన్ ముండ్లకంప నొకయెడ ముళ్కుల్
మిక్కిలి గలిగించి రిపుల్
ద్రొక్కెడి చోట్లెల్లఁ జెఱుప దొరకొనవలయున్ ॥ 90

కం॥ తన బలములు మెలఁగుటకై
తనబడిపనివారిచేతఁ దరువులు బట్టన్
ఘనపుఁబె మొద్దులు శిలలుఁ
గనుపట్టకయుండ సమము గావింపఁదగున్ ॥ 91

వ॥ అంత నుత్తమమధ్యమాధమ భూములు వివరించెద. 92

ఉత్తమాది భూభేదములు

సీ॥ తనమూఁకలకు నెంతయు మెల్లఁగావచ్చి
వైరిమూఁకలకు రావైపుగాని
దే మ్ముత్తమమగు దేశంబు మఱియును
బగఱకుఁ దన కొక్కభంగియైన
దేశంబు మధ్యమదేశమై చెలువొందు
వైరిమూఁకలకు రావచ్చియుండి
తనమూఁకకెల్ల నెంతయుఁ బోవఁగారాని
దేశంబె యధమప్రదేశ మటులఁ

గీ॥ గనుక నుత్తమదేశంబె తనకు వలయు
నది దొరకకున్న మధ్యమమైన దైన
వలయు నదిగాక చెఱసాలవంటిదైన
యధమదేశంబు వలదు ధరాధిపతికి ॥ 93

వ॥ మఱియు నపజయసూచక ప్రకారంబు లెట్లన్నను. 94

నిమిత్తజ్ఞానప్రకరణము - అపజయసూచక నిమిత్తములు

సీ॥ గ్రహముసోఁకిన లీలఁ గళవళ మొందుట
తెవులుచేఁ బీడలఁ దవులుటయును
గారణంబులులేక కడుభీతి నొందుట
మంచును దుమ్మును ముంచుకొనుట

తమిస్రమై పొద్దుగాని పై పొడుచుటయు
నూరకె పెక్కెంబు లుర్విఁబడుట
పసులోనఁ బసుకు గ్రోహాయముల గల్గుటయును
వాక్యముల్ తెన్నఁగా వాఁగమియును

గీ॥ మిగుల మదిలోన నూరక వగలుపడుట
నేల యుఱుముట చుక్కలు రాలుటయును
వాగుల మంటలు గత్తులఁ బొడముటయును
గలుగు పాశెంబు విజయంబు గానదంత్రు ॥ 95

సీ॥ చాల వాసు సక్కి యాలఁబెట్టుటయును
ఘనమైనతాపంబు గలుగుటయును
ప్రాఁకులపైనుండి మూఁకలుగా వచ్చి
కాకుల గ్రద్దల గ్రమ్ముకొనుట
క్రమ్మకో రాజనక్షత్రంబులందును
గ్రహరగ్రహంబులు గూడుటయును
గారణంబేమియుఁ గలుగక మద మింకి
యేనుఁగుల్ గదలక ప్రాసుపడుట

గీ॥ తురగచయముల గదలక తొట్రుపడుట
సూర్యనందను మొండెముల్ చూడఁబడుట
నెరసి నెత్తురువానలుఁ గురియుటయును
గలుగుపాశెంబు విజయంబుఁ గానదంద్రు ॥ 96

వ॥ మఱియును జయసూచకంబు లెట్లన్నను. 97

విజయసూచక నిమిత్తములు

సీ॥ తేజీలసకిలించి లోజమై చెలఁగుట
కాంతలుఁ బురుషులు సంతసిలుట
భేరీరవంబు గంభీరమై యుండుట
కరిబృంహితంబు లగ్గలము లగుట

పుణ్యాహమంత్రముల్ పొలుపు పఠించుట
పాటలు నాటలుఁ బ్రబలు పెంపు
ఈతిబాధలులేక యింపొంది యుండుట
సంతతోత్సాహముల్ సంఘటిలుట

గీ॥ సారె జనులెల్ల విజయంబు గోరుటయును
వాన లటుగల్గి ధూళిచే నూనకుంట
గ్రహము లనుకూలగతులను గాంచుటయును
గలుగుపాళెంబు విజయంబుఁ గను నటంద్రు ॥ 98

సీ॥ మెల్లనితావులఁ జల్లగాడ్పులుగల్గి
సంతోషములఁజెందు జనులుగల్గి
పక్షిజాతులమంచిపల్కులు వినఁగల్గి
చెలఁగుచునుండు మిత్రులునుగల్గి
వందిమాగధశుభవాక్యచాతురిగల్గి
వలఁగొనుశిఖల వహ్నులఁజెలంగి
మదధారల నెసంగు మాతంగములుగల్గి
పలపట నక్కకూఁతలును గల్గి

ఆ॥వె॥ యలర నెందు దివిని నంతరిక్షమునందు
నవనితలమునందు నద్భుతముగ
నురక పొడమునట్టి యుత్పాతములులేక
వెలయుపాళెమునకుఁ గలుగుజయము ॥ 99

కం॥ పాళెంబున కపశకునమె
చాలంగాఁ గలిగెనేని జయములు దొలఁగుఁ
బాళెమున మంచిశకునమె
చాలంగాఁ గల్గెనేని జయముం గలుగున్ ॥ 100

కం॥ ఇలలోపల శకునంబులె
దెలుపును జయ మపజయంబుఁ దేటపడంగా
నిలవేఁ దడుగగ శాస్త్రము
తెలివిన్ శకునంబులెల్లఁ దెలియఁగవలయున్ ॥ 101

కం॥ మునుమున్న మంచిశకునము
లనుపృంగని విమలచిత్తుఁ డగుచుపుఁడు వా
నిసకార్యము సఫలం బగు
నెనుచుం బలుకుదురు ప్రాజ్ఞ లనఘా వెంచన్ ॥ 102

కం॥ బలమును దైవబలంబును
నలప్రజ్ఞయు నిశ్చయంబు యత్నమును సహా
యులకలిమి నెట్టివానికి
గలుగున్ ధరనట్టివాఁడు కడు జయ మందున్ ॥ 103

గీ॥ కనపు దవనంబు నీళ్ళను గట్టియలును
జేకురకయుంట చుట్టముల్ రాకయుంట
రేలు బగలును లాచి కగ్గోలు వడుట
విడుదలకు మృత్యువగు పీని విడువవలయు ॥ 10

కం॥ ఈరీతి దండు విడియుచు
సారె శుభాశుభము లిచ్చు శకున స్థితులం
దారెఱుఁగవలయు నృపతులు
వైరులయశుభములు దెలియవలయున్ వరుసన్ ॥ 105

ఉపాయ వికల్ప ప్రకరణము

కం॥ ధృతి యుద్యోగము సత్త్వం
బతులితమతి దేవతాసహాయత గలభూ
పతి సప్తోపాయంబుల
గతు లెఱుఁగుచుఁ జూసుపవలయు గడిఁదిరిపులపైన్ ॥ 106

క౦॥ చతురంగబలముకంటెను
బ్రతిభందగు మంత్రబలము భండారము సు
స్థితిమింపఁ గాన వీనినె
యతులితగతి గెలువవలయు నహితుల నెల్లన్ ॥ 107

## సప్తవిధోపాయములు

క౦॥ ఇలలోన సామదానం
బులు భేదము మఱియు దండమును మాయోపే
క్షలు నింద్రజాలమనఁగాఁ
గలిగిన యీయే డుపాయగతు లంద్రు బుధుల్ ॥ 108

వ॥ అదియెట్లన్నను తత్ప్రకారంబు క్రమంబున వివరించెద. 109

## సామ స్వరూపము

సీ॥ మునుపుగాఁ బ్రియమున మ్రొక్కి తానడచుట
పెద్దలసుగుణముల్ పేరుకొనుట
వారిసత్కర్మముల్ వరుసతో నెన్నుట
తొలుతటి సంబంధములు దెలుపుట
తనకుఁ జుట్టఱికంబుఁ దానె కల్పించుట
యిరువురయుపకార మెన్నికొనుట
యన్యోన్యగుణముల నంబిందఁ బొగడుట
మీఁదటిఫలములఁ దాఁ దెలుపుట

తే॥ మంచితనమునఁ గల్పికోల్మాట లాడి
మేను నీవాఁడ నని తను నిచ్చికొనుట
యివియె సామప్రకారంబు లిట్టి వెల్ల
నెఱుకగలరాజు వేర్వేర నెఱుఁగ వలయు ॥ 110

### పంచవిధ సామప్రకారములు

వ॥ ఇట్టి సామప్రకారంబు లన్నియునుం గూడి యైదు విధంబులై యుండు నది యెట్లన్నను పరస్పరోపకార ప్రదర్శనంబును, పరస్పరగుణకీర్తనంబును, బరస్పర సంబంధకథనంబును, నుత్తమ కాలఫలప్రదర్శనంబును, నేను నీవాఁడనని తను నిచ్చికొనుట యనంగా, మఱియు నది ప్రయోగించు తెఱంగెట్లన్నను. 111

### సామప్రయోగవిధానము

తే॥ ఎలమి నిరువురి యుపకార మెంచి మించు
గుణముఁ గొనియాడి సంబంధగణన సేసి
మీఁదటిఫలంబు గనఁబల్కి మీకు నేను
దగు లటనుచును సామోక్తిఁ బలుకవలయు ॥ 112

గీ॥ అరసి బహుమాన మొనరించు నట్టికరణి
నాదరంబునఁ గనుఁగొనునట్టి సరణి
సమ్మృతకణములు చిలుకుచున్నట్లు నేర్పు
కులుకుచుండఁగ సామంబుఁ బలుకవలయు ॥ 113

కం॥ సామంబుగ నిజ మాడుట
ప్రేమం గొనియాడుటయును బ్రియ మాడుటయుం
దా మఱి ప్రార్థన సేయుట
యీమార్గము మనుజపతుల కెఱుఁగఁగవలయున్ ॥ 114

కం॥ నేమమునఁ గార్యసిద్ధికి
సామమె యొనరింప వలయు సకల మగునెడన్
సామమునఁ గార్య మగు నని
ధీమంతులు సంతతంబుఁ దెలిపెదురతనిన్ ॥ 115

కం॥ వరలఁ బరులు మును సామ
స్ఫురణన్ శరనిధి మథించి సుధ మొంది దితిన్
వ్రతతిఁ బమున సామ మొల్లక
సురరాజకుమారు లవనిఁ గూలరె జడులై ॥ 116

వ॥ సామసాధ్యులకు. 117

సీ॥ అలసుని శౌర్యము దలఁగినవానిని
గతునుపాయంబులు చెడినవాని
క్షయముచే వ్యయముచేఁ బయనంబుచేతఁ వా
నెందు సంతాపంబుఁ జెందువాని
బహిరంబులోపలఁ బాటిపోయినవాని
మూర్ఖుని భయమున మునుఁగువానిఁ
బడుచువానిని ధర్మపరుఁడైనవానిని
నతివలయందు ముందైన వాని

గీ॥ చెడుగువానిని నేస్తంబుచేయువాని
మంచిమతిగల్గువాని సాధించవలయు
మంచిమాటలచేత లాలించి యెల్ల
వారిఁ దనవారిగాఁ జేయవలయుఁ బతికి ॥ 118

కం॥ పలుతెఱఁగుల కార్యములకు
నిలలో సాధకములైన యిట్టియుపాయ
మ్ములలో సామమె వేళలు
దెలియుచు నొనరింపవలయు ధీమంతులకున్ ॥ 119

వ॥ దాన ప్రకరణము. 120

సీ॥ అధికంబు మధ్యమం బల్పంబుగా ధన
మిచ్చినట్లనె మళ్ళ నిచ్చుటయును
ఒకసొమ్ము లెవ్వియుం దానియ్యకయె మున్నె
కై కొన్న సమ్మతిఁగని యలరుట
యరుదమై మించినయట్టి పదార్థంబు
లింపు మీఱంగఁ దా నిచ్చుటయును
దా నప్పు లిచ్చిన ధనములు దక్కఁగా
నప్పుణబెట్టి తా నప్పగించు

గీ॥ టన్యులధనంబుఁ గై కొన నడరెనేని
యందులకు సమ్మతించి సహాయుఁడగుట
యిట్టులై దువిధంబుల నెనయుదాన
రీతు లెఱుఁగంగవలయును నృపవరుండు॥ 121

కం॥ ఘూనాథుఁడు లోభముగల
వానిన్ మఱి పేదయైనవాని నెఱుఁగుచున్
దానోపాయముచేతనె
తా నెంతయు వశులఁజేయఁ దగు నెచ్చోటన్ ॥ 122

కం॥ దానవగురుఁ డింద్రునిచే
దానంబున శాంతిఁజెందె ధర నటుగానన్
దానముననె కలహంబులు
మానుపఁగావలయు బుద్ధిమంతుల కెల్లన్ ॥ 123

కం॥ తనయాడుబిడ్డకును ద
న్నొవనరించినఁ జూచి కోప మొదవినశుక్రున్
మును వృషపర్వుఁడు దానం
బున మాన్చెం గాన నదియె ముఖ్యం బెందున్ ॥ 124

కం॥ కలహము మాన్పెడుకొఱకై
బలియున కేపలయుఁ బ్రియముఁ బల్కుచునైనా
నలదుర్యోధనుఁ డీయక
చలమునఁ గులమెల్లఁగూల్చి సమయఁడె వాసుఁ॥ 125

కం॥ జనపతి దానోపాయము
మునుగా సామంబు భేదమును గావింపం
జను దానముచేతను మిం
చినసామము భేద మర్థసిద్ధిం జేయున్॥ 126

ఆ॥వె॥ తృణముపోలె నీవి నెసఁగనిసామంబు
గార్యసిద్ధిచేయఁగాన వెండు
నీవి చూపఁడేని యిల్లాలు దనకైన
చిత్తమంచిమాట బత్తిగనునె॥ 127

వ॥ భేదోపాయప్రకరణము. 128

కం॥ అనురాగంబును నెయ్యం
బును జెఱుచుట చాలఁగినుకఁ బుట్టించుట జం
కెన చూపి తలఁక చేయుట
యన భేదము మూఁడుదెఱఁగులై చెలువొందున్॥ 129

వ॥ భేదోపాయప్రయోగము. 130

కం॥ తనువాని కమ్ముకొనుగతిఁ
దననేర్పులు చాల మెఱసి తా హితచర్యం
దనరుచు నరి భేదింపం
జనుఁ జల్లనయైన నీళ్ళు శైలముఁబోలెన్॥ 131

కం॥ తమవారు శత్రుచే భే
దము నొందక యుండఁ జేసి తా శత్రుల భే
దముఁ జెందఁ జేయవలయున్
సమకొని తమపక్షమునకు శాంతి ఘటిల్లన్॥ 132

వ॥ షష్టినాలుగుం జెఱుంగుల భేద్యులెట్టివా రన్నను విఘునిచేత శీలంబులు చెఱపని లుబ్ధుండును, నవమానంబు చెందిన యభిమానియు, వెఱపింపఁబడిన భీతుండును, గోపింపఁబడిన క్రుద్ధుండును, ననంబరగుచుందురు. తత్ప్రకారంబు గ్రమంబున వివరించెద

సీ॥ ఎపుడిలఁ బెట్టింప నడుగుచుండెడువాఁడు
మిగులంగఁ బేదయై నొగులువాఁడు
పతిచేతఁ జెఱుపఁగాఁబడిన ధర్మంబును
గాపుంచు నర్థంబు గలుగువాఁడు
వెలుపట సౌక్యంబు గలిగినవాఁడును
నధికభోగముఁ గోరునట్టి వాఁడు
వసుధ నెంచఁగ లుబ్ధవర్గమై చనరుచు
రిట్టివారల మార్గ మెల్ల నెఱిఁగి
గీ॥ యర్థములయందు మిగులఁగ నాశఁ గొల్పి
మఱియు నందునఁ దగినట్టి మాట లాడి
భేద మొందించవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు॥ 140

వ॥ అభిమాని ప్రకారంబు. 141

సీ॥ కలహంబుపైఁ గాంక్ష గలిగియుండెడువాఁడు
సాహసవృత్తి నెసంగువాఁడు
ధనముచేఁ గులముచేఁ దనకు నీడైనవాఁ
డెంచ లేఁడంచు గర్వించువాఁడు
పూజార్హుఁడై యుండి పూజనొందని వాఁడు
నేపాటిమాపైన నెడయువాఁడు
పరిగానివానితోఁ బాటిచేసినఁ గోప
మంది సమర్థుఁడై నట్టివాఁడు

గీ॥ ఈసభలో వీరి నభిమాని వర్గ మండ్రు
క్రమముతోడుత వీరిమార్గంబు తెఱిఁగి
ఖేద మొందించవలయును వెంపుఁజూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 142

వ॥ భీరువర్గ ప్రకారంబు 143

సీ॥ పతితోడఁ గోపించి పగఁబెట్టుకొనువాఁడు
పిఱికిదనంబున బెగడువాఁడు
పతిచేతఁ గోపింపఁబడియుండువాఁ డెంచ
నతనిదాయాది యైనట్టివాఁడు
తా నేరముల సేసి తలఁకుచుండెడివాఁడు
గడునప్రియమాడఁ బడినవాఁడు
వెలివేయఁగాఁబడి వెతలఁ జెందినవాఁడు
గణుతింప భీతవర్గం బటండ్రు

గీ॥ వీరిమార్గంబు తెఱిఁగి వివేకి యగుచు
మఱియు నందుకుఁ దగినట్టిమాట లాడి
ఖేద మొందించవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 144

వ॥ క్రుద్ధవర్గ ప్రకారము. 145

సీ॥ ఇయ్యంగఁదగు నర్థ మియ్యక యెంతయుఁ
గాలంబు గడపఁగాఁ గడఁగునతఁడు
నవమాన మొందిన యభిమాని యగువాఁడు
లేనినిందలకు లోనైనవాఁడుఁ

గాలుండై యరికట్టఁగాఁ బడినవాఁడుఁ
విన బంధువుల నొంపఁగనియువాఁడుఁ
గారణంబేమియుఁ గలుగక ధారుణీ
పతిచేత విడువఁగాఁ బడినవాఁడు

గీ॥ వసుధలో నెంచగాఁ గ్రుద్ధవర్గి మిగుడు
రిట్టివారికిఁ గోపంబు లెచ్చఁజేసి
ఖేద మొందింపవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 146

సీ॥ ఆదాయమునకునై వ్యవహారమూనఁగా
గెలిపింతు నని తానె పిలువఁ బంచి
యోడించినను గోప మొందియుండెడు వాఁడు
పనిచేసినని యడ్డపాటుచెంది
మనసులో నెంతయుఁ గనిసియుండెడువాఁడు
పనిగల్గి యరికట్టఁబడినవాఁడు
* (భార్యాధనములఁగోల్పడ్డవాఁడును నాత్మ
దోషంబుచేఁ గడుదుఃఖితుఁడును)

గీ॥ వసుధలో నెంచఁగాఁ గ్రుద్ధవర్గ మిగుడు
రిట్టివారలఁ గోపంబు లెచ్చఁజేసి
ఖేద మొసరింపఁగాఁదగఁ బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 147

ఉ॥ ఈవరుసన్ విరోధియొక నెంతయు భేదముఁజెందఁజేసి తా
నావలవచ్చువారలకు నప్పుడ కోరిన వెల్లనిచ్చి సం
భావనసేయఁగా వలయు మన్ననతోఁ బనయట్టివారలన్
ఘావరుఁ డెంచు భేదమునఁ బొందక యుండ నొసర్పఁగాఁ దగున్

* (                )

భేదోపాయము

కం॥ ఇచ్చుట యోగము చూపుట
మచ్చిక మాటాడుటయును మన్నించుటయున్
హెచ్చినభయము చూపుట
ఎచ్చట భేదంబుసేయునేర్పుల జగతిన్ ॥ 149

కం॥ మును భేదముఁ బొరయింపుము
ఎసయరిసైన్యంబుమీఁద ఎంత మొనర్పన్
దిను దావె పెఱుఁగుమండును
ఘనముగ సుసిపురుష్వు దినినకట్టిడువోదెన్ ॥ 150

కం॥ బలవంతులతోఁ గలహం
బలవడ భేదమున గెలువ నగుఁ జండామ
ర్కుల భేదపఱిచి దివిజులు
గెలుపరె దానవుల నెల్ల క్షితి నుతియింపన్ ॥ 151

వ॥ దండోపాయ ప్రకరణము. 152

కం॥ అలమటఁబెట్టుట చంపుట
కలిగినధనమెల్ల నొడిచి కైకొనుటయుఁగా
నిల దండము మూఁడు దెఱం
గుల వెలయు నటంద్రు నీతికోవిదు లెల్లన్ ॥ 153

వ॥ అందు వధరూపంబగు దండంబు ప్రకాశంబు నప్రకాశంబునని
రెండు దెఱంగులై యుండు నది యెట్లన్నను. 154

కం॥ జగతిని జారులు చోరులు
నగువారిని దనకు శత్రులగువారి నదిం
దగ నెఱిఁగి తాఁ బ్రకాశం
బగు దండ మొనర్పఁ జెల్లు నధిపతి కెందున్ ॥ 155

కం॥ జనుల వెఱపించు నతనిన్
జనులం బాధించునట్టిచనవరి నెంచన్
దను మించు శత్రుఁగూల్పఁగ
దనుపం దగ సప్రకాశదండముచేతన్ ॥ 156

గీ॥ విసము గలిపిన గంధంబు లొసఁగియైనఁ
దగినమారణకర్మమంత్రములనైన
విసముచేనైన నాయుధవితతినైన
నాజ్ఞసేయింపఁదగు రహస్యంబుగాఁగ ॥ 157

ఉ॥ ధరపయి సప్రకాశమగుదండమునన్ వధియింపయోగ్యులౌ
నరులనుపేక్షనైన మఱిన్యాయము దప్పఁగ నయ్యుపేక్షయం
దరయఁగఁదానె కష్టమెయట నప్పుడె పాయక గూఢవృత్తిచే
బరగ నొనర్పఁగాఁదగు నృపాలశిఖామణి నీతిపెంపునన్ ॥ 158

చం॥ యముఁడును బోలి మించి తనచక్కటి కేరికిఁ జేరరాక ని
త్యముఁదనయాజ్ఞ కర్హు లగునట్టిజనంబుల నాజ్ఞసేయఁగా
నపరు నుపేక్షసేయునెడ లెందు నెఱుంగనివాఁడు చోరె ధా
రమణవరేణ్యుఁడుండఁదగు రాజితనీతివిచారచాతురిన్ ॥ 159

కం॥ ఇల జాతిమాత్రులగు వి
ప్రులయెడలన్ ధర్మబుద్ధి పొసఁగినకడజా
తుల (యెడ వధంబు దండము
కలిగింపక మే)లొనర్పఁగాఁ దగుఁ బతికిన్ ॥ 160

కం॥ యమతనయుఁడు బలెఁ బతి దే
శముఁ గాలంబును సహాయసంపద యుత్సా
హము [2](గల్గి దండమున నన
యము రిపుబలమెల్లఁగూల్చు) టర్హము ధాత్రిన్ ॥ 161

[1] (. . . . . ) [2] ( )

కం॥ మండలనాథుల వర్తియు
కుండై భృగురాముఁ డొకఁడె తునిమినగతి భూ
మండలిఁ గలిగినశత్రుల
చెండిగ గెలువంగవలయు ధరణీపతికిన్ ॥ 162

వ॥ మఱి యుండును సామదానంబులచేతను, దానభేదంబులచేతను, భేద దండంబులచేత సాధనంబు క్రమంబున వివరించెద. 163

కం॥ నేరుపున నార్యులై తగు
వా రవమానమున దైవవశమునఁ దనతో
[1] (దూరముగ నెడసినను న
వ్వారిని సామమునఁ దగును వశపఱచుకొనన్) ॥ 164

వ॥ అట్టియార్యు లెట్టివారనిన. 165

కం॥ కులశీల సత్యశౌచం
బులు దానము దయయు ధర్మమును మెఱుఁగన్
[2] (తలఁపున లోభం బనునవి
గలవారలె జగతి) నార్యగణము నుతింపన్ ॥ 166

కం॥ తనయసుజులు తనతనుజులు
తనబంధులు భేదమొంది తను నెడసినచో
టను సామదాన [3](ముల సా
ధన మువితం బట్టి యాప్తతము లెవ్వరికన్) ॥ 167

వ॥ తనయాజ్ఞగతియంతయుం గనుంగొని తమలోనఁ దామెలంగుచు భేదంబును జెందిన దుష్టులగు [4] (వీరు సామాసాధ్యులు గాన దండంబునన సాధింపనగు.) 168

1 ( ) 2 ( ) 3 ( ) 4 ( )

కం॥ సేనాపతులను బిరిఁగల
మానవులను దనదుసీమ మనుమానవులం
దా నొసఁగూర్పఁగ వలయును
దానమునను భేదమునను ధరణీశుఁ డిలన్ ॥ 169

చం॥ కలఁకలు బుట్టఁజేసి తిరుగంబడియుండుకులంబువారి చెం
తల గడినుండురాజుల వనంబుల [1](నుండెడివారి భేదపుం
జెలువున దండవైఖరిని) చిక్కఁగఁజేయఁగ నొప్పునేటువుల్
బలియఁగ నన్యులం దగునుపాయముచేఁ జను పట్టుపెట్టఁగన్ ॥

వ॥ ఇది చతురుపాయస్వరూపంబగు నింక మాయోపేక్షేంద్రజాలంబుల
ప్రకారంబులు క్రమంబున వివరించెద. 171

## మాయాప్రకారము

సీ॥ జనులు కంబములలోపను దేవతాప్రతి
మలలోపలను జొచ్చి మెలఁగుటయును
గాంతాదిరూపముల్ గైకొనుటయు రాత్రు
లందుఁజీఁకటుల మహాద్భుతముగఁ
గౌరవిదయ్యముల బాగున మించుటయును భే
తాళుని చందంబుఁదాల్చుటయును
బులుల నక్కల యెలుఁగుల రూప మొందుట
యివి మనుజులమాయ లెంచి చూడఁ

గీ॥ కామరూపంబుఁబూను టింగలము నంప
కోలలును రాళ్ళు నీళ్ళును గురియుటయును
గాలి గట్లును మొగిలు చీకట్లు గలుగఁ
జేయుచుండుట దేవతామాయ యగును ॥ 172

1 [ . ]

గీ॥ పడఁతిరూపున మును సహ్యాబలునిఁ జంపె
పహిని భీముండు మానవమాయచేత
నలుఁడు ప్రచ్ఛన్నరూపుఁడై కొలిచె దేవ
మాయఁగైకొని ఋతుపర్ణమనుజవిభుని ॥ 173

గీ॥ అవని నన్యాయమును ఘోరవ్యసనములును
నడరుచుండఁ బ్రవర్తించు నట్టివాని
నరసి మాన్పక యుండిన నగు నుపేక్ష
యిదియు మూఁడు దెఱంగులై యిటుల వెలయు ॥ 174

సీ॥ కామాంధుఁడై ముందు గానక గర్వించి
ద్రౌపదిపై కాంక్ష దనరుసింహ
బలుని భీముఁడు రేయి పట్టి వధింపుచో
విరటుఁ డుపేక్షించి విడుచుటయును
మునుపు హిడింబుఁ దా మోహించి భీముని
వరియించి యతనిపై వాంఛఁజేసె
తనతోడఁబుట్టిన దనుజు హిడింబుని
నురక యుపేక్షించి యుండుటయును

గీ॥ ననఁగ నీగతి నన్యాయమైన యెడల
వ్యసనములయెడ జగడంబు వచ్చునెడల
నగు నుపేక్షింపఁ దనవారినైన నెందు
నీతిమార్గం బెఱిగిననృపవరుండు ॥ 175

ఇంద్రజాలప్రకారము

సీ॥ ఘనముగా మాయచే గట్టులు చీఁకట్లు
బెనువాన లగ్నిఁగల్పించుటయును
దవ్వుల నున్నతధ్వజములు గలిగిన
సేనలఁ గన్పడఁ జేయుటయును

మినుకు మొండెముల్ దుండంబులై పడి
పొరిగిన మూఁకలఁ జూపుటయును
నడరి సముద్రంబు లటుముందు కై వడిఁ
బెల్లుఁగా వెల్లిఁ గల్పించుటయును

గీ॥ ననఁగఁగల యింద్రజాలంబు లద్భుతముగ
వైరిరాజులు భయ మందవలసి నేర్పుఁ
దనర నొనరించవలయు నుదారలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 176

గీ॥ దైవమాయా విలాసంబు దడవు నిలుచు
నైంద్రజాల విలాసంబు లెల్ల నపుడె
గానుపించును నామీఁదఁ గానరాక
పోవు నివి దెలియందగు భూమివిభుఁడు ॥ 177

ఉ॥ నీతివిధిజ్ఞుఁడైన ధరణీపతి యీగతి నీయుపాయముల్
చాతురితోడ శత్రువులసైన్యమునందును నాత్మసైన్యమం
దాతతరీతిఁ జేయఁదగు నాగతిగాక యుపాయశూన్యుఁడై
యేతఱి నూరకున్నయెడ నెందును నంధుఁడనంగఁ జెడ్పడుఁ॥

చం॥ అనలములోన నుండి తనరారుసువర్ణము బట్టుకారునం
గొని బిగఁబట్టినందునకు గొబ్బున జారక చిక్కుమాడ్కి శ
త్రునియెడ నున్నసంపదయు రూఢిమెయిందగు నీయుపాయవ
ర్తనమునఁబూనిభూవిభుఁడు దా బిగఁబట్టినఁజిక్కుఁగ్రక్కునన్॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీరుహభక్తినియుక్తమానసో
దారధరాధురావహనదక్షిణ దక్షిణబాహుదండవి
స్తారయశస్సరోవరలసన్నవనీరజకోరకాకృతి
స్ఫారసరోజజాండనయచారవిచక్షణ భద్రలక్షణా ॥ 180

కం॥ విమతహరణార్థయాత్రా
క్రమకౌశల విజయశకునగతినిర్ణయనా
గ్నిపుంలమతి సారపటువి
క్రమ సప్తోపాయచతుర ప్రఖ్యాతజయా ॥ 181

తోటకం॥ పటుధాప్రతిభాభరణాభరణా
పటువాక్చణసజ్జనతాభినుతా
ఘటితాంచితలక్షణలక్ష్యరసో
ద్భట కావ్యకళాకరణాదరణా ॥ 182

గద్యము — ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజసగోత్ర జక్కరాజ యెఱ్ఱనామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు యాత్రాభియోక్తృదర్శనప్రకారంబును, స్కంధావారనివేశనిమిత్తజ్ఞానంబును. సప్తోపాయ వికల్పంబునున్నది సప్తమాశ్వాసము.



# ఆంధ్రకామందకము

## అష్టమాశ్వాసము

కం॥ శ్రీశ్రితమందిర రఘుపతి
విశ్రుతగుణవినుతిచతుర విమలరుచియశో
మిశ్రితలోక సుధీనిక
రాశ్రయ కొండ్రాజువెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### సేనావివరము

ఆ॥వె॥ సామధానభేదసరణులు శాత్రవ
వరులయెడల నడపవలయు వరుస
నందుఁ జిక్కఁగానియపుడు దండోపాయ
శక్తిఁ జూపవలయు జనవిభుండు ॥ 3

చం॥ తనకుఁ బ్రసన్నభావమునఁ దారకలుం గ్రహముల్ చరింపుచో
వినయముతోడ దేవతల విప్రులఁ బూజలుసేసి సంతసం
బెనయఁగ నాఱు చందముల నెన్నికకెక్కుబలంబులం గ్రమం
బున నడపింపుచుం గదలి పోఁదగు భూపతి శత్రుమీఁదటన్॥

### షడ్విధబలప్రకారము

సీ॥ కైజీతమగు మూఁకకంటెను గల్మిలే
ములకు లోనగుప్రాంతమూఁక మేలు
కూటంబుకంటె నెక్కుడు స్వామివశమైన
జీతంబుఁ జెందుకైజీతగాండ్రు

మిత్రసైన్యముకంటె మేలగుఁ దనసీమ
సమసుఖం బొందు కూటములమూఁక
శత్రుసైన్యముకంటె మిత్రసైన్యము మంచి
దేకార్థమతి నెయ్య మొనయుకతన

తే॥వె॥ మిగులఁ జెడుగు లగుచు మెలఁగి నిల్కడలేని
యడవిమూఁకకంటె నరయ మేలు
శత్రుసైన్య మిట్టిచందంబు బలముల
తారతమ్య మెఱుఁగఁ దగు విభుండు॥ 5

వ॥ అది యెట్లనినను మఱియు విభునిచేత సత్కారంబులు చెందుట, యతనియం దనురాగంబు గలిగియుండుట, సహాలాపంబులు గలిగి వర్తించుట, బహుకాలంబుననుండి యతనితోడంగూడి కలిమిలేములకు సుఖదుఃఖంబులకు -లోనైనవారగుటం జేసి ప్రాఁతవారలు కైజీతంబుమూఁకలకంటెను మేలు. ఆసన్నవర్తులై యుండుచుఁ జెప్పినపని జెప్పినట్ల సేయుచుండుకతనను తమ జీవనంబులు భూవిభునియధీనంబులగుటం జేసి కైజీతంపు మూఁక కూటపుమూఁక కంటెను మేలు. సమంబుగా సంతోష రోషంబులం జెందుట విభునకు సుఖంబుగలిగినం దామును సుఖవృత్తిఁజెందుట, యతనిదేశంబుననే నిచ్చలు మెలంగుటం జేసి కూటపుమూఁకలు మిత్రబలంబుకంటెను మేలు. సమంబుగా దేశకాలంబుల నొనఁగూడి వర్తించుట, యిరువురు నేకప్రయోజనంబున నాసక్తిమెలంగుట, పరస్పర స్నేహంబు గలుగుటం జేసి శత్రుబలంబుకంటె మిత్రబలంబు మేలు. స్వభావంబున ధర్మపరులై పరధనంబులయందె లోభంబుగలవారై దుర్జనులై మాటపట్టుఁదప్పెడివారలైన యడవిమూఁకలకంటెను దను గొల్చు శత్రుబలంబులె మే లిదియునుం గాక. 6

సీ॥ అరిబలంబులు మఱి యాటవికులు విభు
సీమఁ దా మెప్పుడు జెఱుతు మంచు
సదను గోరుకయుండునట్టివారగుటను
దండయాత్రలు గల్గుతఱిని దెలిసి
తనవెంట వీరిఁ దోడ్కొని పోవఁగాఁదగు
నటులఁగాకున్న రాజ్యంబు నెల్ల
జెఱుపుచుండుదు రందుచే శత్రువులకును
జయము నిశ్చయ మెట్టి సరవినైన

గీ॥ నదియుఁగాకున్నచో భేదమైనఁ గలుగుఁ
గావునను దండయాత్రలు గదలు నపుడు
వారివెంటనె తోడుకపోవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 7

వ॥ ఇట్టి షడ్విధబలంబుల చందంబు లెఱింగి దండు గదలునప్పుడు విభుండు దనవెంటనేతోడుకపోవువిధం బెట్లనినను తత్ప్రకారంబు క్రమంబున వివరించెద. 8

సీ॥ వ్యయమును దడవును క్షయమును గలయాత్ర
తనమూలబలముతోఁ జనగవలయుఁ
దడవును నాశంబుఁ దగులనియది యైనఁ
గై జీతములతోడఁ గదలవలయు
నరిమూఁక కడుఁగొంచెమై తడ వందని
యెడఁ గూటములతోడ నెత్తవలయుఁ
దనకులోనై ఫలం బొనగూర్చుమిత్రుతో
సమకార్యములయందె చనఁగవలయు

గీ॥ దుర్గములచెంతఁ గంటకాదులకు నెదుర
శత్రుబలములు మున్నుగాఁ జనగవలయు

నరులయూములఁ జొచ్చుచో నడవులందు
నాటవికసేనతోఁ జన నర్హ మంద్రు ॥ 9

వ॥ ప్రాంతమూఁకలకు. 10

సీ॥ కడువేవ యనురక్తి గలిగిన ప్రాంతమూఁ
కలఁజెంది శత్రుండు బలిసి యున్న
నతనికి సమబలంబై యుండునట్లుగా
క్షయము వ్యయంబును జాల నోర్చు
ప్రాంతమూఁకలఁగూడి పైనెత్తఁగాఁ దగుఁ
గడుదూరమగుఁ ద్రోవగలదియైన
దడపువట్టెడు నట్టిదండైనఁ దనచేత
బహుమాన మొందినప్రాంతమూఁక

గీ॥ లిలఁ గడలజెంది యాజికి నిలుచుఁగాన
ప్రాంతమూఁకలె ఘనమైనబలముతోడ
వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 11

సీ॥ తడవు వట్టెడునట్టి దండైన మిగులంగ
దండఁగల్గినయట్టిదండునందు
బలములు బహువిధంబుల నుండు కతమున
వ్యయము క్షయం బోర్వనట్టి కతన
గమనప్రయాసము గల్గినకతమునఁ
దనప్రాంతమూఁకలు దక్క నితర
బలములయం దెల్లఁ గలుగును భేదంబు
లటుగాన నిట్టిచో నన్యమైన

గీ॥ బలము నమ్మక నమ్మిక గలిగి కలిసి
బలిసి వర్తించు ప్రాంతమూఁకలనె కూడి

వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 12

సీ॥ కదనంబులకు నోర్చునట్టి జీతమగుమూఁక
ఘనముగాఁ దనకును గలిగెనేని
తనప్రాంత మూఁక లెంతయుఁ గొంచెమై బల్మి
కొనఁగూడఁగా లేక యుండెనేని
పగతు మూలబలంబు మిగులంగఁ గొంచెమై
చేవయు బలిమియుఁ జెందరేని
యతనిచేఁ గై జీత మందెడి మూఁకయు
నల్పమై యనురాగ మందెనేని

గీ॥ చాలఁ గల్గియు ననిసేయఁ జాలదేని
యపుడు కై జీతమొందు సైన్యంబుఁగూడి
వైరి మీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రా విధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 13

సీ॥ పడుఁదడవందక కనుపట్టు దండైన
నరయ దూరముగాని యట్టిదైన
నెవ్వేళ నమ్మిక నెనసి చేకూడుచుఁ
దనమూఁక భేదంబుఁ గనకయున్న
నసమర్థభావంబు నందుచు నరిరాజు
దన కెందు లోకువై దనరియున్న
నప్రయాసమున మంత్రాజులచే గెల్వ
దనకుఁ గల్గెడు లీలఁ దనరియున్న

గీ॥ క్షయము వ్యయమును మిగులంగఁ గలుగదేని
యపుడు కై జీతమైన సైన్యంబుతోడ

వైరిఁబొడగని దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 14

వ॥ కూటపుమూఁకలకు. 15

సీ॥ కను నదికంబుగాఁ గలిగిన యదియైనఁ
దనవెంటఁ దొడుకపో నొనరెనేని
వెలఁగుచు బడలికల్ చెందని యదియైన
బహుముఖంబులుగాక పరగియున్న
చేరువదండైన చేకొద్దియై కార్య
ఒప్రయాసంబున నగుచునున్న
శత్రుఁడు కొంచెపుసైన్యంబుతో నున్న
నేమరుపాటున నెసఁగియున్న

గీ॥ నెట్టిచోటున మోసంబు నెనయకుండు
జాడఁ గూటపు మూఁకలతోడఁగూడి
వైరిమూఁకల దండెత్త వలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 16

వ॥ మిత్రసైన్యమునకు 17

సీ॥ తనమిత్రసైన్యంబు ఘనమైనయదియైన
ననికిఁ దెచ్చుటకుఁ దా నర్హమైనఁ
దడవుగాకుండెడి దండైనమాత్రంబు
వలననే దాడియుఁ గలహములును
దఱచుగా గలుగక తనకుఁ జేకూడిన
కార్యంబు సమమైనఁ గలుగు ఫలము
మిత్రునధీనమై మెఱసి చేరెడిదైన
నరిసీమ చెఱిపెడు నట్టిదైనఁ

గీ॥ బగఱచేతను గానుకల్ పట్టి మగుడు
నట్టిదైనను మిత్రసైన్యంబుఁ గూడి
వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 18

సీ॥ కుక్కఁ గ్రొవ్వనుఁ బందిక్రొవ్వఁ గోరెడు బోయ
వెసఁగుక్కఁ బందిపై విడిచినట్లు
తనుఁగొల్వవచ్చు శాత్రవులసైన్యంబులఁ
బగవారిపైఁ బోరఁ బంపవలయు
నదిగాక వారు బాహ్యంబైన కోపంబు
సేసినచోఁ దనచేరువలనె
నిలుపఁగాఁ దగుఁ జెంత నిలిచిన నాంతర
కోపంబు బుట్టింప గుట్టు దెలిసి

తే॥ యపుడు గనుమలలోపల నడవులందు
గలుగునల కంటకాదుల గదుమఁ బనిచి
వారిచేతనె నొప్పించవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 19

కం॥ కనుమలఁ గంటకలతులం
బనివడి శోధించునపుడు బరసీమలకుం
జనునప్పు డడవిమూఁకను
దనసేనకు మునుపె పనుపఁ దగు జనపతికిన్ ॥ 20

వ॥ ఇట్లు చెప్పిన షడ్విధబలంబులును రథగజతురగ పదాతులతోడం గూడఁ బ్రత్యేకంబులుగాఁ జతురంగబలంబు లగుచునుండు. కలసన్నాహంబుల నదియ కోశమంత్రంబులతోడంగూడి షడంగంబు లనం బరగుచునుండు, నిట్టిబలంబుల చందంబు

రెన్నియు మనంబున నిశ్చయింపుచు వైరియోధులరీతిం దగినట్లు
ప్రతివ్యూహంబులు గల్పించు విజిగీషువైనరాజు దండయాత్ర
గదలందగు నందు. 21

కం॥ బలముల సేనాపతియును
తెలు వలరగఁ జేయుపనులు జేయని పనులం
దెలియం దగు వారలకుం
గల సన్నాహంబు లెఱుఁగఁగాఁ దగుఁ బతికిన్ ॥ 22

వ॥ దళవాయికి 23

సేనాపతి ప్రభావము

సీ॥ కులజుఁడై తనసీమ నెళవరియై తగి
మంత్రిసమ్మతుఁడునై మంత్ర మెఱిఁగి
దండనీతి యొకింతఁ దప్పక యుండంగఁ
జదివి ప్రయోగించుచంద మెఱిఁగి
నిజము సత్త్వము నోర్పు నిలుకడయును గల్గి
మాధుర్యగుణగణమహిమఁ జెంది,
తనరుప్రభావ ముత్సాహసంపదఁగల్గి
తనుగొల్చువారి కాధార మగుచు

గీ॥ నెందు నధికుల మిత్రుల పొందుఁ గల్గి
చాల దాయాదులును బంధుజనులు గల్గి
యన్నివ్యవహారములు నేర్చి యెన్నఁగలుగు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 24

సీ॥ రాజ్యాంగములకుఁ బురంబువారలకును
సమ్మతుండై మించి చాలఁ జదివి
కారణంబులు లేని కలహంబులకుఁ బోక
కలఁగక శుభకర్మకలితుఁ డగుచు

నెందును మోసంబుఁ జెందక శూరుఁడై
వ్యాధులఁ బొరయక త్యాగియగుచు
కడుమంచిపనిఁబూనఁ గలిగి కాల మెఱింగి
సజ్జను లెల్లను జాల మెచ్చ

గీ॥ విక్రమముచేత నెంతయు వినుతికెక్కి
బడలికల గెల్చి తేరుల భద్రకరుల
సశ్వముల నెక్కునేర్పుల నలరి మించు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి॥ 25

సీ॥ మల్లయుద్ధములందు మఱికైదువులఁజేయు
జగడంబులందును జడుపు లేక
కడువేగదాఁటి పైఁబడెడు పీఁక లెఱింగి
బవరంపునేల చేర్పఱుప నేర్చి
సింహవిక్రమమునఁ జెలఁగి యాలస్యంపుఁ
బనివాఁడుఁగాక కోపంబుఁగలిగి
జాడ్యంబు నొందక చాల నుద్ధతి లేక
యెపుడు జనాంతరం బెఱుఁగ నేర్చి

గీ॥ కరితురగరథచయములఁ గైదువులను
గలుగు లక్షణములు లెస్సఁగా నెఱింగి
చక్కదనమునఁ జెలువొందు చతురుఁడైన
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి॥ 26

సీ॥ షే లెఱుంగఁగ నేర్చి చాలంగ దయఁగల్గి
నేర్పరులను గూడి నేర్పుఁ జెంది
జోదులు ధరియించు జోక లెల్ల నెఱింగి
యన్ని యుద్ధమ్ముల యను వెఱింగి

జగడంపు సవరణచందంబు లెఱుఁగుచుఁ
గరులచిత్తంబులు సపులమనసు
హయముల హృదయంబు లసువాంఛ నెఱుఁగుచు
వానిగుర్తులఁ బేరుపరుస నెఱిఁగి

గీ॥ వానిబనిగొను నేర్పులు దా నెఱింగి
సకలదేశస్వభావముల్ సకలరిపులు
సకలభాషల నెఱుఁగుచు సరసుఁడైన
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 27

సీ॥ మఱపును వెఱపును మది నెఱుంగక రేయిఁ
జరియింపఁగా నేర్చి శకునగతుల
పరవులు దెలిసి నక్షత్రగ్రహంబుల
యస్తమయం బుదయంబు నెఱిఁగి
దిక్కులు దేశముల్ దెఱువులు నెఱుఁగుచు
వాని నెఱింగిన వారి నేలి
యధికభయార్తుల కభయంబు లిచ్చి
గాలికి వాన కాఁకలికి నోర్చి

గీ॥ దప్పిదగలకు నెండకుఁ దాళఁగలిగి
మిగుల దూరంబు పయనముల్ మెలఁగ నొప్పి
పరులమూఁకలఁ జీకాకు పఱుప నేర్చు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 28

సీ॥ కడు నసాధ్యంబులై కనుపట్టు పనులైన
సాధించునేర్పు నిశ్చయముఁగల్గి
తనమూఁక విఱిగిన ననికి నిల్వఁగ నేర్చి
గగ్గోలు జగడంబుగతు లెఱింగి

బలముఁ గావించు పను లెఱుంగఁగ నేర్చి
పురల మాతలచర్య లరయ నేర్చి
ఘనమైనయుద్యోగ మొనరించి వేగమె
యందు ఫలంబులఁ జెంద నేర్చి
గీ॥ పట్టి యీ దేర్చుకొనునట్టి పనులు గల్గి
యటుల మెలఁగెడువారల నరసి నిలిపి
పరిభవంబైనయెడఁ గ్లేశపడక యుండు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 29

తే॥వె॥ ఇట్టి లక్షణముల నెంతయుఁ జెలువొంది
పతిహితంబునందె భక్తి గల్గి
చెలఁగు సంపదలను జేకూర్చు ఘను దళ
వాయిఁ జేయ మెలపవలయుఁ బతికి ॥ 30

వం॥ ఎడయక రాత్రులుం బవలు నెవ్వరికందళవాయి యోధులం
వడవులఁ గొండలం గడు భయంకరమైతగు దుర్గసీమఁ బ
ల్లడపడకుండునట్లుగ బలంబుల వ్యూహమొనర్చి తానె యొ
క్కడుజతనంబునన్ మెలఁగి కూడుచు సేనలఁగావఁగాఁ వలెన్

## ప్రయాణ వ్యసనరక్షణ ప్రకరణము

సీ॥ మేటియౌనొకదొర మిక్కిలి శౌర్యంబు
గలమూఁకతో ముందుఁగదలవలయు
రమణీసమూహంబు రాజుభండారంబు
చదలంబునడుముగాఁ జనగవలయు
వానికి రెండుపార్శ్వములందు హయములు
హయములపజ్జల నరదములును
వానిపార్శ్వంబుల నేనుగుల్ వానిపా
ర్శ్వంబుల గదియంగ వనబలంబు

గీ॥ అరుగవలయును వీరల కన్నిటికిని
వెనుక దిశవాయి బడలినజనముఁ దేర్చి
కొనుచు నాయత్తపాటుతోఁ జనఁగఁ జేయ
వలయు దండెత్తునట్టి భూవల్లభుండు ॥ 32

సీ॥ భయము ముందర గల్గఁ బయిమకరవ్యూహ
మునసైన జెక్కులు దనర విచ్చి
రహి మించునట్టి గృధ్రవ్యూహమునసైన
వీరముఖంబైన తీరుబడిన
సూచికావ్యూహంబు సూటిచేసైనను
బలముల నడిపింప వలయుఁ [illegible]
భయము పిఱుందనౌ పట్టున శకటరూ
పంబునమఱి పార్శ్వభయములందు

గీ॥ నలరు వజ్రాయుధమురీతి నన్నిదిశల
భయము గల్గిన సర్వతోభద్రరీతి
బలము వ్యూహంబుగాఁ బన్ని బలవిభుండు
నడువగాఁ జేయవలయు యత్నంబుతోడ ॥ 33

వ॥ బలప్రయాణ వ్యసనములకు. 34

సీ॥ గుహలందు నెఱులందుఁ గొండల నదిత్రోవ
నడవుల నిఱుకటమైన యెడల
బడలిన నాకొన్నఁ గడు దప్పిఁజెందినఁ
గఱవుచేఁ దెవులుచేఁ గలిగియున్న
దొంగలు మాఱియుఁ దోలుక తిరిగిన
నడుసు నీళ్ళను ధూళి యలముకొనినఁ
జెదరిన సందడిఁ జెందిన నిద్దుర
నందినయెడఁ గూడి హాళినున్న

గీ॥ కొంచెమైనను సవరణ గూడకున్న
గాలివానల నగ్నులఁదూలియున్నఁ
దనదు సైన్యంబు రక్షించుకొనఁగవలయు
శత్రుసైన్యంబు లటులున్న జడుపవలయు ॥ 35

గీ॥ దేశకాలవిశేషముల్ దెలిసి యరుల
బలము భేదంబు నందించి బలసి చెలఁగు
బలియునకుఁ గూటయుద్ధంబు గలుగదేని
యేయెడఁ బ్రకాశయుద్ధంబు చేయవలయు ॥ 36

కం॥ అడవులు గనుపలు మొదలగుఁ
గమి నిఱుకటమైనచోట్లఁ గళవళపడుచుం
డెడి శత్రుఁ దునుమ వలయును
విడువక గగ్గోలువడెడి వేళలయందున్ ॥ 37

కూటయుద్ధ ప్రకారము

సీ॥ అహితుండు పోట్లాడ ననువైనచోటుఁ దాఁ
గైకొని యచ్చోటఁ గదలకున్న
నతనిమంత్రులు మొదలయిన వారల భేద
మొందించి యచ్చోట నునికిఁ జెఱచి
యైన నాటవికసైన్యంబు పేరిటిత్రాళ్ళ
చేఁ జుట్టి పోరికిఁ జెదరఁదీసి
తనమూఁక విఱిగిన యనువున నలయించు
కొనివచ్చి యొక యిఱుకునకుఁ దెచ్చి

గీ॥ వలనెఱుఁగు వీరభటులకు సెలవుఁ బెట్టి
చేరి చుట్టుక జగడంబు చేసియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁగూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 38

సీ॥ జనపతిముందరఁ గనుపట్టుగా నిల్చి
తన కెడ రెక్కశాత్రవునిమీఁద
వెనుకచక్కికి మేటివీరయోధుల నంపి
పొడిపించి క్రుక్కించి కెడపియైనఁ
గాక పిఱిందిభాగంబున మొనసూపి
ముందర నలయించి మొత్తియైన
సికటి ప్రక్కఁ దా నెదిరించి శూరుల
నవ్వలి ప్రక్కది క్కంపియైన

గీ॥ నటుల నవ్వలిపార్శ్వంబులందు మొనపి
యివ్వలికి శూరతతి నంపి యెంచియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 39

సీ॥ మునుచక్కి విషమమై మొనుపరాకుండిన
వెనుకటిదిక్కునఁ జెనకియైన
వెనుచక్కి మునుచక్కి మొనుపరాకుండినఁ
దొడరి ప్రక్కలఁజేరి పొడచియైన
నదిగాక మఱి తన యడవిమూఁకల శత్రు
బలముల దూష్యులఁ బనిచి మొదఁ
జగడంబు చేయించి మిగులఁ దా బడలించి
సన్నమై కూఁతలు సడలియున్న

గీ॥ వైరితతిమీఁదఁ బడుచును వాహనములు
గలఁగఁ దనరౌతులను బంపి కడిమియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 40

సీ॥ మిూష్యల సరిమూఁకఁ దొలుదొల్త నళికించి
విఱిగి రా నళికించి విఱిగి రనుచు
విశ్వాసమునఁజెంది విమతు నేమరినచోఁ
దనయు బల్మి చెలంగఁ దరిమియైనఁ
బాఱంబు దిగుచోటఁ బట్టణంబులచోటఁ
బైరుల నూళ్ళను బ్రజలయందు
గొల్లకాసులుచూపి గొల్లలు చాలఁగాఁ
బట్టినచోఁ జుట్టు ముట్టియైన

గీ॥ వేఁటలాడంగ నడవికి వెడలి బడలి
యుండుతఱిఁ జుట్టు ముట్టి చెండియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁగూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 41

సీ॥ మునుపుగా నొకకొద్ది మూఁకల మొనసేసి
కడు గట్టి మూఁకలకడను దాఁచ
నరిమూఁక సరకుసేయక మీఱి గర్వించి
తనమూఁకపైఁ బేర్చి యని యొసర్ప
మునుపు తాదాఁచిన మూకఁచే శత్రులఁ
జేరి చుట్టుక నొంపఁజేసి యైన
నదిగాక పగవారి యావులఁ బట్టించి
వార లందుకుఁగూయవచ్చుచోట

గీ॥ నడుమతెరువున నరికట్టి నడికియుండి
కడిమిమై చుట్టుముట్టుక పొడిచియైనఁ
గూటయుద్ధంబుచే శత్రులఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 42

సీ॥ నగ్గోంపే ధీతిగలిగి రాత్రులయందు
నిద్రఁగానక పగల్ నిద్రఁ జెంది
ములపె వేమఱినచో నదరిపాటునసైనఁ
బగ లెల్ల నాయత్తపాటు చెంది
బడలినచోట మాపటిజామునందైన
నడురేయిఁగదు నిద్ర దొడరువేళ
రేతిరిజగడంబు రీతి దానెఱుఁగుచుఁ
బలుజోళ్ళ కొమ్ముకత్తులను గల్గి

గీ॥ చపలచేనైన వేగంబు గలిగినట్టి
హారతతిచేతనైనను జుట్టుముట్టి
కూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 13

సీ॥ ఎండకుగాలికి నెదురెక్కి కనుమోడ్చి
సుడివడి తడఁబడుచోటనైన
నదిగాక క్షుద్రంబు లగునట్టియడవుల
మంచున మబ్బుల మలలఁ బొదల
వాఁగుల స్రవంతులఁ దీఁగెల గుంతల
జాల నేఱులను బోరానియిఱుకు
తెరవుల నరికట్టి తిరుగువారుచునైన
మిగులఁ దా నచ్ఛిద్రుఁ డగుచు నుండి

గీ॥ యదనుఁ జేకొని పైఁబడి చదిపి యైనఁ
బదరి తనమూఁక బడలిక పడఁగనీక
కూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 14

గీ॥ ప్రాణములయందుఁ గడు నాసపాటు లేక
విఱిగిఁ లజ్జించి తిరిగిన వీరవరుఁడు
మొక్కలంబునఁ బైఁబడి మొత్తఁగాన
మిగులవిఱిగినఁ బఱుమగాఁ దగదు పతికి ॥ 45

గీ॥ ఇటులఁ గపటంబు జగడంబు లెఱిఁగెనేని
గడు ననాయాసమున గెల్వ గల్గుచుండుఁ
గాన భూమీశుఁడగువాఁడు గపటయుద్ధ
సరణిచేతనే శత్రులఁ జమపవలయు ॥ 46

వ॥ క్షయస్థాన వృద్ధులకు. 47

కం॥ వెచ్చము నాయము సమమై
వచ్చిన స్థానంబు మఱియు వ్యయ మధికంబై
వచ్చిన క్షయ మం దాయమె
హెచ్చిన నది వృద్ధి దీని నెఱుఁగఁగ వలయున్ ॥ 48

మ॥ దొరయుత్సాహము గల్గి మోసగతులెందుం జెందఁగా నీక యే
సరణిన్ వైరుల గెల్చునట్లు రిపులన్ సాధింతు నన్ శంకఁదా
నిరతంబున్ మది నిల్పి చారతతిచే నేర్పుల్ వగన్ శత్రులం
దరయంగాఁదగు సర్వకార్యములు నూహాపోహసన్నాహియై॥ 49

ఉ॥ మోసపుపోరిచే రిపులమూఁక నవశ్యము నొంచఁగా నగున్
వేసటలేకయుండుపృథివీపతి యీగతి శత్రు గెల్చుటల్
దోసముగాదు మున్నిటుల ద్రోణసుతుండును ద్రౌపదేయులం
ద్రాసముఁ బూని యేమఱినపట్టున నొంపఁడె నిద్రవేళలన్ ॥ 50

## చతురంగబల ప్రయోజన ప్రకారము-గజకర్మ

సీ॥ దండయాత్రలను ముందరఁగాఁగ నడచుట
వనదుర్గములు చొచ్చి చనుట మఱియుఁ
దెఱువులు లేనిచోఁ దెఱువులు వెట్టుట
కొలఁకుల నదుల లోఁతులను దెలిసి
బలుప్రవాహంబుల జలముఁ దాటించుట
యసహాయగతి జయ మందుటయును
జొరరాని మూఁకలఁ జొచ్చి భేదించుట
పేర్చి వేఁగినమూఁకఁ గూర్చికొనుట

గీ॥ పొడవుల వెఱపుచూపుట పొడవులైన
కోటలును గోటవాకిళ్ళు గూల్చుటయును
జాల భండారములు మోవఁ జాలుటయును
భయము దీర్చుట గజముల పను లటండ్రు ॥ 51

## రథకర్మ

కం॥ తనసేనల రక్షించుట
యనిఁ జెదరినఁ గూర్చికొనుట యరిసేనలు దా
కొనియుండిన భేదించుట
యును నరికట్టుటయు రథము లొనరించుపనుల్ ॥ 52

## అశ్వకర్మ

సీ॥ కొండలదండ దిక్కుల మార్గములయందు
విమతులమూఁకల వెదకుటయును
ధాన్యాదులను మిత్రతతుల రాఁ జేయుట
వేగంపుఁబనులు గావించుటయును

[illegible]ల వెంటాడుట తిరుగుచో ఎఱుగుట
ఎఱిగియుఁ గ్రమ్మఱ వెంటఁబఱుట
మునుపక్కి నడుచక్కి వెనుచక్కిఁ బ్రక్కల
పొదివి పొంకమెఱింగి పొడుచుటయును

గీ॥ వైరి యచ్చాళపై మీఱి పోర జుణిఁగి
పోయి పాశెంబుపైఁబడి పొడుచుటయును
గీసు బసువారిఁ దోడ్కొని తెచ్చుటయును
వాడివెడలుట గుఱ్ఱపుదళముపనులు ॥ 53

పదాతికర్మ

సీ॥ ఎపుడుఁ గైదువులు దా మేమఱకుండుట
త్రోవల బావుల రేవులందు
నేఱుల విడిదలయెడఁ గపటంబులు
దెలియుచుఁ దిరిగి శోధించుటయును
తృణకాష్ఠజలములు దెచ్చుచోటులయందు
మిగుల నెచ్చరికతో మెలఁగుటయును
రేలును బగలు భూపాలుఁ గాపాడుట
చెప్పిన యట్లనె చేయుటయును

గీ॥ నివియ మొదలుగఁ గలిగిన యిట్టి వెల్ల
బలము లొనరించు పను లంద్రు తెలిసి చూడ
నిటులఁ జతురంగములపను లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 54

సీ॥ మంచిజాతియుఁ బరిమాణంబు వేగంబు
స్థానంబు వయసును సర్వములును
విలుకడ పనులందు నేర్పును దేజంబు
చెప్పినకై వడిఁ జేయుటయును

మనతయు భద్రలక్షణముల నాయువుఁ
గలిగి యెన్నికమీఱ మెలఁగుటయును
సద్గుణంబులు నేనుఁగులకును మఱియును
గాలిమందికిని లక్షణములెండు

గీ॥ నిట్టి బలముల లక్షణం బెఱిఁగి యెపుడు
వాని వానిఁ జేయఁగా నలయు పనుల
యందు నియమింపఁగాఁ దగు హరువు తెలిఁగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 55

వ॥ చతురంగ బలముల నేలలకు. 56

గీ॥ గంటలను మిట్టలను జెట్ల గొప్పతాళ్ళఁ
బుట్టలను మోటుచెట్టులు బొవలుగల్గి
మెలఁగఁగా వచ్చి ముండులు గలుగదేని
కాలిమూఁకల ననిసేయు నేల యండ్రు ॥ 57

వాజిభూమి

కం॥ జలమును నడుసును నెఱియలు
గలుగక మ్రాకులును జాలుఁగడు రేక సుస్థ-
స్థలమై మెలఁగఁగ వచ్చుచు
నలరిన గుఱ్ఱములనేల యగు నండ్రుబుధుల్ ॥ 58

రథభూమి

సీ॥ ఇసుకలు మొద్దులు నెందెందె యుండక
బలుగుండ్లు నడుసు గుంటలును లేక
చేలును మళ్ళును జెట్లుఁ దీగలు లేక
గుంతలుఁ బొదలు వాఁగులును లేక

నెఱియుఁ నొడ్డులు బొఱియ లేమియు నేఁ
    పడి దాఁట గొరిసెతాఁకుడుల కోర్చి
కడుగట్టియై బండికండులు గలఁగక
    చదరమై మిగుల విశాల మగుచు
గీ॥ నేలఁ మగుడంగఁ దగునట్టినేలలందు
సరవములు జగడముసేయ నమరుచుండు
నట్టిజగడంపునేలల నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 59

నాగభూమి

సీ॥ తివిచివేయఁగవచ్చుతీవియల్ గలయది
    పట్టి విఱువవచ్చుచెట్టు గలది
యిసుకలు నసలును నెసఁగనియదియును
    నేనల కెందు రాఁబోనియదియు
ఘనములై కనుపట్టు గట్టులు గలయది
    కడు గుంట మిట్టలు గలుగునదియు
గలయంగ నుడుగువేరులుగలయదియును
    ననిసేయఁ గరులకు నర్హమైన
గీ॥ నేల యదిగాక యెటువంటి నేలయైనఁ
గరుల కసు వాని కెందు నగమ్యభూమి
గలుగకుండుట గాదె నాగంబు లయ్యె
నిట్టిభూముల నరవరుఁ డెఱుఁగవలయు ॥ 60

సీ॥ అనిమొన విఱిగినయశ్వాదిబలముల
    నిలుపఁగా నోపుచు బలము రాజు
వెనుకదిక్కునందు నిల్చిన ప్రతిగ్రహ మంచు
    రదియు నిన్నొఱువిండ్లంతదవ్వు

గలిగిన వెనుకక్కై నలుకడగా నిల్చి
జగడంబు సేయింప జయము గల్గు
నటువలె రేకయు యనిసేయు సేబలం
బదిమూ పెంగినబలం బనఁగఁ బరఁగు

గీ॥ ఇట్లు గావున జగడంబు తెలుఁగురాజు
వెనుకదిక్కునఁ దా నిల్చి విఱిగి వచ్చు
వారిఁ గడు నాదుకొని నిల్పవలయు నెంచి
వెనుక నవిలేక పోరు గావింపరాదు॥ 61

దానకల్పన ప్రకరణము

మ॥ నరి యూథంబుల మీఁదఁ బెట్టుకొని వేగం బొప్పురేడీల నం
దరయ న్నగ్గడఁ గావుగా నిలిపి యోగ్యంబైన యుద్ధంబుతో
నరనాథుం డెట నిల్చు నచ్చటనె భండారంబులు న్నిల్పఁగాఁ
బరగుం రాచజికంబు నెల్ప నదిగా భండారమెంచుం ధరిం॥

కం॥ కొలుదొలుతఁ బొడిచి గెలిచిన
భళి భళి యని పిలిచి యొసఁగఁ బతి పొంపుగన్
గలిగిన నెవ్వఁడు బొడువఁడు
చలమునఁ బైకుఱికి శత్రుసంఘముల నిలన్॥ 63

సీ॥ పోరిలోఁ బగరాజుఁ బొడిచినవానికి
దాక్షిణ్య మొనరఁగా లక్షసంఖ్య
నతనికుమారుని నతనిసేనాపతి
నైనఁ జంపినవాని కందునగము
శత్రుసేనలలోన సన్నుతి కెక్కిన
వీరుఁ జంపినఁ బదివేలమాళ్ళు
పోటేనుఁగను గడు మేటిప్రధానుని
నవిఁ గూల్చునతనికి నయిదువేలు

గీ॥ సహితుఁ బనవరినైనను హయమునైన
వెనుకఁ దియ్యక చంపిన వెయ్యిమాళ్ళు
బంటుతలఁగొట్టి తెచ్చిన బంటునకును
ఒరి యొసంగఁగఁదగు రెండు పదులమాళ్ళ ॥ 64

కం॥ పరబలముల కెదిరింపుమి
సుఁపవడి శౌర్యంబుఁజూపు యోధుల రెంటఁ
నరపరుఁ డినుమడి జీతం
బరయుచుఁ దా నియ్యవలయు నందఱు మెచ్చన్ ॥ 65

గీ॥ ధరణినాథుల కర్హమై తగినయట్టి
కరితురంగాదివస్తువుల్ గాక యన్య
వస్తువుల నాజి గెల్చి యెవ్వార లెందు
నేమి దెచ్చినఁ బతి వారి కియ్యవలయు ॥ 66

కం॥ అనిలోన గెలిచి వచ్చిన
తనభటులకుఁ దగిన వస్తుతతి నొసఁగుచు నె
మ్మనముల సంతోషమ్ములఁ
గనఁ జేయఁగవలయు ధరణికాంతుం డెపుడున్ ॥ 67

## వ్యూహవికల్ప ప్రకరణము

వ॥ బారులు తీర్చుటకు, 68

సీ॥ మొనకు ముందఱ విలుమూఁకల నిల్పుచో
బారులసందున వారలకును
ధనువంతనేల యంతయ నెడఁగా నిల్పి
యచటికి మూఁడు విండ్లంతనేల

(ఒండొంటికిని నెడ నొప్పునట్టుల గుఱ్ఱ
ములబారు నిల్పఁగావలయు వాని)
వెనుక నేనుఁగుబారులను నిల్పఁగాఁ బగ
వానికి వెనుచక్కి వరుసతోడ
గీ॥ ఇటుల నరదంబు బారుల నమర నిల్ప
నగు నెనుబ్రాని మనఁగ నీ యవనిలోన
నైన మహారథపౌఢవగు నది యెఱింగి
వాడు నెటు తీర్పవలయు భూపాలవరుఁడు ॥ 69

సీ॥ ఇట్టి బారులలోన నెడనెడ విలుకాండ్ర
కును వాజులకు నేనుఁగులకు మఱియు
నరదంబులకును పార్శ్వాంతర భూముల
క్రమ మొప్పుచుండు నొక్కటియు మూఁడు
నైన నైదగు సంఖ్య నమరిన శమముల
యంతదవ్వుల నిల్చి యర్హ మొందు
నట్టి శమంబును నమరఁ జతుర్దశాం
గుళసంఖ్య ధరణిలోఁ దెలిసి చూడ
గీ॥ నిన్నియు నెఱింగి బారుల నిటులఁదీర్చి
పోర్వగాఁదగు నిదిగాక పోరఁ దనకు
నెటులఁ బొంకంబునందడి యెనఁగ దెటులఁ
జేరువగు నెటు లటులైనఁ బోరవలయు ॥ 70

## వ్యూహరచనా ప్రకారము

వ॥ మఱియు బలంబులు దొట్రుకొనకయుండ ననేక ప్రకారంబు లెఱింగి వ్యూహంబులు బన్ని జగడంబు వేయించవలయు నవ్విధం బెట్లనిన గజానీకంబును, రథానీకంబును, మిశ్రానీకంబు

* [ .. ]

నన ననీకంబులు మూఁడు దెఱంగులై యుండు నందు గజంబుు తొమ్మిదియును, నందొక్క గజంబునకు ముందర జగడంబు సేయు గుఱ్ఱంబు లేనింటిచొప్పున నలువదియైదు గుఱ్ఱంబులును నందొక్క గుఱ్ఱంబునకు ముందర జగడంబుసేయు వీరభటుల ముగ్గురి లెక్కను నూటముప్పదియైదుగురు వీరభటులును నిట్లు పాదసంరక్షణార్థంబు పార్శ్వంబులయందుఁ గాచికొనియుండు గుఱ్ఱంబులు నలువదియైదును, వీరభటులు నూటముప్పదియైదు గురునుం గూడి తొమ్మిది గజంబులును, డొంబది గుఱ్ఱంబులును నిన్నూటడెబ్బది సంఖ్యగల వీరభటులునుం గలయది గజానీకం బనం బగు, నీ ప్రకారంబునఁ దొమ్మిది రథంబులును, డొంబది గుఱ్ఱంబులును, నిన్నూటడెబ్బది సంఖ్యగల వీరభటులునుం గల యది రథానీకం బనం దగు. తొలుదొల్త వీరభటులును, వారల వెనుక గుఱ్ఱంబులును వాని పిఱుంద రథంబులును, వాని వెనుచక్కి నేనుంగులునుం గలయది మిశ్రానీకం బన నొప్పు నిట్టి యనీకసమూహంబె వ్యూహం బనం బరఁగు, నదియు దండవ్యూహంబును, భోగవ్యూహంబును, మండలవ్యూహంబును నసంహతివ్యూహంబును నన నాలుగు దెఱంగులై యుండు.మఱియు నేతద్భేదంబులైన వ్యూహంబు లనేకంబులు గల వది యెఱింగి వ్యూహంబులు సన్నునపు డనీకానీకమధ్యంబున నై దేసి విండ్లంత దవ్వుగలుగఁ బన్నవలయు, నం దసంహృతవ్యూహంబున ననీకంబులు దూరంబున నిల్చునట్లుగాఁ బన్నవలయు, నిట్టి వ్యూహంబునకు శుక్రమతంబువార లురోభాగం బొకండును బార్శ్వభాగంబులు రెండును, మధ్యపుచ్ఛభాగంబులు రెండునుం గూడి పంచాంగంబులుంగలవందురందునకుఁ దనకుంగల బలంబు మూఁడుపాళ్ళుగ నేర్పఱచి యురోభాగంబున నొకపాలును, బార్శ్వభాగంబుల నొకపాలును, మధ్యపుచ్ఛభాగంబుల నొక

పాలునుంగా నెఱపవలయునండ్రు మఱియుఁ గొన్నిమతంబుల వార లీ పంచాంగవ్యూహంబునకే యంగంబున కొక్కొక్క యనీకంబు లెక్క ననీకంబులై దింటికి ముందర జగడంబుసేయు వార లాఱునూట డెబ్బదియైదుగురు వీరభటులును, నిన్నూఱు యిరువదియైదు గుఱ్ఱంబులును, నలువదియైదేనుంగులును నిట్టివె పాదసంరక్షణార్థబలంబునుంగూడి వేయినిన్నూఱు నేబదిసంఖ్య గల వీరభటులును, నిన్నూటయేబది గుఱ్ఱంబులును, దొంబది యేనుంగులునుం గలిగి యుండవలయు నండ్రు. వెండియు బృహస్పతిమతంబు వార లీ పంచాంగవ్యూహంబునకే కక్షభాగంబులు రెండునుంగూడి సప్తాంగంబులం బ్రవర్తిల్లసంఘటింపునకుం గల బలంబు నాలుగుపాళ్ళొనరించి యురోభాగంబుల నొకపాలును, గక్షభాగంబుల నొకపాలును, పార్శ్వభాగంబుల నొకపాలును, మధ్యపుచ్ఛభాగంబుల నొకపాలునుంగాఁ బన్ని జగడంబు సేయించవలయు నండ్రందు. 71

సీ॥ తమలోనఁ దాము సందడిపడి కలయక
యని యొనర్పఁగఁ దగు నదియుఁ గాక
కలిసి పోరాడ సంకుల సమరం బగు
నట్టి సందడికయ్యమందు నెల్లఁ
దమయేనుఁగుల దండఁ దాఁగొని జగడంబు
సేయఁగావలయు నజేయలీలఁ
దమమూఁకమీఁద గుఱ్ఱములు పైకొన్నచో
నొండొరుల్ చెదరకయుండి పోర

గీ॥ వలయు బాణంబులును దుపాకులును విండ్లు
మూఁక ముందర నిడికొని మొనకు నడచి
యెట్టి మూఁకలు బైకొన్న నట్టిమూఁక
చేతఁ బోరింపవలయును క్షితివరుండు॥ 72

## ప్రకాశ యుద్ధ ప్రకరణము

వ॥ సేనాంగాలకుఁ బ్రత్యేకనాయకులకు, 73

ఉ॥ కులమున మించువారిఁ దమపం దగువారై తగువారిఁ బోరిలో
నలవడి తత్ప్రతిక్రియల నన్నియుఁ జేయ నెఱుంగువారిఁ గ్రొ
వ్వల దమయూఁకఁ గావఁ గలవారల నేనుఁగు లాదియైన యూఁ
కలకును వేఱువేఱ నధికారులఁగా నియమింపఁగాఁ దగున్॥ 74

కం॥ ఈరీతి వ్యూహములుగా
నేర్పుతోఁ బన్నినట్టి నిజబలములచే
వైరిబలంబుల మీఱి వి
దారింపఁగవలయుఁ గదిసి దళవాయిలగన్ ॥ 75

కం॥ బలిమిగల వైరిబలముల
బల మినుమడి గలిగినట్టిబలములచేతన్
గెలుపఁదగుఁ దెలిపి చూపని
బలముల నేనుఁగులఁ బఱపి పఱపఁగవలయున్ ॥ 76

### గజబలప్రశంస

లయగ్రాహి॥ మెండగు జిరాయిరముదండ బలుకేడెములు
నిండుకొను గుమ్మలను పండితలరాణున్
గండమర బూనుచుఁ బ్రచండమదమత్తులగు
దండిమగ చేమఱక ఖండనములో ను
ద్దండగతి లోహమయదండములు బూనుకొని
నిండుసమజోకఁదగుచుండు పరసేనం
జెండఁ జనునందుఁ గలగుంపుపడ వాద్యముల
డిండిమ డిమండిమ డిపండిమ లెసంగన్ ॥ 77

చం॥ ఘంటలు మహాపటిమ మొనగాలునఁగేలున నంకుశంబునన్
ఎసఁ బరిగొల్పఁ బొంతము ముదంబునఁ జూపుచు వాలమెత్తుచున్
గనుగవయుం జెవుల్ నిగుడఁగాఁ ఎనసేన నెఱింగి శత్రుసే
న నెదురువాడి గెల్పు నరనాదున కిచ్చుఁగదా గజం బనిన్॥ 78

ఉ॥ ఏటఁగఁ జిప్పచోనె పసియించును శ్రీహరిరాజ సంచితం
బేసఁగఁ బౌఁజుగల్గుదొర యేమిట నోటమిఁ జెందఁ డెట్టిపోఁ
గాని మదేభయూధ మధికంబుగఁ గొల్వఁగ దంతి నెక్కినం
బ్రాణముతోడి దుర్గము నృపాలకుఁ డెక్కిన యట్ల పోరిలోన్॥

చం॥ తొడవు ధనుప్రదేశముల దుర్గములై వడిఁ బాఱు నేఱులన్
గడవఁగ నోడలై రణముఖంబున రాక్షసులై ప్రయాణముల్
వెడల గృహంబులై మనసు మెచ్చఁగఁ జూడను గారణంబులై
పడుపుద మెప్పు సేయఁ గవి హా జయసాధనముల్ దలంపఁగన్॥

చం॥ బలిమి మదించినం గటని భద్రగజంబుల రాజు శత్రుమూఁ
కల సుబపాడి చెందుగఁ గకాపికచేసి జయించు నేనుఁగుల్
బలువుగ గల్గినన్ జయము ప్రాఁతియె కావున వానిఁ బ్రోవఁగా
వలయు నృపాలశేఖరుఁ డవశ్యముఁ దా జయలక్ష్మి బొంచఁగన్॥

సీ॥ పొగడపువ్వులతావి పోదివి ఘుగుల్కొన
వెదజల్లు సంతతమదముఁగల్గి
తేనెవన్నియ గల్గి దీప్తమై పొడవులై
వలుదలై పొలుచు కొమ్ములును గల్గి
పొరయుచు సమములౌ తుంటి దిక్కులుగల్గి
యొద్దికై కూడి పెన్నుద్దు లనఁగ
బెరయుచుండెడునట్టి బృంహితస్వనములు
సమములైనట్టి యంగములుగల్గి

గీ॥ సకలశుభలక్షణంబులు చక్కఁదనము
చెలువు గంభీరగమనము గలిగినట్టి
భద్రగజముల నేలుభూపాలకుండు
సకలసంపదఁ జెంపొందు జనులు పొగడ ॥ 82

చం॥ గజములు గల్గు భూవిభుఁడు గా నొకదిక్కున గాక యెల్లెడో
గజములు గల్గువాఁడు ధరఁగల్గడు కావున దంతికోటులన్
గజముల లీల సత్త్వములఁ గన్నడు బంటులఁ జాల నేసినన్
విజయము తేజమున్ సిరులు విశ్రుతకీర్తులు గల్గు భర్తకున్ ॥

రథబల ప్రశంస

ఉ॥ హారతగల్గు సారథులు చొక్కపు తేజులు కింకిణీఝణ
త్కారమహారవంబు బిరుదధ్వజకోటులు మీఱఁ బోరిలో
వైరిమనోరథంబులను వానిరథంబులఁగూల్చి పొల్చు నా
తేరులవారు గల్గునరదేవున కెద్ది యసాధ్యమే ధరన్ ॥ 84

అశ్వబల ప్రశంస

కం॥ ఏటికిఁ గరు లేటికి నరు
లేటికి మఱి రథచయంబు లీధరలోనన్
నీటగు జయము లొసంగెడి
ఘోటకములె చాలఁగలఁ గువలయపతికిన్ ॥ 85

సీ॥ నిలిచెనా యడుగులోనే నిల్చి చిత్రమై
కదలెనా బాణవేగము దెరల్చి
యనినిఁ గైదువుల సాధనకానిగతిఁ బొల్చి
దాఁటెనా లేఁడిచందం బదల్చి

గమకించెనా సింహగమనంబు గమకించి
యడఁగెనా తాఁబేటియనువు మించి
చుట్టెనా వేడెంబు సుడిగాడ్పు నదలించి
బెళికెనా బేడిసబెళుకు బెళికి
గీ॥ యెడమ కుడి వాగెబాగుల నెఱిఁగి తిరుగ
నిరుదెఱఁగు మోము లనఁదగి హరువు మురువు
వెఱవు నొఱపును గడుమించు నరుడుబిరుదు
నదుటు నుదుటొందు తేజి రాజార్హమంద్రు ॥ 86

చం॥ తలఁప నవేళలన్ మిగులఁ దాఁ దగులై తగునట్టి పుట్టపై
యల రణభూమి పేరఁదగు నంబుధి దాఁటగ మేటితేఁపపై
నలరగఁ గ్రీడలన్మెలఁగు నప్పుడు దా వెలలేని రత్నపై
జెలఁగెడు గుఱ్ఱ మేహితము సేయుచు నాయకుఁ డైనవానికిన్ ॥

చం॥ బలువగు కందముం బిరుదు బంగరుచాయహసించు సంపదల్
గల పరిపూర్ణదేహము విలాసముఁ జిక్కఁదనంబు నోజయుం
గళలును జెల్వు తేటతెలిగన్నులు లక్షణముం జవంబునుం
గలిగిన తేజులన్ సిరులు గైకొను భూభుజుఁ డేలఁగాఁ దగున్ ॥

కం॥ ఏ నరపతి గుఱ్ఱంబుల
సేనలచే మిగులఁ బ్రబలు క్షితిలో నెపుడున్
వానిది సిరి వానిది ధర
వానిదె జయలక్ష్మి కీర్తి వానిదె సుమ్మీ ॥ 89

చం॥ ఈగతి నీతిమార్గమున నెంతయు సుస్థిరుఁడై నృపరాజు దా
ధీగరిమన్ వహింపుచును దిగ్విజయంబును సర్వసంపదల్
భోగము గల్మియుం గలిగి భూవిభులెల్లను జేరికొల్వ ను
ద్యోగము లెల్లఁజేకుర సుఖోన్నతి రాజ్యముసేయు నిచ్చలున్ ॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీరుహభృంగదనూనమానసో
దార మదారివీరవరదర్పవిమర్దన దుర్దమక్రియా
స్ఫారభుజాబలాధిక విసారిత పూరితలోక సద్యశో
హారవిహారమానితమహాకరివాజివిరాజితాంగణా ॥ 91

మంగళమహాశ్రీ ॥

శ్రీమహితధామనుత సింధువృతభూస్థలివిశిష్టహితభాసిత గుణశ్రీ
కాముకకథాకృతినికాయకృతివర్జిత ప్రకాశిత నయాధిక జయశ్రీ
రామ హిమధామ శరరాజి సురరాజ తరురాజిత విశాలసుయశశ్శ్రీ
భూమరమణీయనిజభూజనసుఖప్రదప్రభుత్వయుతమంగళమహాశ్రీ

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు సేనావివరంబును, సేనాపతిప్రభావంబును గూటయుద్ధప్రకారంబును చతురంగబలప్రయోజనంబులును దద్భూములును వ్యసనంబులును వారితోషికంబును చతురంగబలప్రశంసయు నున్నది సర్వంబు నష్టమాశ్వాసము.

మ॥ రమణీయంబుగశాలివాహశకవర్షంబుల్ గతంబైన సహ
స్రము సేనూఱును నాఱునై వెలయఁగా బ్రౌఢిం దెనింగించి రౌ
ర మహిం దిమ్మయ వెంకటాద్రి విభుపేరన్ వేడ్కఁగామందకీ
యము శ్రీవేంకటరామకృష్ణులు స్వభావస్వచ్ఛంబునన్ రూఢిగన్॥

శ్రీ శ్రీ శ్రీ

Rathna Press, Tirupati — 1950.